అవిజ్ఞానైః కైశ్చిత్ పరవిషయశాస్త్రప్రియ నుతి
ప్రసక్తైః పూర్వాలంకృతికరణ మార్గే స్వచరితైః
యశో నన్నార్యస్యాక్రియత కలుషీభూత మధునా
పునస్సంజాతోఽహం కృతకలుష నిష్కాసనపటుః.

ప్రభుపద సునివిష్టైః నూన మజ్ఞాతపూర్వా
సుకవిభి రపిచ పూర్వైః కాళిదాసాదిభిశ్చ
మధురమధుర వాణైః నన్నపార్యస్య గాథా
కథనపటు రపూర్వా శక్తి రుజ్జృంభతే సా.

తస్య ప్రతిభాలేశః సర్వేషా మాంధ్ర సుకవితాశ్రీః
కథితా చేత్సా మహితా స నన్నభట్టః కిమాకారః?

వాల్మీకిం నన్నార్యం త్యక్త్వా కవిరస్తి వా జగత్యన్యః
శశిమాళి పింఛమాళీ త్యక్త్వా దేవో స్తికో వాన్యః?

అస్మిన్ కాలే బహుతర పరిభ్రాంతి సంమగ్న చేతాః
లోకస్సమ్యఙ్మనన చరణాపేతశీలే నివిష్టః
భావై రన్యైశ్చ చరమ దిశాంధ్యోద్గతై ర్లుప్త దృష్టిః
కో వా తస్మిన్ ప్రభవతి పునశ్చాంజసా కల్పనాయ.

తత్రాపి ప్రయతేఽహం నన్నార్యస్య మహాగిరాం
కాలుష్య నిరాసార్థం నన్నామ్నా సత్యతాం స్మరన్

విశ్వనాథ కులోద్భూతః సత్యనారాయణశ్శ్వకీ
సత్కవీనాం శిరోరత్నం వ్యాఖ్యాతౄణాం శిరోమణిః.

పూర్వైర్లాక్షణికైర్గుణాది విభవం నిర్వర్ణ్యమానైర్భృశం
నోక్తం ప్రాతిభముజ్జ్వలద్బహుకథా నిర్మాణనైపుణ్యకృత్
నన్నార్యస్య మహాకథాకథన మప్యజ్ఞాత మన్యైర్బుధైః
వ్యాఖ్యాస్యామి తదత్రసత్కవిజనాః ప్రీణంతు గాఢాధియః.

విశ్వనాథ సత్యనారాయణ.

# తొలిమాట

శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషుయే
లోకానాంస్థితి మావహంత్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషాస్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే.

ఇది నన్నయ్యగారి భారతాద్యాశీ శ్లోకము. నన్నయ్య గారు రెండున్నర పర్వములు వ్రాసినది జగద్విదితము. తరువాతి భాగము తిక్కన్న యెఱ్ఱనలు వ్రాసినదియు నట్టిదే. భవభూతి

"లౌకికానాంహి సాధూనా మర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోఽనుధావతి"

యన్నాడు. లౌకికులైన సాధువులయొక్క యర్థమును వాక్కనుసరించుచున్నది. అన్యులైన ఋషులవాక్కు నర్థ మనుసరించుచున్నది. అనఁగా నెవ్వనినోటివెంట వచ్చిన వాక్కు చివరి కర్థవంతమగునో యతఁడాద్యుఁడైన ఋషి యనుటకు సందియము లేకపోవచ్చును. నన్నయ్యగారు తొలుత నీ మహాభారతము నారంభించునపుడు తెనుగు భారతము ముచ్వురిచేత మూఁడువందల యేండ్లకుఁ బూరింపఁబడుట జరుగునని యనుకొనినవాఁడు కాఁడుకదా! వాంఛించుటకూడ చేయఁడు. అట్టి స్థితిలో నీ భారతపూరణము చిరకాలమున ముచ్వురిచేత

జరుగు నన్న యర్థ మీ శ్లోకమునందు స్ఫూర్తి నతిశయించిన విస్పష్టతతో భాసించినచో నన్నయ్యగారు 'అద్భుతమైన ఋషి' యనవచ్చును. నన్నయ్యగారు వేయియేండ్ల క్రింద బ్రతికిన యొకపురుషుఁడు. ఆయన యాద్భుతమైన ఋషి యెట్లగును? అని యనుకొననుగాదు ఋషి యనఁగా ఋషి యాత్మకలవాడని యర్థము. ఈ మహాచైతన్యము నిత్యమైనది. మహర్షుల యాత్మలు సదా భ్రమణలో నొకవేళ నొకచోట లేశతః కాని యంశతః కాని నివసించవచ్చును. అట్టి యాత్మ నన్నయ్యగారి దని భావించుటకు వీలున్నది. ఇందు పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరులు నారాయణబ్రహ్మ పరమేశ్వరులు. క్రింది వచనములో హరిహర హిరణ్యగర్భు లని సమాసము చేయఁబడి యున్నది. విష్ణువును శివుఁడును బ్రహ్మయు. ఈ వరుసకాక విష్ణువు బ్రహ్మయు శివుడుగా శ్లోకమునందుఁ జెప్ప బడి యున్నది. పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరు లన్న సమాసములోని వరుస ఛందఃపాతితమందము. ఋష్యాత్మకు ఛందోవతారమున కవినాభావము. అందుకనియే యచ్చటనే ఋష్యాత్మ యున్నదనుట. నారాయణశబ్ద భవము నన్నయ. అంబుజభవుడు బ్రహ్మ. తిక్కన్నగారికిఁ గవిబ్రహ్మ యన్న బిరుదు వచ్చెను. శ్రీకంధరుడు పరమేశ్వరుడు. ఎఱ్ఱన్న ప్రబంధ పరమేశ్వరుడు. నన్నయ్య, కవిబ్రహ్మ, ప్రబంధ పరమేశ్వరుడు పురుషోత్తమాంబుజభవశ్రీ కంధరులు. వీరు వేదత్రయ మూర్తులు. వేదముయొక్క ముగ్గురు మూర్తులు మూఁడు వేదముల మూర్తులు. భారతమునకుఁ బంచమవేదమని పేరు. ఈ భారతము నీ ముగ్గురు వ్రాసిరి. వీరు వక్షోముఖాంగ

ములయందు శ్రీ వాణీగిరిజలను జిరకాలము ధరించినవారు. చిరాయ యనుటలో మూడువందలయేండ్లు ధ్వనించినది. శ్రీ యనఁగా మోక్షము. తత్స్వామ్యము సారస్వతప్రక్రియయొఱుఁగని యాంధ్రభాషకుఁ దదవతారము నన్నయ్యగారు వక్షస్సునం దుద్భవింపఁ జేసినారు. ఆంధ్రభారతము నన్నయ్యగారి జోమున నుండి పుట్టినది నన్నయ్యగారిబిడ్డ. కడుపునపుట్టిన బిడ్డను బోగసుఁడని యందురు. నన్నయభట్టు వహించుచున్నాడనఁగా భారతము నన్నయ్యగారిబిడ్డ. నన్నయ్య భారతమునకు జనిహేతు వగుచున్నాడు. కవి బహ్మయైన తిక్కన్న ముఖమునందు వాణిని ధరించు చున్నాడు. పదునేను పర్వములు వ్రాసిన యీ మహానుభావుఁడు ముఖమనఁగాఁ బ్రాధాన్యవివక్షచేతఁ బ్రచుర మైన గ్రంథమును వాక్కుచేత ననఁగాఁ దెనుగుభాషయొక్క జీవముచేత నుడికారముచేతఁ బలుకుబడిచేత ననంతాచ్ఛాంధ్రి శబ్ద సంయోజనముచేత ధరించుచున్నాడని యర్థము. ప్రబంధ పరమేశ్వరుడు అంగమునందు ననగా నేకదేశమునందు గిరిజను ధరించుచున్నాడు. గిరిజ - అలుక్సమాసము, గీశ్శబ్దముయొక్క సప్తమ్యేకవచనము. గిరి వాణియందుఁబుట్టినది. అనగానన్నయ్య తిక్కన్నల ననుసరించి యెఱ్ఱన్న వ్రాసినాడని. కాన ప్రధాన ముగా దిక్కన్నగారి ననుసరించె ననిగాని చెప్పవచ్చును. నన్నయ్యగారు శ్రీని వహించినవాడు. తిక్కన్నగారు వాణిని ధరించినవాడు కనుక. ప్రాస్తావికముగా నొకమాట చెప్పెదను. అరణ్య పర్వశేషమునందు నెఱ్ఱన్న నన్నయ్యగారి ననుసరించితి నని "తద్రచనయకా" యని చెప్పినను నెఱ్ఱన్న హరివంశపాత కులను నాతడు తిక్కన్నగారిమార్గము నెంత యనుసరించెనో

తెలియును. కొంత పద్యరచన కొంతవఱకు సమాసరచన నన్నయ్యగారివలెఁ జేయవలయు నని యెఱ్ఱన్న ప్రయత్నించెను కాని ప్రధానముగా నెఱ్ఱన్న తిక్కన్నగారి శిష్యుఁడు.

ఈ రీతిగా నీ శ్లోకమునందు ఆంధ్ర భారతరచనకుఁ గాలము పట్టుననియు, దానిని మువ్వురు పూరింతు రనియు, వారి లక్షణము లివి యివి యనియు నిరూపింపఁబడినది. ఇదియ నన్నయ్యగా రాద్యుఁడైన ఋషి యనుట.

నా విమర్శపద్ధతికి నా చెప్పఁబోవునది యనవసరము. కాని యూఱకే వ్రాయుచున్నాను. 'వక్షోముఖాంగేషు' అన్నది యవయవద్వంద్వము, అవయవద్వంద్వమేకవద్భావము పొందును. ఇందు బహువచన ప్రయోగ మున్నది. వక్షోముఖాంగములు మూఁడును మువ్వురివి కాని యేకవ్యక్తివి కావు. ఏకవద్భావన చేసినను గ్రమస్ఫూర్తిచేత భాసించక తప్పదు, ఐనను నన్నయ్యగారి శాసన మిట్లున్నది. వార్తిక కారునివలె వ్రాసినాడు.

మఱియు నెఱ్ఱన్నగారికి లక్ష్యమైన శ్రీకంఠరశబ్దములో శ్రీ వాణీ గిరిజలలోఁ దనకు సంబంధించిన శ్రీకారము సంయోగ పరుపఁబడినది. ఇదికూడ 'దన రచనయకా' యన్న యెఱ్ఱన్న ప్రతినకు స్ఫోరకముగా నున్నది.

ఋషియైన నన్నయ్య వాక్కిట్లు ప్రసరించినది. 'చిరాయ' శబ్దబలమునవలన మూఁడువందలయేండ్లు సాఁగి "తస్యవాచ మర్థోనుధావత్॥"

నే నీ వ్యాసములయందుఁ బ్రధానముగా గథాకథన వైఖరియే చెప్పుచున్నాను. ఈ వ్యాసములు చదువునపుడు నే నే కథ వ్రాయుచున్నానో యా కథను ముందు నన్నయ్య గారి భారతములోఁ జదివి యా గ్రంథమును దగ్గఱఁబెట్టికొని యీ వ్యాసములు చదువవలయును. అట్లు చేయనిచోఁ జాల మంది పాఠకులకు నన్నయ్యగారి కథారచనా సౌందర్యము తెలియక పోవచ్చును. ఈ కథాశిల్పమునకు సూచనగా ముందీ కథ చిన్నది మూలముతో వేయుచున్నాను. ఈ రీతిగా సర్వగ్రంథము చేయుటకు వీలు లేదుకదా! ఈచిన్న కథవలనఁ గథాగతమయిన సర్వములైన మార్పులు నిట్లుండు నని తెలియఁగలదు.

ఇది గాంధారీ వివాహ కథ.

"ఇట్లు రాజ్యము సేయుచు నారూఢయౌవనుండై యున్న ధృతరాష్ట్రునకు వివాహంబు సేయ సమకట్టి భీష్ముఁడు గాంధారపతియయిన సుబలుకూఁతు గాంధారి యనుదాని నతిశయరూప లావణ్య శీలాభిజాత్య సమన్వితఁగా బ్రాహ్మణులవలన విని విదురున కిట్లనియె.

ఈ వంశము విచ్ఛేదము
గావచ్చినఁ గులము నిలుపఁగా సత్యవతీ
దేవి వచనమున సంతతి
గావించెను వ్యాసుఁ డను జగత్కర్త దయన్.

ఈ కులము వివర్ధింపఁగ
నా కభిమత మేనువింటి నలినేక్షణ దా
నేకశత సుతులఁ బడయఁగ
నాకన్యక వరము వడసె నఁట హరుచేతన్.

కావున ధృతరాష్ట్రునకు గాంధారిని వివాహంబు సేయుదము. గాంధారిపతి మనతోడి సంబంధంబునకుం దగు నని నిశ్చయించి సుబలుపాలికిఁ దగు మనుష్యులం బంచిన సుబలుండును సుముఖుండై కురుకుల విస్తారకుం డయిన ధృతరాష్ట్రుండ యిక్కన్యకు నర్హుండు గావున నారాజునకు గాంధారి నిచ్చితి ననిన వానిబంధు జనంబు లెల్లఁ నమతో నిట్లనిరి.

అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టి కన్నులు లేవను టంతెకాక
యుత్తముఁడుగాఁడె సద్గుణయుక్తి నతఁడు.

అనిన వారి పలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకుఁ బితృవచనదత్తగాఁ దన్ను నిశ్చయించి నాకుఁ బతి యమ్మహీపతియ కాని యొరుల నొల్ల నని పరమ పతివ్రత పరపురుష సందర్శనంబు పరిహరించి తనపతి కనుగుణంబుగా నేత్రపట్టంబు గట్టికొని యుండె.''

సంస్కృతభారతములో నీ కొంచెము కథయుఁ బెద్దగాఁ జెప్పఁ బడినది. నన్నయ్యగారు దాని నిట్లు కుదించినాడు.

నన్నయ్యగారు కథయొక్క ప్రాణమును బట్టికొని నొక్కను గాని కథలోని వివిధాంశములను బెంచరు. వివిధాంశములను బెంచుట యొకపద్ధతి, కథయొక్క ప్రాణములను బిగించి పట్టుట యొకపద్ధతి. దానికి దీనికి సంబంధము లేదు. లోకములో నూటికిఁ దొంబది తొమ్మండుగురు కవులు కథాంశములనుఁ బెంచి ప్రసంగమును వృద్ధిపఱచి లోకోక్తులు, గడుసు పలుకుఁబళ్ళు, మనోభావ చిత్రణములు విస్తరించి చేయుకవులు. నన్నయ్యగారికి నితరకవులకు సంబంధము లేదు. ఆయన కథకోసము తదితర విషయములను జెప్పినచోఁ జెప్పును. తాను వ్రాయుచున్నది భారతము. వ్యాసభారత మచ్చట నున్నది. ఆయన పని దానికి నకలు దింపుటగాదు. అందులోని కథలను వ్యాఖ్యానము చేయుట. ఆ కథలలోని రహస్యములనుఁ బట్టిచూపించుట. ఆ కథ లెందుకున్నవో వానిలోని మర్మమును చెప్పుట. అవి పూర్వ కథలు. ఆ కథ లట్లు జరుగుటలోని యౌచిత్యమును గొంద ఱాలోచనాపరులు శంకించవచ్చును, ఆశంకలను సప్రతిపత్తికములైన సమాధానములతో నన్నయ్యగారు తన కథలు తీర్చెను.

రామాయణ భారతములు సంస్కృతములో వాల్మీకి వ్యాసులు వ్రాసిరి. ఆ మహాగ్రంథములు రెండును బహు రహస్యములతో నిండియున్నవి. వైదికరహస్యము లనంతము లున్నవి. వాని నట్లుంచి కథాగత మర్మములు బోలెడున్నవి. వాని నన్నిటిని లోకము గ్రహించక పోవచ్చును. రామాయణ

గత రామచంద్రుని యుద్ధనీతి మురారి తన యనర్ఘ రాఘవ మున వివరించెను. భాసుడు తన ప్రతిమలో రామునియొక్క మఱల రాజగుటయొక్క యోగ్యతను నిర్ణయించెను. ఇట్లు భారతకథలోగూడఁ జిక్కులు కలవు. తన వ్రాసినంత మేరలో నన్నయ్యగారీ దృష్టితో భారతమును వ్రాసిరి. అందుకనియే తన కావ్యమునందలి ప్రధానగుణము ప్రసన్న కథాకలితార్థ యుక్తి యని చెప్పినాడు. భారత కథలలోని కథలయొక్క ప్రసన్నత యిందుఁ బ్రత్యక్షమగును. ఈ చిన్నకథ చూతము. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. రాజ్యార్హుడు కావచ్చును. కాక పోనువచ్చును. ధృతరాష్ట్రునకుఁ బిల్ల నెవ్వరు నీయరు. అతనికి వివాహ మెట్లగును? ధాత్రి రాజకుమారులకు గొడ్డుపోలేదు. ధృతరాష్ట్రునకు వివాహమగుట కష్టము. తుదకు నే కుంటి పిల్లనో, గ్రుడ్డిపిల్లనో చేసికొనవలయును. అట్లుకాక సులక్షణ వతియైన గాంధారి యాయనకు భార్యయైన దనగా నట్టిపిల్ల నాయన కెట్లిచ్చి రని సందేహముకలుగకమానదు. ఇది లోక స్వభావము. ఆ సందేహము నివర్తింపఁబడుటకు దానికి నన్నయ్యగారు హేతుకల్పన చేయును. ఆ హేతుకల్పన చేయుటలో నాయన తన శిల్పమును జూపును. తాను వ్యాఖ్యాతవలెఁ జేయఁడు. మహాకవివలెఁ జేయును. ఈ యర్థ ప్రతిపాదనముకొఱకు నీ పయికథలో మూఁడు మాటలనే నిక్షేపించెను. గాంధారి తండ్రియైన సుబలుఁడు 'ఆ రాజునకు గాంధారి నిచ్చితి'ననిన యిది యొకమాట. రెండవది 'బంధు జనమ్ములు తమంతో నిట్లనిరి', మూడవది 'అనిన నాపలుకులు విని గాంధారి' మొదలైనది.

ఈమూఁడు మాటలలో నీ కథారహస్య మెట్లిమిడి యున్నదో చూతము. రాజచ్ఛిత్తి ననఁగా బంధువులు తమలో ననుకొనిరి. రాజున కెదురు మాటాడు శక్తి బంధువులకు లేదు. అతఁడిచ్ఛిత్తి ననుటచేత నతఁ డెంత చెప్పిన నంతియే యన్న మాట. అతఁడంత యుద్ధతుఁడు. అతని కెదురు మాటాడువారు లేరు. భార్యగాని మేనమామలుగాని యతనిమాట కెదు రాడుటకు వీలులేదు. ఆయన యట్టివాఁడు. ఈ సంగతి యీ యొక్క మాటతో నెఱుక పడినది. వారు చేయునది లేక తమలోఁ దాము గుసగుస లాడిరి ఆ గుసగుస లాడుటకూడ నెట్లాడిరి? గాంధారికిఁ దెలియున ట్లాడిరి. గాంధారికిఁ జెప్పినట్లు కాదు. ఆమె యీ పలుకులు వినవలయును. "మేము చెప్పలేదు ఆమె విన్నదేమో" యని వారు తప్పించుకొనుటకు వీలుగా నుండవలయును. కాని యీమె విని తండ్రి కెదురు తిరుగ వలయును. అని వారి యుద్దేశ్యము. కాని యీమె యొక విలక్షణమైన బుద్ధి కలది. ఆమె తండ్రి యెంత చెప్పినచో నంతియే. సామాన్యముగా లోకములో గృహపతి తా నెంత చెప్పిన నంతగాఁ బ్రవర్తించువాఁ డయినచో నెదిరిమాట చెల్లనీయని వాఁడైనచో భార్యయుఁ గూతుండ్రును వాని యిష్ట ప్రకారమే నడతురు. అతని కెదురే తిరుగరు. గాంధారియు నట్లే. ఆమె తల్లియొక్క ప్రసక్తి లేదు. సుబలుఁడు భార్య నెట్టి విషయములోనను లెక్కసేయఁడు. ఆమె యిష్టానిష్టములతోఁ బనిలేదు. సమర్థులై యుద్ధతులై సులభకోపులైన భర్తల తోడి భార్య లట్లే యుందురు.

ఈ లోకరహస్య మంతయు నన్నయ్యగారి మూఁడు మాటలలో సమిడ్చెను. ఇది నన్నయ్యగారి శిల్పము.

నన్నయ్యగారి భారతము నీ దృష్టితోఁ జదివినచో నన్నయ్యగారి లోకాతిశాయి రచనా సౌభాగ్యము తెలియఁగలదు. కథ నిట్లు తీర్చుట నాఁడున్నట్లో దగ్గ్యపియము.

నన్నయ్యగారిది పరమమైన యాలంకారిక రచన.

ఈ రీతిగాఁ గథను గథలోని పాత్రలను నొకమాటచేత నొక వాక్యముచేతఁ దీర్మానించుచు వెళ్ళెడివాఁడు విస్తరించి వ్రాయఁడు. విస్తరించి వ్రాయుట యాతని శిల్పలక్షణమునకు వ్యతిరేకము.

ఇది యితిహాసము. కావ్యము కాదు. అందుచేత నిట్లే వ్రాయవలయును.

ఈ గాంధారీ వివాహకథ మిక్కిలి కుదించి వ్రాసెను. దీనినిఁ బెంచలేదు. పెంచఁగూడదు. ప్రధానకథ ముందున్నది. ప్రతి చిన్నకథయుఁ బెంచి దాని కది యొక స్వాతంత్ర్య కావ్యముగాఁ జేసినచోఁ బ్రధానకథ దెబ్బతినును. అసలు కథ పెంచవలయును. మఱి కొంచెము పెద్ద కథలైనచోఁ గొంచెముగాఁ బెంచవచ్చును.

భారతము శాంతరస ప్రధానము. ఆరసమును దృష్టియందుంచుకొని తక్కిన రసములను సంయోజన పఱుపవలయును. ఇతరరసము లీ రసమునకు లొంగి యుండవలయును. శృంగారాది రసములను బెంచి వ్రాసినచో భారతముయొక్క ప్రధాన

రసమైన శాంతము వీఁగిపోవును. ఇతిహాసస్థితి పోయి కావ్యస్థితి వచ్చును. అందుకనియే జూదమువేళ భీముడు తన ప్రతిజ్ఞ నొక పద్యముతోఁ జెప్పి యూరకుండును. రౌద్రరసాదుల ప్రసక్తి వచ్చినచో నన్నయ్యగారు తత్తద్రసములను మఱియొక రసమునకో భావమునకో యంగముచేసి గుణీభూతవ్యంగ్య ముగామార్చి ప్రధానరసమయిన శాంతరసమునకు భంగము కలిగించకుండ రక్షించుచుండును.

ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీని కే మొడం బడ మసదుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై నడిమెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభ న్సహదేవుఁ డట్టిచో నుడిగి సభాసదు ల్పలుక కుండిరి తద్దయు భీతచిత్తులై"

ఇందు సహదేవుని రౌద్రము సభాసదుల భీతికంగమైనది. ఇచట సహదేవుడు తన కోపమును నైదాఱు పద్యములలోఁ బ్రకటించినచోఁ దత్కాలమున రౌద్ర రసము ప్రతీయ మానము కావచ్చును. ఐనచోఁ ప్రధాన రసము దెబ్బతినును.

నన్నయ్యగారి రచన యింత జాగ్రత్తగా రసదృష్టితోఁ గథాసామ్యవినిమీలనదృష్టితోఁ జూచుచుఁ జదువుకొనుచుండవలయు నని పండితులకు మనవి.

ఈ లోకరహస్య మంతయు నన్నయ్యగారీ మూఁడు మాటలలో సమిడ్చెను. ఇది నన్నయ్యగారి శిల్పము.

నన్నయ్యగారి భారతము నీ దృష్టితోఁ జదివినచో నన్నయ్యగారి లోకాతిశాయి రచనా సౌభాగ్యము తెలియఁగలదు. కథ నిట్లు తీర్చుట నాఽన్యతో దర్శనీయము.

నన్నయ్యగారిది పరమమైన యాలంకారిక రచన.

ఈ రీతిగాఁ గథను గథలోని పాత్రలను నొకమాటచేత నొక వాక్యముచేతఁ దీర్మానించుచు వెళ్ళెడివాఁడు విస్తరించి వ్రాయఁడు. విస్తరించి వ్రాయుట యాతని శిల్పలక్షణమునకు వ్యతిరేకము.

ఇది యితిహాసము. కావ్యము కాదు. అందుచేత నిట్లే వ్రాయవలయును.

ఈ గాంధారీ వివాహకథ మిక్కిలి కుదించి వ్రాసెను. దీనిఁ బెంచలేదు. పెంచఁగూడదు. ప్రధానకథ ముందున్నది. ప్రతి చిన్నకథయుఁ బెంచి దాని కది యొక స్వతంత్ర కావ్యముగాఁ జేసినచోఁ బ్రధానకథ దెబ్బతినును. అసలు కథ పెంచవలయును. మఱి కొంచెము పెద్ద కథలైనచోఁ గొంచెముగాఁ బెంచవచ్చును.

భారతము శాంతరస ప్రధానము. ఆరసమును దృష్టియందుంచుకొని తక్కిన రసములను సంయోజన పఱుపవలయును. ఇతరరసము లీ రసమునకు లొంగి యుండవలయును. రౌద్రాది రసములను బెంచి వ్రాసినచో భారతముయొక్క ప్రధాన

రసమైన శాంతము వీఁగిపోవును. ఇతిహాసస్థితి పోయి కావ్యస్థితి వచ్చును. అందుకనియే జూదము వేళ భీముడు తన ప్రతిజ్ఞ నొక పద్యముతోఁ జెప్పి యూరకుండును. రౌద్రరసాదుల ప్రసక్తి వచ్చినచో నన్నయ్యగారు తత్తద్రసములను మఱియొక రసమునకో భావమునకో యంగముచేసి గుణీభూతవ్యంగ్య ముగామార్చి ప్రధానరసమయిన శాంతరసమునకు భంగము కలిగించకుండ రక్షించుచుండును.

ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీని కే మొడం
బడ మను దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభ న్సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదు ల్పలుక కుండిరి తద్దయు భీతచిత్తులై "

ఇందు సహదేవుని రౌద్రము సభాసదుల భీతికంగమైనది. ఇచట సహదేవుడు తన కోపమును నైదాఱు పద్యములలోఁ బ్రకటించినచోఁ దత్కాలమున రౌద్ర రసము ప్రతీయ మానము కావచ్చును. ఐనచోఁ బ్రధాన రసము దెబ్బతినును.

నన్నయ్యగారి రచన మింత జాగ్రత్తగా రసదృష్టితోఁ గథాహాస్యవినిమీలనదృష్టితోఁ జూచుచుఁ జదువుకొను చుండవలయు నని పండితులకు మనవి.

# నన్నయ్యగారి
# ప్రసన్నకథా కవితార్థ యుక్తి

సారమతిన్ కవీంద్రులు ప్రసన్నకథా కవితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్.

ఈ పద్యములో నన్నయ్యగారు తన కవితా ప్రపంచ
మున గల యనేక గుణములను పేర్కొనక మూఁడు గుణము
లనే ప్రధానముగా చెప్పికొనియెను. మొదటిది ప్రసన్నకథా
కలితార్థయుక్తి. రెండవది అక్షరరమ్యత. మూఁడవది నానా
రుచిరార్థసూక్తులు. వీనిలో నన్నయ్యకు మొదటిది మూఁడవది
యనుగుణంబులం దభిమానము కలిగినట్లు, రెండవదానియందు
తక్కువ యభిమాన మున్నట్లును కనిపించుచున్నది. తన
కవితలో నానారుచిరార్థసూక్తు లుండుట నన్నయ్యగారు
తన కది యొక బిరుదముగా చెప్పికొన్నట్లు భాసించుచున్నది.
పరిశీలింపఁగా నీకాలమున ఆయన తాను ప్రత్యేకముగా చెప్పిన
ఈ రెండు గుణములయందును లోక మాదరము చూపుచున్న
దనుటకు నిదర్శనము కనిపించుటలేదు. నన్నయ్యగారిసూక్తులు
జగత్ప్రథితములు. ప్రతిధర్మము వేరొక పద్యముగా వ్రాయ
బడియుండును. పూర్వకాలమున నీ సూక్తులు దేశమునందు
జనులు బహుధా వాడుకొనెడువారేమో? కొన్ని పద్యములు

నా చిన్నతనములోఁగూడ ప్రావాహికముగా జీవితయాత్రలో పల్లెటూళ్ళలో వాడుకొనుట నే నెఱుగుదును. ఈనాడు సంస్కృతలోనున్న సూక్తులే గీర్వాణ భాషావేత్తలు లోకవృత్తమున నుపయోగింతురు. ఆ సూక్తులనే సంస్కృతము రానివారుకూడ తప్పులతడకలుగా చదువుచుందురు. భారతములోని నన్నయ యనేకసూక్తిపద్యములు తెలుగుజీవితములో నుండి బహిర్గమించినవి. దీనికి ప్రధాన కారణ మింగ్లీషు చదువు. ఆ యింగ్లీషు చదువు మన కావ్యములను పాశ్చాత్య విమర్శదృష్టితో చదువు నలవాటు చేసినది. పాశ్చాత్య విమర్శ సూత్రములు పట్టించి దాని కాగని కవిత కవితకానట్లు, కవి కవికానట్లు చెప్పింపఁజొచ్చినది. మఱియును సుష్ఠు శబ్దజ్ఞానములేని పలుమంది విమర్శకులై యున్న విషయమును సరిగా చూడక లేనిదాని తమ మనస్సులలో కల్పించుకొని యిష్టము వచ్చినచోటుల నధికగుణారోపణచేయుచు నుండుచుండిరి.

కొన్నిచోట్ల కొన్నివిచిత్రసిద్ధాంతములు వ్యాప్తిలోనికి వచ్చినవి. శబ్దము సర్వభావమును చెప్పలేదని యొక్క సిద్ధాంతము. నిజమైన కవియందు శబ్దాడంబర ముండదని యొక సిద్ధాంతము. మాటలు కొద్దిగా నుండవలయును. అర్థము దానికి కొన్ని రెట్లుండును. ఇదియే ధ్వని యని యొక సిద్ధాంతము. ఇది ధ్వని సిద్ధాంతముకాదు. స్ఫూర్తి కలుగుటకు దానికనువైన శబ్దముండిననే స్ఫూర్తి కలుగును. గాలిలో దీపము పెట్టి 'దేవుడా నీమహిమ' యనునది కవిత్వముకాదు. పాఠకులు

ఈ విషయమున కొన్ని పొరపాట్లు చేయుచుందురు. తా నింగ్లీషులో నొక యూహచేసి ఆయూహ తన కిష్టమువచ్చిన కవియొక్క కవితలో నుంచు ననుకొనుట. మరియొకకవి తా నేదియో వ్రాసి యందులో శబ్దము లందీయజాలని యర్థము తా నున్నదనుకొనును. ఇవి నేయార్థము లన్న కావ్యదోషములు. ధ్వని యనునది అచ్చటనున్న శబ్దముయొక్కయు, వాక్యముయొక్కయు శక్తివలన కలుగును. ఊరకే గాలిలో పుట్టదు. ఈధ్వని యనేకవిధము లైనది. వీనిలో రసధ్వని యనునదిపరమోత్తమమైనది. రసము, రసాభాసము, భావము, భావాభాసము, భావశాంతి, భావశబలత మొదలైన వన్నియు రసకక్ష్యలో చేరును. ఈ రసధ్వని రెండు విధములగా భాసించును. ఒకటి కవిశక్తిచేత. రెండవది రచనా శిల్పముచేత. రచనాశిల్పము మిక్కిలి గొప్పది. నన్నయ్యగారు ప్రసన్నకథాకలితార్థ యుక్తి యను చెప్పుటలో నీ రచనా శిల్పమునుగూడ భావించినారు. ప్రసన్న కథాకవితార్థయుక్తి అన్న సమాసమును నాలుగైదు విధములుగా పదవిభజనచేసి అర్థములు చెప్పవచ్చును. ప్రసన్నకథ యొక్క కవితార్థముయొక్క యుక్తి. అనగా కవితార్థములో ప్రసన్నమైన కథయుండుట. కథ ప్రసన్నమగుట. ఇట్లు రెండు మూడర్థములు చెప్పికొనినపుడు కథాకవితయను నొక శబ్ద మేర్పడి యింగ్లీషు భాషలో నున్న "Narrative poetry" అన్న శబ్దమునకు చక్కని యర్థముగా భాసించుచున్నది. కాని ఈ కథా కవితయన్నది మన పూర్వ లాక్షణికులలో చెప్పఁబడినట్లు కనిపించుట లేదు. అందుచేత నీ దృష్టియే మన పూర్వులకు లేదనుట

యుచు గలదు. ఇదికాక 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' యనియు పాఠాంతరము గలదు. ఈ పాఠమే యెక్కువ సమంజసముగాఁ గన్పించుచున్నది. సామంజస్యము రెండువిధములు. బహుతాళపత్రగ్రంథములయందు సమానముగా నున్న సామంజస్య మొకటి. అర్థపుష్టిచేతను, తత్కవియొక్క భావనాసజాతీయతచేతను సమకూడునది రెండవది. నన్నయ్య గారి కథానిర్మాణ వైఖరిసబట్టి చూచినచో 'ప్రసన్నకథా కలితార్థ యుక్తి' బాగుగా నున్నది. ప్రసన్నమైన కథతో గూడుకొనియున్న యర్థముల యోజన యని యర్థము. అనఁగా నచటనున్న యర్థములను చక్కఁగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్న మగును. అచట నున్న యర్థములను చక్కఁగా యోజించవలయును. అచటనున్న యర్థముల లోపల నారయవలయును. ఈ పని కవీంద్రులు చేయుదురు, చేసి మేలందు రని యీాయనయే చెప్పెను. లో నారయక మేలు కాదనుట న్యాయముకాదు.

రచనా శిల్ప మిందులోని భాగముగానే నన్నయ్యగారు భావించి యుందురు.

నన్నయ్యగారి తర్వాత కొన్ని వందలయేండ్లకు వచ్చిన రసగంగాధర కర్తగాని యీ రచనా శిల్పమును ప్రపంచించ లేదు. ఇది జగన్నాథ పండితునిచేత ప్రపంచించబడక పూర్వమే సర్వమహాకవులయందును భాసించు చున్నది. వ్యాసుఁడు వేదములను విడదీసినట్లు లాక్షణికులు కవితా లక్షణములను విడఁదీసిరి. ప్రస్తుతము నా చెప్పఁ బూనినది

రచనా శిల్పమునుగూర్చి శాకపోయినను తత్పరామర్శ కొంచెము కావించెదను. ఎందువలన ననఁగా నీ రచనాశిల్పము చేతనే యరము ప్రసన్నమగును.

ఈ రచనాశిల్ప మనంతవిధములుగా నుండవచ్చును. ఒకచోట వృత్తముల నాశ్రయించి యుండవచ్చును. ఔచిత్య వేత్తలు దీనిని వృత్తౌచిత్య మనవచ్చును.

అరణ్యపర్వ ద్వితీయాశ్వాసాదియందు నన్నయ్యగారు నలోపాఖ్యానము వ్రాసినారు. అది రెండువందల యిరువది నాలుఁగు పద్యముల కథ. ఈ కథలో నెచ్చటను శార్దూలము గాని, మత్తేభముగాని వ్రాయఁబడలేదు. ఇది కరుణారసము ప్రధానముగాఁ గలిగినకథ. ఈ కథకు ఆ రెండు వృత్తములు పనికిరావని నన్నయ్యగారి నిష్కర్ష. ఇట్లే యెల్లచోటుల జూడవచ్చును. భిన్నవృత్తము నన్నయ్యగారు వాడినచో దాని ప్రయోజనము వేఱ యున్నదనియే వాడిరి. ఈ రీతిగా పరిణతమైన శిల్ప మాయన రచనయందు సర్వధా భాసించుచున్నది.

ఈ రచనాశిల్పము సూచికగా నొక చిన్నవిషయము వ్రాసెదను.

"చిరముగ బ్రహ్మకుఁ దపము జేసి యనంతుఁ డనంత ధారుణీ
భరగురు కార్యసక్తుఁ డయి పన్నగముఖ్యుల పొత్తుబాసి చె
చ్చెర తనయంత నుండి మదిచేర్చి తలంపడ యొక్కనాఁడు దు
ర్భరతరదందశూక కులభావి భయ ప్రవిఘాత కృత్యముల్."

ఈ పద్యము భవిష్యత్తులో జరుగబోవు సర్పయాగమును గూర్చి భయపడిన వాసుకి తన సహోదరులతో చెప్పినది. ఈ పద్యములో "అనంతధారుణీభర గురుకార్య శక్తు" డన్నది యొక సమాసము. చివరిచరణ మంతయు నొక పెద్దసమాసము. ఈ సమాసము లెందుకు? ఏది యైన ప్రయోజన మున్నచో నది శిల్పము, నిష్ప్రయోజన మైనచో శబ్దాడంబరము.

ఒక కుటుంబములో నొక యన్నగా రున్నారు. అతడు పెద్దయుద్యోగములో నుండి దూరదేశమునందు సుఖముగా నుండెను. ఇంటిదగ్గర నున్న కుటుంబము మిక్కిలి కష్టము లనుభవించు చుండును. "వాని కేమి మహారాజువలె నున్నాడు. మన మిచ్చట నానా బాధలు పడుచున్నాము" అనుట లోకమునందలి పద్ధతి. ఈ మాటలు నోటితో ననెడు వాడు అతడు సుఖముగా నుండుటయు, తాము బాధలు పడుటయు. మిక్కిలిగా చెప్పును. ఆ యర్థములను చెప్పు శబ్దములమీదఁ గాకువును ప్రయోగించును. "నానా యిబ్బందులూ పడుతున్నాము. నానాగడ్డీ తింటున్నాము" మొదలైన మాటలు ఆవేశముతో చెప్పును. ఈ యావేశము కావ్యములో నెట్లు కన నగును? నాటకములో రంగముమీద నటకుడు వాక్యగత భావమును తన వాచికముచే సాత్త్వికాద్యభినయముచే ప్రకాశింపఁజేయవచ్చును. "కావ్యేషు నాటకం రమ్యం" అను దానిలో కొంతరహస్య మియ్యదియే. పూర్వకాలమున నీ బాధలేదు. మన పూర్వుల ప్రకారము

కావ్యములు రెండురకములు. అనఁగా పాఠకుడు వినిపింపఁగా వినెడివి. ఎట్లు చదువవలయునో తెలిసినవాడే పాఠకుఁడు. వాఁడే చదివెడువాడు. చదువునప్పుడు సర్వార్థములు గోచరించెడివి. ఈ నాడా శ్రవ్య కావ్యములన్నియు పాఠ్యకావ్యములైనవి. అందరును పాఠకులుమాత్రము కాలేదు. ఈ దోషము జాతియందు సన్నిహితమై యది కావ్యగతమైనదివలెఁ గన్పించుచున్నది.

లోకము మాటాడుకొనునపుడు తాము చెప్పు నర్థము సువ్యక్తమగుటకును తమ కోపాదులు భాసింపఁజేయుటకును కొన్నిశబ్దములు బిగ్గరగా నావేశముతో నొక్కి చెప్పుదురు. ఇట్టిచోట్ల కవిశబ్దమయమైన మార్గాంతరముచేత వ్రాసి ప్రకాశింపఁజేయవలయును.

లోక మొకప్పుడు కోపముకొలఁది కఠినములైన శబ్దములను ప్రయోగించును. కవి తన కావ్యమునం దట్లే చేయును. ప్రేమ యున్నచోట సుకుమారముగా మాట్లాడును. పెద్దలతో ప్రసంగించునపుడు సభ్యములైన శబ్దములనే వాడును. లోక మెట్లో కవిత అట్లే. తత్తద్భావానుకూలముగ శబ్దములను వాడుట, కొన్ని యధిక ప్రయోజనములను సాధింపవలసి వచ్చినపుడు సమాసము లుపయోగించుట, ఆ సమాసములయొక్క హ్రస్వత్వము, దైర్ఘ్యము తత్తదావేశోచితస్ఫోరకముగా ప్రయోగించుట కవితాశిల్పము. ఇది మహాకవుల కుగ్గుపాలతో పెట్టిన విద్య. ఈ పై పద్యములో నున్న రెండు సమాసములయొక్క హ్రస్వత్వదీర్ఘత్వ

ములు సరిగా ఆ మాట లన్నవాని మనోవాగ్వ్యాపారముల రెండింటిని విస్పష్టముగా స్ఫురింపఁజేయును. దీనినే మన పూర్వులు రసధ్వని యనిరి. ఇది యిచ్చట సమాసగతమై కనపించు చున్నది. మరియొకచోట నన్వయగతమై యుండును. ఒకవిధముగా నేమి. బహువిధములుగా నుండును. ఇది రసధ్వని యనుట నుపలక్షకముగానే చెప్పితిని. నిష్కృష్టముగాఁ జెప్పవలయు నన్నచో నిట్టిరచన రసధ్వని కుద్దీప్తిహేతువు. అనఁగా నొక్కవేళ జెడము. రసకత్ప్యాభాగసక్తిప్త మన యిట్లు చెప్పితిని. నన్నయ్యగారి రచన సర్వత్ర యి ట్లుండును.

ఇట్టి వర్ణనలచోట నీ రచనాదీప్తి కనపించదు. ఆ వర్ణనాంశములు రసవ్యంజకేతరభాగములు. తత్స్పష్టి యుండదని కాదు. ఒకడు చెప్పు మాటలలో ప్రసంగమునో వాని కామక్రోధాది భావములు వాఁడు వెలువరుచుటలోనున్న మనుష్యహృదయస్పందనము వర్ణనాంశములో నుండదు. వర్ణనాంశములయందు కవియొక్క యుత్ప్రేక్షాది కల్పనాశక్తియు, పాఠకునియొక్క యూహాశక్తియు విజృంభమాణము లగుచుండును. అప్పటిరచన సర్వత్రి యీశిల్పమున కొగ్గను. ఈ శిల్ప మచటఁ దక్కువగా నుండును. అచట కవియొక్క శక్తి రసధ్వనీతరధ్వనులయందు ప్రకాశింప వచ్చును. ఆ ధ్వనులు వస్త్వలంకారముల నాశ్రయించి యుండవచ్చును.

ఇట్టి రచనా శిల్పముకంటె భిన్నమైన శిల్పము ప్రతి భాషయొక్క పద్యరచనయందుండును. శిల్పమనఁగా చేయుట యని యర్థముకాదు. ఒకానొక సౌందర్య మా పద్యరచన

యంచు భాసించుట, పద్య మెత్తుగడ బాగుండుట, దింపుగడ బాగుండుట, ప్రాస యతి స్థానములయందు కొన్నిరమ్యము లైన శబ్దములు ప్రయోగించి పద్యమంతయు బాగుగా నున్న దనిపించుట, పద్యము ధారాశుద్ధి కలిగియుండుట, ఇట్టివి పద్యమునకు సహజమైన సౌందర్యమును సంపాదించు లక్షణ ములు. పై నుదహరించిన నన్నయ్యగారి పద్యమువంటి పద్యమే తత్సామాన్య పద్యముకంటె నధిక మైనది. ఇతరపద్యముల యందు రమ్యముగా రచించినచో పద్యసౌందర్య ముండును. ఈ పై పద్యమునందు శిల్పసౌందర్య మున్నది.

ఈ శిల్ప మక్షరగతమైకూడ నుండును. పూర్వాలంకా రికులు చెప్పనిది నన్నయ్యగారు దీని నేకదేశ గణగతముగాఁ జేసినారు. చూడుడు.

"ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయఁగడఁగి సకల క్షత్రా
న్వయవీరుల రావించిన"

ఇది బాహుకుడు పర్ణాదునితో నన్నమాట. కంద పద్యముయొక్క రెండు నాలు చరణముల మొదల జగణము వేసినచో పద్య మొకవిచిత్రముగా విరుగును. ఈ విరుగుట వలన పద్యమున కొకశోభ వచ్చును. పద్య మూరకే యంద ముగా కనిపింపఁజేయుటకు నన్నయ్యగా రీ పని నెప్పుడును చేయరు. 'పునస్స్వయంవర' మని నొక్కుటచేత బాహుకుడైన నలుని యాక్షేపణ ద్యోతమానము గు చున్నది. ఆ యాక్షేప ణకు దీనివలన నుద్దీప్తి కలుగుచున్నది.

ఇట్లనంతవిధము లైన ధ్వని మార్గములయందు నన్నయ్యగారి రచన నిష్ణాతమై కనిపించుచున్నది. ఇది యంతయు పీఠికాప్రాయము. ఇట్లాయనకవితయందలి గుణము లను జెప్పఁబూనినచో నెంతయో గ్రంథమగును. ఈ విషయ ములను పరామర్శించి చెప్పుట 'లో నారయుట' కాదు. ఈ గుణములు చూచుటకు 'లో నారయ' నవసరములేదు. ఇది సుచరితమైన యాలంకారిక మార్గము. సర్వలాక్షణికులు వ్రాసినదియే. పండితుల కందఱకు పరిచితమైనదియే.

కవీంద్రులు 'లో నారసి మే లన' దగిన ప్రసన్నకథా కలితార్థ యుక్తి యెట్టిది? ఇదియే లోకోత్తరమైన శిల్పము. ఇంతకంటె తా నేదియో అధికముగాఁ జేసినగదా కవీంద్రులు లో నారసి మే లనవలయును. అది యెట్టిది? ఏయితరమహా కవులకు తెలియరానిది. ఏ యితర మహాకవులు చేయనిది. తా నేదియో చేసినట్లు చెప్పికొనినాఁడే-అదియేది?

తాను భారతము రచించుచున్నాఁడు. భారతమునం దుపాఖ్యానములు వేలున్నవి. ప్రధానకథ యున్నది. ముందర యుపాఖ్యానము లెట్లు తీర్చెనో చూచి ప్రధానకథ పొంతకు పోదము. అన్ని యుపాఖ్యానములను పరిశీలించుటకు వేళ చాలదు. గ్రంథము చాలదు. స్థూలముగా నైదా రుపాఖ్యాన ముల స్వరూపము పరిశీలించి ప్రధానకథను కొంత పరిశీలించి నచో స్థాలీ పులాక న్యాయ్యమున నన్నయ్యగారి రచనా మార్గ మిట్టి దగు నని తెలిసికొనుట కలుగు నని కొలఁది కథలనుగుఱించిమాత్రమే వ్రాయుదును.

అన్నికథలు నొక్కరీతిగనే యుండవుగదా! భారతము లోని కథలు కొన్ని పూర్తిగా వైదికములు. కొన్ని రాజుల కథలు. కొన్ని ఋషిమహత్త్వ బోధకములైన కథలు. కొన్ని ధర్మబోధకములు కొన్ని లౌకికములు. అందుచేత నన్ని కథలొకేరీతిగాఁ జెప్పినచో కథాప్రసన్నతయేలేదు. నన్నయ్య గారందుచేత నొక్కొక్కకథ నొక్కొక్కరీతిగాఁ జెప్పెను. ఆ భిన్నమార్గములను జాగ్రత్తగా పరిశీలించినగాని యాయన మహారచనౌత్కృష్ట్యము గోచరింపదు. ప్రభుపద సుప్రతిష్ఠు లైన కాళిదాసాదులకుగూడ నజ్ఞాతపూర్వమని చెప్పఁబడిన యాయనశక్తి తెలియదు.

కథాప్రసన్నత యననేమియో తెలిసికొనుటకు మున్ను ప్రసన్న శబ్దార్థము తెలిసికొనవలయును. 'దేవీప్రసన్నత' ఇట్టి శబ్దములలో - "భగవంతుడు ప్రసన్నుడైనాడు" మొదలైనచోట్ల భగవంతుడు ప్రసన్నుడగుట యనఁగా నెట్టిది? ఉపాసనా స్వరూపము తెలిసి నిశ్చలబుద్ధితో పరమేశ్వర ధ్యానము చేసినచో భగవంతుడు ప్రసన్నుడగును. కావ్యము నందు ప్రసాదగుణమను నొకగుణము కలదు. ప్రసాద గుణమనఁగా నర్థవ్యక్తియని యొకమతము. ఆ యర్థవ్యక్తి యెట్లు కలుగును? శబ్దార్థ సుపరిజ్ఞానము, సంప్రదాయాభిజ్ఞతయు నున్నచో నది కలుగును. కొందరనుకొనునట్లు గుణరహితమై యర్థమగుచుండుటవలన ప్రసాదగుణము సిద్ధింపనేరదు. భిన్న శబ్దార్థముల వాక్యార్థముల సుష్ఠు పరిజ్ఞానముచేత నర్థప్రసన్నత

గలిగినట్లు కథాగత భిన్నాంశముల పరిజ్ఞానముచేత, అనఁగా వానిని చక్కఁగా పరిశీలించుటచేత కథాప్రసన్నత కలుగును.

మొదట కద్రూవినతల కథలోని ప్రసన్నత యెట్టి దియో విచారింతము. ఋషులు సూతు నట్లడిగిరి.

"ఒరులవలన పుట్టు నోటమియును నెగ్గు
బొరయకుండ నరసి పుత్త్రివగుల
తగిలి కాచునట్టి తల్లి సర్పములకు
నేల యలిగి శాప మిచ్చె నయ్య?"

ఈ పద్యమును జాగ్రత్తగా పరిశీలింప వలయును. "అరసి పుత్రులను తగిలి కాచునట్టితల్లి" అని యుండవల యును. పుత్రులలో శ్రేష్ఠులను రక్షించునది యని యర్థము వచ్చుచున్నది. శ్రేష్ఠులనే రక్షించును గాని తక్కినవారిని రక్షించదా? మఱియు నట్టి తల్లి సర్పముల కేల యలిగినది? అని ప్రశ్న. అక్కడ పుత్రవరు లన్నప్పు డిక్కడ సర్పరాజు లనవలయును. ఈ రెండు నొకదాని కొకటి పొసగుట లేదు.

ఇది ఆదిపర్వము ప్రథమాశ్వాసము చివరి పద్యము. ద్వితీయాశ్వాసములో మప్పది యైదవ సంఖ్యగల పద్యము కద్రువయొక్క శాపము. ఆ పద్య మిది.

'అనుపమ మగు జనమేజయు
డను జనపతి చేయు సర్పయాగనిమిత్తం
బున బాములు పంచత్వము
ననయెదు మని యురగములకు శాపం బిచ్చెన్.

కొడుకులతో కద్రువ యీ రీ పని చేయుడనెను. వారు సుముఖులు కాలేదు. అప్పు డిచ్చిన శాప మిది. మీరు పంచత్వము నసియెదు మని శాప మీయవలయును. మధ్యమ పురుషలో కాక యీ శాపము ప్రథమపురుషలో నున్నది. 'పాములు' అని మాత్రమే యున్నది గాని యెల్ల పాములు నని లేదు.

ఇది యొక చమత్కారము. సర్వ సర్పములు సర్ప యాగమునందు మరణింపవు. శేషుడు, వాసుకి, తక్షకుడు మొదలైన మహాసర్పములు చావరు. ఆ వానులు వేసిన ప్రశ్నలో నీ కద్రువ యిచ్చిన శాపములో నీ రహస్యము చిత్రముగా నిమిడియున్నది. ఈ రెండుపద్యములయొక్క యర్థముసు చక్కగా పరిశీలించినచో కథయొక్క యీ రహస్యము ప్రసన్న మగును.

ద్వితీయాశ్వాసారంభము కద్రూ వినతల కథారంభము. వీరిద్దరు కశ్యపుని సంతానార్థము ప్రార్థించిరి. ఆయన "వరంబు లిచ్చెద వేడుం డనిన_"

"వినుత సత్త్వుల గోరె కద్రువ వేవురం గడు వేడ్కతో
వినతగోరె............................వారికం
టెను బలాధికులైనవారిఁ గడింది వీరుల నిద్దఱన్."

ఈ కోరికలచేత కద్రూవినతల స్వభావము పొడకట్టు చున్నది. కద్రువతో వినతకు స్పర్థయున్నది. ఆ స్పర్థకు హేతు వేమో తెలియదు. వినత దుర్మార్గురాలా? కద్రువ

వినతను సరిగా చూడక పోవుటచేతనేమో యింక్కానేమో? ఇంద్ర కోపమూ? ఇంకను వినత యెట్టిది? క్రొత్తకు యుడిన గ్రొద్దు పగిలి వేయి సర్పము లుద్భవించినవి. వినతకు రెండు గర్భాండము లవియు లేదు. అందుచేత వినత "అతి లజ్జావనత యయి యొక యండమ్ము విగతధృతి నవియించెఁ."

తనకు సంతానము కలిగెను. వారు పెద్దవాండు కాలేదు. లజ్జచేత నెందుకు నవనత కావలయును? "విగత ధృతిఁ" - పోయిన ధైర్యముచేత. ధైర్య మెందుకు పోవల యును? అండములలో పిల్లలే లేరనియా? అది యేమియు కాదు. మఱియు చూతము. వీ రిద్దరు సముద్రపు టొడ్డున వినోదార్థము విహారించుచుండిరి. ఉచ్చైశ్శ్రవము కనపించినది. ఈ పైఁ జెప్పిన దాసి రహస్యము ద్వితీయాశ్వాసము ౩౧-౩౨ ఈ పద్యము లలో నున్నది. క్రద్రువ యన్నదికదా "చూడవే యల్ల నతి ధవళంబైన యశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశంబునందు నల్ల యున్నది" అని.

దానికి వినత యిట్లనెను. "నీ వే కన్నులం జూచితే అక్కా! యెక్కడిది నల్ల? ఈ యుశ్శైశ్రవము మూర్తి మహా పురుషుని సత్కీర్తింబోలె నతినిర్మలంబై యొప్పుచున్న యది" యని.

ఈ రెండుమాటలవలన క్రద్రువ [illegible] వినత యెట్టిదో తెలియఁగలదు. [illegible] దోషమునే వెదకును. [illegible] చూచును. వినత చాల మంచిది. [illegible] లేక తెమ్ములకుఁ [illegible]

"మహాపురుషుని సత్కీర్తియుంబోలె" యనుట యామె యాత్మను, ఆమె స్వభావమును జెప్పుచున్నది.

అప్పుడు కద్రువ పందెము పెట్టినది. ఆ గుఱ్ఱము యొక్క ధవళదేహమునందు నల్ల కలిగినేని, నీవు నాకు దాసి వగుము. నల్ల లేనిచో నేను నీకు దాసి నగుదును. "పన్నిదము సరుము". పందెము వెయ్యి అని బలవంతము పెట్టినది. వినతకిష్టములేదు. పందెమున కొప్పుకొన్నది. కారణము? కద్రువ యామెమీఁద నధికారము చెలాయించుటయే. వినత దగ్గరకుఁ బోయి చూతమన్నది. కద్రువ యిప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూత మన్నది.

జీవితాంత మొకరి కొకరు దాస్యముచేయవలె నన్న పందెము నొడ్డిరి. అప్పుడే చూడకుండ నెవ రూరుకుందురు? దగ్గరకుఁబోయి చూడవలసిన యవసరము కద్రువ కున్నదా? వినతకున్నదా? నల్లగా నున్నదని మొదట చెప్పినది కద్రువ. నిజముగా నల్లగాలేదు. రేపు వచ్చినమాత్ర మేమి? తెలుపు నలు పగునా? అన్న ధైర్యము వినతకున్నచో నామె యమాయకురాలు. వ్యవహారము తెలియనిది. లౌకికజ్ఞానములేనిది. ఈ కథ కదలించినది కద్రువకాన నామె యేదియో మోసము చేయు నని వినత గ్రహించవలయును. అట్టిశక్తి వినతకు లేదు.

అసలు కద్రువకు వినతను దాసిగా చేసికొనవలయు నన్న కోరిక యేల పుట్టెను? వినత తనకు లోకువయైన మనిసి. ఇదివఱకే వినతమీఁద తా నధికారము చేయుచుండెను. వినత

మెత్తనది. ఎదురు తిరుగలేదు. ఆమె యధికారము సాగనిచ్చు చుండెను. సాగనీయక తా నేమియు చేయలేదు. కాని వినత మనసులో కష్టపడుచునే యుండెను. అందు కనియే కద్రువ కొడుకులకంటె తన కొడుకులు గొప్పవాండ్రు కావలయు నని కోరినది. కద్రువయొక్క గర్భాండము లవిసి పిల్లలైనారు. తన గ్రుడ్లు సంతానముగా మారెను. వినత గ్రుడ్లు కొడుకులు కాలేదని కద్రువ వినతను వెక్కిరించి యుండును. అందుచేత లజ్జావనత యైనది. ఆమె కొడుకులవలన తాను బాధకూడ పడియుండును. అందుచేత విగత ధైర్య యైనది.

ఈర్ష్య కాకూడదా? అని ప్రశ్న పుట్టవచ్చును. ఆ పద్యముదగ్గర నీ రెండును వికల్పములే. తరువాతికథ చేత కద్రువయొక్క యధికార ధూర్వహాత్వమే నిరూపింపఁబడి రెండవవికల్పము తీరిపోవు చున్నది.

ఈ రీతిగా ఆ కథ ప్రసన్న మగుచున్నది.

ఈ ప్రసన్నతకు నన్నయ్యగారు మఱియు నుద్దీప్తి కలిగించెను. ఇచట నప్రస్తుతమైన సముద్రమథనకథ యుచ్చైః శ్రవము కనిపించుటకు పూర్వాంగముగా రచించెను. ఈ సముద్రమథనకథయంతయు నిగూఢార్థములు లేకుండ వట్టి ప్రవాహముగా తన సహజమధురశయ్యతో రచించెను. వెంటనే కద్రూవినతలు సముద్రతీరమునందు గనిపించుట జరిగినది. ఈ సముద్రమథన కథారచనకు, కద్రూవినతల ప్రసంగమునకు రచనాపద్ధతులలో మిక్కిలి భేద మున్నది. సముద్రకథలో దీర్ఘసమాసములు, పద్యరచనాసౌందర్యము

మిక్కిలి భాసించును. ఈకథ దగ్గరకు వచ్చునప్పటికి నెక్కువ తెలుఁగు శబ్దములు, వృత్తములు వదలిపెట్టుట, అనఁగా గీతములు, సీసములు, కందములు వచనములే వాడుట. ఈ భేదము కల్పించి కవీంద్రులను లో నారయుటకు మార్గ మేర్పరచెను. ఈ లేసిపోస కద్రువ యల్లిన యల్లిక తెల్లని గుఱ్ఱములో కొంత నల్లగా నున్నదనుట. ఇది యీ సర్పయాగ కథ కాయువుపట్టు. అంత యబద్ధ మూరకే యెవరును కల్పించరు. దైవప్రేరితమై కల్పింపఁబడును. ఆ దైవము ఈ లోకమునందు దుష్టజనులయొక్క స్వభావమై యుండును. ఈ రహస్యము తెలిసినచో కథ ప్రసన్న మగును. దీనికి ప్రాధాన్య మిచ్చి వ్రాయుటలోనే కథాప్రసన్నత కలుగును. ఈ ప్రసన్నత నెరుగుటకు కవీంద్రులు లో నారయవలయును. లో నారయుట యనఁగా కథ నిట్లు చూచుట. అచట ప్రయోగించిన వాక్యములయొక్కయు, శబ్దములయొక్కయు నంతరార్థమును పరిశీలించుట.

ఈ సర్పయాగకథ పెద్దది కద్రూ వినతల మాత్సర్యమును పెంచి వ్రాయుటకు వీలులేదు. తత్కథాంశములయొక్క వ్యక్తికలుగుటను కొలఁదిమాత్రమే వ్రాసి తక్కిన విషయములమీఁదికి పోవలయును.

ఇట్టి విషయములు మరియు పెంచి వ్రాయుటకు నీ కథ కాదు. వే రొకకథ కావలయును. ఇట్టిశిల్పమును విస్తారముగా చేయుటకు ని కథలోఁ దగినంత వస్తుభాగము లేదు. దీనికి శర్మిష్ఠకథయో, నలచరిత్ర కథయో వ్రాయవలయును.

# శర్మిష్ఠ కథ

నన్నయ్యగారి యీ కథాకథనశక్తి బాహుళ్యము మీఁద చూడవలయు నన్నచో శకుంతలకథ చిన్నది యగుటచేత చాలను శర్మిష్ఠకథయో, నలచరిత్రమో చూడవలయునని వ్రాసితిని. ఇపుడా శర్మిష్ఠ కథనుగూర్చి వ్రాయుచున్నాను.

నన్నయ్యగారు కథను చెప్పికొనిపోవుచు నడుమ ననేక విషయములను చొప్పించుచు పోవుచుండును. అవి యన్నియు విడిగా చూచికొనవలయును. ఇచ్చట వట్టి ప్రసన్నకథా కలితార్థయుక్తిమాత్రమే చెప్పఁబడును.

కథను ప్రసన్నము చేయుటకు నాయన యవలంబించు కొన్ని మార్గములు జాగ్రత్తగా పరిశీలింపవలయును. వచనము, పద్యము వీనిరెంటిని వాడుటలో కథలో నున్న రమ్యత బహిర్గత మగునట్లు వాడు నని యిదివఱకే వ్రాసితిని. ఈ శర్మిష్ఠా దేవయానుల కథను ప్రారంభించుచు వచనముతో ప్రారంభించెను.

"ఇట వృషపర్వనరేంద్రు, శర్మిష్ఠ యను కన్యక యొక్కనాఁడు కన్యకాసహస్రపరివృతయై దేవయానీసహితంబు వనంబునకుం జని యొక్క సరోవరతీరంబున తమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్నఁ"— కథ యిట్లు మొదలు

పెట్టెను. వచనముతో నారంభించెను. శర్మిష్ఠ రాచ కూఁతురు. ఆమెవెంట కన్యకాసహస్రమును, దేవయానియు నడవికి పోవుట సహజమే. అందు విశేషము లేదు. ఈ విశే షము లేకపోవుటను సామాన్యముగా వచనములోననే వ్రాసెను. కాని తరువాత శర్మిష్ఠ దేవయానికి దాసి యగును. ఆమెకూడ శర్మిష్ఠతోఁ గలసి వనమునకు విహా రార్థముజనును. ఇది యసామాన్యస్థితి. పురోహితుని కూఁతురు రాజ్ఞీస్థానీయురాలైనది. రాచకూఁతురు దాసి యైనది. ఈ విశేషస్థితిని దీపింపఁజేయుటకు పద్యమును వ్రాయు చున్నాడు.

"వనకేళీ కౌతుకమున
జనియెను శర్మిష్ఠ దాసీసఖు లెల్ల ముదం
బున గొలిచిరాఁగ విభవము
తన కమరఁగ దేవయాని తద్వనమునకున్."

ఇందులో 'విభవము తన కమరగ' అని యిచట పద్యము వ్రాయుటలో నున్న విశేషముగూడ పాఠకుని శ్రద్ధ నుండి తొలఁగకుండ నుపయోగించినాడు.

నన్నయ్యగారి శిల్పములో నిటువంటివి చాల సామాన్యము.

గాలి కొట్టి వారి చీరలు లుంగలుగా చుట్టుకొన్నవి. వారు "అన్యోన్యపరిధానంబులు వీడ్వడంగొని కట్టునెడ దేవయాని పుట్టంబులు శర్మిష్ఠ కట్టుకొనిన మఱి దాని పరి ధానంబు దేవయాని పుచ్చుకొనక రోసి శర్మిష్ఠం జూచి

యిట్లనయె”—ఇచట “అన్యోన్య పరిధానంబులు వీడ్వడంగొని” అని వ్రాయుటలో ‘డా’ క్రింద ‘వా’ వొత్తుగల యక్షరము వాడుటచేత వారి చీరలు లుంగలుపడి యెవరి చీర వారు తీసికొనుటలో పడిన కష్టము తొందరయు స్ఫురించు చున్నది. ఇది యక్షరగతమైన గనధ్వని. వారు స్త్రీలు. వివస్త్రలై చెర్వునందు స్నానము చేయుచున్నారు. చెరువు నొడ్డుకు వచ్చినంతనే చీరలు కట్టుకొనుట కెంత తొందర పడుదురో. యా స్వభావ మంతయు దీనియం దిమిడి యున్నది.

ఇట్లు కోపించిన దేవయాని శర్మిష్ఠతో నన్నమాట లొక్క కందపద్యములో నున్నవి. శర్మిష్ఠ చెప్పిన సమాధాన మింకొక కందపద్యము. “నా కట్టినపుట్టంబు నీకుం గట్టంగాదు గా కేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్క నూతం ద్రోచి శర్మిష్ఠ క్రమ్మరి వచ్చి నిజనివాసంబున నుండె”. వీరు చెరువులో స్నాన మాడిరి. ఈ చెరువు నూతి కెంతదూర మున్నది? ఆ నూయి జలభరితి మైనదియా? పాడుపడిన నూయియా? ఆ నూతిలో శర్మిష్ఠ దేవయానిని ద్రోసినది. దేవయాని చనిపొవునా? చనిపోదా? చనిపోయెడి స్థితిలో దేవయాని యున్నచో శర్మిష్ఠ యింటికిపోయి మాటాడకుండ తాను సుఖముగ నున్నదా? ఆమె యంత నిర్దయురాలా? ఇన్ని ప్రశ్నలు పుట్టుచున్నవి. ఆమె యొకమాట యన్నది. ఇంతమాత్రమునకే శర్మిష్ఠ దేవయానిని నూతిలోఁ ద్రోయవల యునా? ఇది యొక ప్రశ్న. దేవయాని శర్మిష్ఠచీరను కట్టుకొనక

రోసినది. చివరకు కట్టుకొన్నదా? లేదా? వివస్త్ర యైన దేవయాని నేనూతిలోఁ ద్రోసినదా?

ఇన్ని ప్రశ్నలకు సమాధానము తరువాతి కథలో రావలయును. కథ యారంభించుటలోననే యిన్ని ప్రశ్న లుదయించెను. ఇచ్చటనే యొకదానికి సమాధానము చెప్పికొనవచ్చును. ఆ నూయి పాడునూయి. అందులోనికి త్రోసినచో మనుష్యులు చావరు. ఆ నూతిమొగ మంతయు లతలచేత నావరింపఁబడి యున్నది. ఏ తీగ పట్టుకొని పై కెక్కివచ్చినను రావచ్చును. అందుచేత శర్మిష్ఠకు దేవయాని చచ్చిపోవు నను భయమే లేదు.

మరి దేవయాని యెందుకు రాదు? ఇది ప్రశ్న. దీనికి సమాధానము తక్కినకథ చదివిన గాని రాదు.

ఇట్లు దేవయాని పడియున్న యీ నూతివద్దకు యయాతిని కామపథిశ్రమము డేగుదెంచెను. అతడు జలపిపాసార్థియై వచ్చెను. శర్మిష్ఠాదులు జలక్రీడలాడిన సగస్సు ఈ నూతికి దగ్గరగా నున్నచో రాజు చెరువుదగ్గరకు పోవును గాని నూతిదగ్గరకు రాడుగదా! ఆ దగ్గరతనముకూడ కొంచెపుది కాదు. చెరువునకు నూతికి చాలదూర ముండియుండవలయును. మరియంతదూరము శర్మిష్ఠా దేవయానులు వివాదమాడి యుండవలయును. దారి పొడవున వా రొకరి నొకరనుకొనుచునే యుండి యుండవలయును. ఎన్ని యనుకొనినను ఎన్నిసార్లనుకొనినన నా రెండు పద్యములలో నున్న మాటలే. "లోకోత్తర చరితుడైన కావ్యుని కూఁతుర, బ్రాహ్మణ

స్త్రీని. నీ కట్టిన మైల కట్టుకొందునా?'' అని దేవయానియు "మీ యయ్య మా యయ్యను దీవించి బ్రదుకుచుండును. నావద్ద మహిమలు పలుకుటకు సిగ్గయినలేదా?" అని శర్మిష్ఠయు. ఇద్దరు నుత్తమకులసంజాతలు. ఇంతకు మించి తిట్టుకొనరు. అసిన మాటలే మరల ననుచుందురు. ఎంతదూరము పోయిన నంతే. ఇట్లెంత దూరము పోయిరి? జలపిపాసార్థియైన రాజునకు చెరువునగ్గర అనుకొననంతదూరము పోయిరి.

ఈ యర్థములన్నియు, నీ లోకజ్ఞత యంతయు నీ రెండు పద్యములలో నున్నది.

అప్పుడు నూతిలో నున్న దేవయానివద్దకు యయాతి వచ్చినాడు.

"ఆ నహుషాత్మజుండగు యయాతి యధిజ్య ధనుస్సహాయుడై యానత శాత్రవుండు........" వచ్చెను.

'ఆ' యని పద్యము మొదలు పెట్టుటలో నొక చమత్కారమున్నది. కౌరవ వంశమును చెప్పికొని పోవుచు యయాతికథ వచ్చినపుడాగి కచదేవయానీకథ నడుమ చెప్పి యది యైనతర్వాత మొదలుపెట్టిన కథ యిది. కచదేవయానుల కథ యయాతికథ కప్రధానము. ఈ యయాతికథ ప్రధానము. ఈ ప్రధానమైన కథలో నిన్నిమహార్థము లిమిడించుచు తన లోకజ్ఞతను సంధానపరచుచు పరమస్ఫూర్తిమంతముగ వ్రాయుచు కచదేవయానికథ వట్టి కవితాశక్తిచేత వ్రాయునుగాని దానియం దీదృక్షిల్ప సంయోజనము చేయడు. ఇట్లు ప్రధానకథా విశిష్ట రచనతో సాగించుట

యొక విచిత్రరచన. లోకోత్తరుడైన యొక కవిమాత్రమే చేయఁగలడు.

ఈ నహుషునకు రెండు విశేషణములు వేయఁబడెను. ఒకటి 'ఆనత శాత్రవుడు', రెండు 'అధిజ్య ధనుస్సహాయుడు' శత్రువుల నందర సర్జించినవాడు. అధిజ్యధను స్సహాయుడగుట యెందులకు? దీనికి సమాధానముగ 'మృగయారసలోల సబద్ధబుద్ధి' యని చెప్పుట. ఈ రాజవివాహితుడు దేవయానిని వివాహము చేసికొనబోవు చున్నాడు. కనుక నీ కథారంభము నందు కథానాయకుడైన నాయకుని లక్షణములు సూచనగా చెప్పుట.

"చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి" జల మపేక్షించిన వాడేమి చేయును? తరువాత 'నచ్చోవిశ్రమించి' యని వ్రాసెను. జల మపేక్షించి విశ్రమించుట యేమి? ఇది చిత్రముగా లేదా? ఆ నూతిని చూచుటతోనే యందు నీరుండ దని తెలిసినదా? లేనిచో నీరు చేదుకొను సాధనములు తన దగ్గర లేవా? ఈరెండు కారణములచేతను మరి కొంతదూరము పోలేక రాజచట విశ్రమించి యుండవచ్చును. రాజచట విశ్రమించినాడని చెప్పుటతోడనే పాఠకు డీ రెండుకారణముల నూహించుకొనవలయును. తనకథలోని పాత్ర ప్రవర్తించిన ప్రవర్తనవల్లనే పాఠకు డచటి సన్నివేశమంతయు నూహించు కొనవలయును. అట్టి సన్నివేశములో నా పురుషు డెట్లు మాటాడును? ఏమిచేయును? నన్నయ్యగా రతడేమిచేయునో చెప్పును. ఎంత మాటాడునో చెప్పును. అతడు చేసిన దానిని

బట్టి యతడు మాటాడిన రెండు మూఁడు మాటలనుబట్టి సన్ని వేశము, పరిస్థితి, పట్టినవేళ సర్వమును పాఠకుఁడే యూహించు కొనవలయును. ఇవి నన్నయ్యగారి రచనలోని పరమరహస్యములు. ఊహించినకొలఁది తత్సర్వము భాసించును.

విశ్రమించిన తర్వాత తత్కూపమున జూచి "దేవయాని గనియె" ఇది సీస పద్యము. "తత్కూపమున" అన్న శబ్దము తర్వాతనున్న సీసపద్యపు మూఁడుచరణములు, గీతపద్యము దేవయానియొక్క వర్ణనము. ఈ దేవయానకి నాలుఁగు విశేషణము లున్నవి. మొదటిది ఒడ్డునం దున్న తీగ అనునటు వంటి యిష్టసఖిని యూది యున్నది. రెండవది కుచయుగము మీఁద కన్నీరు పూరించు చున్నది. మూఁడు, తనదగ్గరకు జనుల యాగమనము కోరుచున్నది. నాలుఁగు, వరుణునిమీఁద కోపించి భూమిమీఁదకు రాబోవుచున్న వరుణదేవుని భార్య వంటిది. ఈ నాలువిశేషణములచేత నామాయి యెట్టిదియో? ఆమె యున్న స్థితి యెట్టిదియో? ఆమెకు రానున్న దశ యెట్టిదియో? ఇవి యన్నియు వ్యంగ్యభూతము లగుచున్నవి. చచ్చుటకు సిద్ధముగా నుండి నూతిలోపడి చనిపోవుదుమేమో అన్నభయముతో తీగను పట్టుకొని వ్రేలాడు స్త్రీని ఆ తీగ యను చెలికత్తెను పట్టుకొన్న దని రూపకము నౌచిత్యవేత్త యైన కవి వాడెను. ఈ రూపకముచేతనే యామె నూతిలో భద్రముగా నున్నది. తన కిష్టమైనచో తాను వెలికి రావచ్చును. వెలికి వచ్చుట యిష్టములేదు. ఎందుకు లేదో

తర్వాత విచారింతము. రెండవ విశేషణము కన్నీరు పూరించు చున్నది అని. అనఁగా? తన స్థితి నాలోచించి దుఃఖమును తెచ్చికొను చున్నది. చచ్చిపోవుదు నని భయము చేతకాదు. కొండికది శర్మిష్ఠ నన్నిట్లు త్రోయునా? నా తండ్రి మాహాత్మ్యమువలన దీనితండ్రి రాజ్యము సాఁగుచున్నదే. ఇది యెంత? అనెడు దుర్భావముచేత చింతాక్రాంతయై మాటి మాటికి కన్నీరు తెచ్చికొను చున్న దని యర్థము. మూఁడవ విశేషణము తా నున్నచోటికి మరియెవ్వరైన రావలయు నని తన్ను నూతిలోనుండి బయటకు లాగుటకా? కాదు. తా నా స్థితిలో నుండఁగా నింకొకరు చూడవలయును. చూచినచో కాని సాక్ష్యము కుదురదు. శర్మిష్ఠదోషము స్థిరపడదు. ఇది దేవయాని ప్రకృతి. మిక్కిలి పట్టుదలగల మనిసి. నేను గొప్ప యింటిబిడ్డ నను గర్వముగల మనిసి. తా నెంత చెప్పిన తన తండ్రి యంతచేయు నను విశ్వాసముగల మనిసి. మరియు నాల్గవ విశేషణము వరుణదేవివలె నున్న దని, పైగా నామె భూమిమీఁదకు రాబోవుచున్న ట్లున్నదని. ఈ విశేషణము చేతగూడ నామె తేలికగా నూతిలోనుండి బయటకు రాగల దన్న విషయము ద్యోతమాన మగుచున్నది. ఇష్టసఖ నూది యున్న ట్లున్న దనుటచేత, వరుణేంద్రు దేవివలె నున్న దనుటచేత నామె మహారాజ భార్య కాదగిన సౌందర్యభోగ లక్షణము లామెయందు సమృద్ధిగా నున్న వనుట వ్యజ్యమాన మగుచున్నది.

ఈ పైనిచెప్పిన లక్షణము లెవరికైన సందేహాస్పదము లుగా నున్నచో సందేహనివృత్తికొరకు రాజిట్లడుగు చున్నాడు. "నీ వెవ్వరి దానవు? ఇట్లేల యేకతంబ యి వ్విపినాంతరకూపంబున నున్నదానవు?" ఇది యడిగిన ప్రశ్న. అరే! యెవరైన నూతిలో చనిపోవుచుండ ముందు వారిని బయటకు తీయుదురు, తనధను స్సామె కందిచ్చి బయటకు తీయవచ్చును. అది యేమియులేక ఒకరై పీ నూతిలో నుంటి వే మని యడుగుట యేమిట? ఈ ప్రశ్నలవలనగూడ పూర్వపు సంగతులే తెలియుచున్నవి. అది పాడునూయి. అందులో పడినవారు చనిపోరు. ఒడ్డుచుట్టున నెన్నో తీగ లున్నవి. తీగపట్టుకొనియైన బయటకు రావచ్చును. అందు కనియే శర్మిష్ఠ యామెయంత నామెయే లేచి వచ్చునులే యని యింటికిపోయి విచారము లేకుండ నున్నది. శర్మిష్ఠ చిన్నపిల్ల. ఆమెకు దేవయాని గడుసుదనము తెలియదు. దేవయాని పెద్దది. పాపము శర్మిష్ఠ తన తండ్రియే గొప్పవా డనుకొన్నది. ఏమి విచిత్రమైన కథ! ఆలోచించినకొలఁది తాను వ్రాసిన పదిపద్యములలో నన్నయ్యగారీ కథ నంతయు నెట్లు ప్రసన్నము చేయుచున్నారు!

ఇట్లడుగఁబడి దేవయాని "ఇవి యేమిమాట లయ్యా? నన్ను ముందర బయటకు చేదు" మని యడుగవలయును. ఆమె నిజముగా నాపదలో నుండినకదా యిట్లడుగుట.

ఆమె యయాతి నెఱుగును. ఇదివఱకే యతనిని జూచి నది. అతనితో నిట్లు చెప్పుచున్నది. 'అసురసన్నిభా!' అని

యతనిని సంబోధించినది. దేవతలతో సమానమైనవాడా! యని పిలుపు. రాజు నిదివఱకే చూచినది. కచుని శాపము వలన తనకు క్షత్రియుడే పతి యగును. ఆ క్షత్రియుడు సామాన్యుడా! మహారాజా? సామాన్య క్షత్రియుని తాను కోరదు. మహారాజు తన్ను వివాహమాడుటకు తన ప్రయత్నము కొంత యవసరము. ఆమె కిప్పుడు రెండు కలిసివచ్చినవి. శర్మిష్ఠమీద పగతీర్చుకొన వచ్చును. ఈ మహారాజును వివాహమాడుటకు వీలేర్పడినది. ఆమె యెంతయో యూహాశాలిని. 'అమర సన్నిభా!' యని పిలిచి యుద్ధములో చని పోయిన రాక్షసులను తన విద్య పెంపుచేత ప్రాణప్రజీవులను చేయు నమితశక్తిచేత ప్రకాశించెడి భార్గవుని కూతుర నన్నది. ఈ భావము నన్నయ్యగారు చంపకోత్పల మాలాది సామాన్య వృత్తములలో వ్రాయక తరళముతో వ్రాసెను. ఈ భిన్న వృత్త మెన్నుటచేత దేవయాని గర్వము తన తండ్రి గొప్పదనము, తా నంత గొప్పదాన నని రాజునకు తెలియఁజేయుట మొదలైన బహుప్రయోజనములు సిద్ధించుచున్నవి. ఈ పద్యములోని భావమున కీ భిన్నవృత్త మద్దీప్తి కలిగించుచున్నది. ఈ వృత్తముయొక్క భిన్నత్వముచేతనే యీ భావము స్ఫూర్త్యతిశయము కలిగి భాసించుచున్నది.

అని చెప్పి దేవయాని మఱల నిట్లనుచున్నది. "ప్రమాద వశంబున నిన్నూతంబడి వెలువ నేరకున్నదానను. నన్నుద్ధరించి రక్షింపుము" అన్నది. అదే శర్మిష్ఠ తన్ను నూతిలో త్రోసినదని చెప్పదే. వైదుకుని కూఁతురు. ఆ గడుసుదనము

నను, నా లౌకికమునకు నవధి లేకుండ నున్నది. అంత గర్వముగల యీమె యీ మాట చెప్పనే చెప్పను. చెప్పినచో రాజేమనుకొనును? ఈమాత్రమునకు నీవు లేచి యింటికి పోవచ్చునుగదా! ఆమెమీఁద యింత పగ యెందు కను నేమో? తన యీ దుర్గుణము రాజునకు తెలిసినచో రాజు తన్ను వివాహమాడుటకు నంగీకరించునా? తన ప్రయత్నము వృథా యగును. అందుచేత చెప్పనే చెప్పను. వీనివలన దేవయాని పాత్ర యెట్లు పోషింపఁబడినదో చూడుడు.

"అనఁగా న విప్రకన్యకయందు దయాళుండై తద్దయు యయాతి"

ఇచట విప్రకన్యక యనుట యెందులకు? తద్దయు దయాళు డగుట యెట్టిది? ఈ రెండు మాటలను విచారించినచో నొక చమత్కారమైన యర్థ ముత్పన్న మగుచున్నది. దేవయాని తన్నుద్ధరింపు మన్నది. ఈశబ్దము 'ఉత్ + ధరణము కావచ్చు. ఉత్ + హరణము కావచ్చు. నన్ను పైకి చేదుకొనుమనియు నర్థమే. నేను కచునిచేత శపింపఁబడినదానను. నన్ను వివాహము చేసికొనుము. ఈ కన్యాత్వదోషమునుండి నన్ను రక్షింపుమనియు నర్థమే. నన్ను పైకి చేదుకొనుమన్న యర్థముయొక్క ప్రసక్తి లేదు. ఆమె తన ప్రయత్నము చేతనే నూతినుండి వెడలిరాగలదుగనుక. అందుచేత రాజు మిక్కిలి దయాళుడై నాడఁట. ఈమె తనయంతట తాను పైకిరాగలదు,

అయినను నన్ను పైకి లాగు చున్నవి. ఇది యొక చమత్కారము. ఒకలీల.

అట్టి లీల నాదరించుటకు నా వ్యక్తియందు తన కొక జాలి పుట్టవలయును.

జాలి, దయ, కరుణ మొదలైన శబ్దములయొక్క యర్థము విచారించినచో చమత్కారముగా నుండును. ఈమూఁడు శబ్దములు మూఁడు భిన్న పరిస్థితులయందు లోకము నందు వాడఁబడుట సహజమే కాని వాని సహజమైన తాత్పర్యము మనసు ద్రవించుట యనయే. ఇది సత్త్వగుణము. సత్త్వగుణ మనఁగా నాలంకారికులు చెప్పు సత్త్వము. "పరగత సుఖ దుఃఖానుకూలాంతఃకరణప్రవృత్తి స్సత్త్వమ్" అని ధనం జయుని సిద్ధాంతము. ఈ సత్త్వమే రసమునకు హేతువు. మనస్సులో పుట్టిన యార్ద్రత యని యర్థము. "ఏకో రసః కరుణ ఏవ" అన్న భవభూతి వాక్యములోని కరుణ శబ్దమున కిదియే యర్థము.

ఇట్టిదయను యయాతి దేవయానియందు పొందెను. తాను క్షత్రియుడు. ఆమె విప్రస్త్రీ. ఆమెయందు తా నట్టి ప్రేమభావమును వహింపరాదు. కానిదైవవశముచేత యయాతి కామెయందు ప్రేమ కలిగెను. ఈ ప్రేమ కలిగె ననుటకు వీలులేదు. కలుగలేదనుటకు వీలులేదు. కలిగినచో నప్పటి పరిస్థితివలన సధర్మము కలుగలేదని చెప్పుట యబద్ధము. ఈ యంతఃకరణ ప్రవృత్తి రాజు దేవయానిని బయటకు తీసి నపుడు వా రిరువురు పరస్పర స్నిహ్యమాణ చిత్తులైరి.

నన్నయ్యగారు దానిని స్పృశించి వదలిపెట్టిరి. అతి చమత్కారముగా చెప్పిరి.

వీరిద్దరొకరియం దొకరు ప్రేమ వహించుట మిక్కిలి గాఢముగా నున్నది. ఆ గాఢత్వమును పద్యముచేతకూడ వర్ణించు చున్నాడు.

"జలధి విలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునం దనున్నమ
ద్గళదురుఘర్మవారికణ క్రమకరాబ్జము పట్టి నూతిలో
వెలువడ గోమలిం దివిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్"

ఈ పద్యమునందు తాత్పర్యము రాజు దేవయానిని నూతిలోనుండి తిగిచె నన్నంతమాత్రమే. అతని దక్షిణ హస్తమున కొక విశేషణము, దేవయానిచేత కొక విశేషణము రెండున్నవి. ధాత్రీవహనక్షమమయినది దక్షిణ హస్తము చెమట పోసినది. దేవయానిచేయి ఈ రెండు విశేషణముల చేత రాజామెయందు భార్యాభావము పొందె ననియు, యామె చేయి సాత్త్వికస్వేదము కలిగె నని యర్థములు పుట్టుచున్నవి. పరస్పరము వారొకరొకరు తమరిచేతులు కలియుటచేత సంతోషించిరి. రసభావమును పొందిరి. ఇదియుకాక నింకొక చమత్కార మున్నది. రాజుది దక్షిణహస్తమట. దేవయానిది క్రమకరాబ్జమట. హస్తమన్న శబ్దమున కేనుగుతొండమనియు నర్థము కలదు. మదించిన యేనుగు తామరపూవును లీలగా వహించుట ప్రసిద్ధము. ఇందు శబ్దశక్తి కృతవస్తు కృతవస్తు యున్నది. ఏనుగు తామరపూవును పూనినట్లు రాజామెను

వహించెనని యర్థము. "విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్" 'విశ్రుతకీర్తి' యనుటచేత క్షత్రియుడైన యయాతి మనస్సు విప్రకన్య యైన దేవయానియందు ప్రసరించుట దైవ ప్రేరితము, దోషహేతువు కాదు. అని శంకరుం పరిహరించుచున్నాడు. 'ప్రీతితోన్' అని రాజుపొందిన సంతోషము వాచ్యముగా చెప్పినాడు. ఆమెను నూతిలో నుండి తీయుచ మనుకొన్నప్పుడు దయమాత్రము కలిగినదికాని యామె చేతిని స్పృశించినపుడు రాజునకు కామవికారమే కలిగినది.

'ఇట్లు దేవయాని నుద్ధరించి' అని మరల నుద్ధరించు శబ్దమునే వాడినాడు.

ఈ శబ్దమును వాడుట చేతనే సంశయ గ్రస్తమైన యీచోట రెండర్థములు స్ఫురించుటకు వీలున్నది. ఒక తెలుగు శబ్దము వాడినచో నిట్టి యర్థములు పుట్టవు. నన్నయ్యగారెక్కువ సంస్కృతము వాడును అన్న యపప్రథ యీ సంస్కృత శబ్దముల యందున్న యర్థచమత్కార విశేషములు భావించినచో కొంత తొలఁగఁ గలదు.

ఇప్పటికి రాజు దేవయానిని నూతిలో నుండి తీయుకథ పూర్తియైనది. ఇది పది పద్యములలో నున్నది. పది పద్యముల కథలో నొక మహాకావ్యమునకు యోగ్యమైన సామగ్రి యంతయు నిమిడించి పెట్టినాడు.

ఇట్లు చూచినచో నన్నయ్యగారు 'ఓనారని మేలందరు కవు' లన్నమాట యథార్థమగును.

మరియు కొంతవ్రాసి యీ వ్యాసము ముగింతును.

ఈపైన చెప్పిన విషయములు, వానివలన దేవయాని శీలము, పాఠకుడు తెలిసికొనలేకపోయినచో, వానికి దేవయాని స్వరూపము మఱియు నవగతమగునట్లు వ్రాయుచున్నాడు. "యయాతి తన పురంబున కరిగెను. ఇట దేవయానియు శర్మిష్ఠ చేసిన యెగ్గువలన విముక్తయు" అని వ్రాసెను. శర్మిష్ఠ చేసిన యెగ్గు నూతిలో త్రోయుట. రాజు నూతినుండి బయటకుతీసె కనుక యెగ్గునుండి విముక్తయైనది. ఇంక కోప మక్కర లేదు. మరి తరువాత నింటికి పోదేమి? తండ్రి వచ్చి బ్రతిమాలినను పోదేమి? శర్మిష్ఠ తనకు దాసియగువరకు పట్టుదల వదల లేదేమి? నూతిలోనుండి బయటకు వచ్చినంత మాత్రముచేత శర్మిష్ఠ చేసినయెగ్గుపాయును. కనుక యెగ్గువలన విముక్తయయ్యె ననుమాటకు నర్థములేదు. శర్మిష్ఠ మనకు కొంచె ముపకారము చేసినది. దానివలన తన కెక్కువ యుపకారము జరిగినది. తన వివాహమునకు పునాది వేసినది. వివాహము పాణిగ్రహణము. రాజుచేత తన పాణిగ్రహణము చేయించినది. మరల రాజు కనిపించి నపుడు "మున్ను పాణిగ్రహణంబు సేసి తదినీయెడ విస్మృతినంద పాడియే?" అన్నది. అట్లనుట కిప్పుడు వీ లేర్పరచుకొన్నది. ఆమె యింత నేర్పుకలది. తాను వేసిన పథకము ఫలించక తప్పదు. ఈ సంతోషమే శర్మిష్ఠ చేసిన యెగ్గువలన తాను విముక్తయైనట్లు భావించుట.

ఇట్లుండ ఘూర్ణిక యను పరిచారిక యీామెను వెద కుచు వచ్చినది. దానితో దేవయాని "ఏను వృషపర్వుపురంబు సొగనొల్ల. నా పడిన యవమానంబు మదీయ జనకున కెఱింగింపు మని పంచెను".

పరిచారిక తన్ను వెదకుచు వచ్చుచున్నది. లేనిచో తా నింటికి పోవునా? పోదా? తనంతట తాను పోయెడిదే. ఇప్పుడు పోదు, లోకములో నిట్లే జరుగును, కోపమువచ్చి పిల్లవాడు భోజనముచేయక పండుకొనును. మనము మాటాడకుండ నూరకొన్నచో కొంతసేపటికి వానియంతట వాడే లేచి వచ్చును. మనము బ్రతిమాలినకొలది వానిబిగు వెక్కువగును. ఆ స్వభావమే యిచట దేవయానియందు గోచరించుచున్నది. ఇట్లు వ్రాయుట లోకజ్ఞత్వమే.

ఆ దాసిపోయి చెప్పినది.

'శుక్రుండును నాక్షణంబ కోపఘూర్ణిత బాష్పపూరిత నయనయై యున్న దేవయానిం గని యిట్లనియె" అని వ్రాసెను. అక్కడకు వచ్చినాడని అమహర్షి తన కూతునందు తనకుఁగల ప్రేమచేత నా నిముసములోననే దేవయానికి ప్రత్యక్షమైనాడని యర్థము.

కోపము చెడ్డదని యీాయన రెండు కందపద్యములు శుక్రుడు చెప్పినట్లు వ్రాసెను. దేవయాని నే నచటికి రానని, రాకపోవుటకు కారణము నొక కందపద్యములో చెప్పెను. అప్పుడు శుక్రుడు కూతురుతో "నాకు నీవగతివి; నీతోడ

నేనును వత్తు" ననుచు కూతుం బట్టువరుచు చున్నంత నంతయు చారులవలన నెఱింగి వృషపర్వుండు శుక్రు నొద్దకు వచ్చెను.

నన్నయ్యగారి లోకజ్ఞత్వ మెట్టిదో చూడవలయును. రాజు చారులవలన నీ వర్తమానము తెలిసికొనుట కెంతసేపు పట్టును? దేవయాని శర్మిష్ఠ నూతిలో త్రోసిన దన్నమాట శర్మిష్ఠ చెప్పలేదు. ఘూర్ణక శుక్రునకు దేవయానికొఱకు వెడలిన తర్వాత తా నెవ్వరితో డనో చెప్పెను. వారికి వారు, వారికి వారు చెప్పికొని రాజచారులకు తెలిసెను. కనుక నింతకాలము జరుగుటకు నెంత తొందరగా జరిగినను కొన్ని గంటలు పట్టును. ఒక దినములోననే జరిగినది. ఇంతపనియు నొక దినములోనే జరుగుటకు శుక్రు డన్నచో రాజునకు, రాజ్య ప్రజకు మహాగౌరవముండి యుండవలయును. దీనినుండి యీ విషయ మనుమీయమాన మగుచున్నది.

ఇన్నిగంటలసేపు అడవిలో శుక్రాచార్యులును, దేవయానియు, ఆయన రమ్మని యీయమ రానని యివేమాటలు తిరిగి తిరిగి యనుచు కూర్చుండి నని యర్థము. ఈ యర్థము సుస్పష్ట మగుటకు పల్లెటూళ్ళలో జరుగు నొక సంవిధానము చెప్పెదను. మనకు ప్రేమకలిగిన యొకబంధువు కోపమువచ్చి లేచిపోవును. ఆతనివెంట నతనిని త్రిప్పి తీసికొనివచ్చుటకు మరియొక బంధువు బోవును. ఇతడు రమ్మనును, నతడు రా ననును. ఆ పొలిమేరమీఁద గంటలకొలఁది నటే కూర్చుండురు.

ఈ లోకజ్ఞత్వము తెలిసినగాని కవి యిట్లు వ్రాయలేడు. "పట్టువరుచుచున్నంత" అన్నమాటలో శుక్రుఁ డెన్నో ప్రతిపత్తులు చెప్పుచుండుటయు. నామె యన్నియు నిరాకరించుటయు గంటలతరఁబడి జరిగిన యీ పరిస్థితి వ్యంగ్యభూతమై నన్నయ్యగారియొక్క నాన్యతో దర్శనీయమైన లోకజ్ఞత్వము భాసించుచున్నది. ఆయన లోకజ్ఞత్వ మిట్టిది, ఇంకను నెట్టిదో వేర యొకవ్యాసము వ్రాసెదను.

# సౌకన్యోపాఖ్యానము

ఆదిపర్వములోని యయాతికథ వెంటనే యీ సౌకన్యోపాఖ్యానమును గుఱించి వ్రాయుటకు కారణము కథాకథనశిల్పమీ రెంటియందును నన్నయ్యగారొక్కతీరున నెఱపియుండుటయే.

ఈ సౌకన్యోపాఖ్యాన మరణ్యపర్వములోనిది. శర్మిష్ఠ కథ వ్రాయునపుడు నే నూరక విశేషధ్వనులు నిరూపించుచు కథా ప్రసన్నత పాఠకులే గ్రహించునట్లు వ్రాసితిని. ఇచట మరియొకరీతిగా వ్రాసెదను. నన్నయ్యగారు చెప్పినకథయేది? ప్రసన్నమయ్యెడు కథ యేది? అది యెట్లు ప్రసన్నమగుచున్నది? ఈ మూడు తెరగులుగా వ్రాసినచో పాఠకులకు మరికొంత సులభముగా నుండునని యిట్లు వ్రాయుట యగుచున్నది.

## నన్నయ్యగారు చెప్పిన

"ఇక్ష్వాకులని సమీపమున భృగుసుతుడు పెక్కుగు వేలేండ్లు తపము నొనరించెను. అమ్ముని దేహము వల్మీకమున కప్పంబడి నికట వల్లీగుల్మములు పైఁ బ్రాకిన నేర్పడక యుండెఁ. అంత పెద్దకాలంబునను సంయాతి యను రాజు తత్సరోవరంబున విహరింప నరిగిన నాతని కూఁతురు వల్మీకంబునందు విద్యుల్లతాంగి భార్గవు నుద్యాన్నయనములు

మెఱయుచుఁ సద్యస్సంజాత బుద్ధిసంభ్రమ యగుచు నప్పుట్ట క్రొప్పించిన నలిగి నిమీలితనయనుండై చ్యవనుండు రాజ సైన్యంబులకు కొంత నిరోధంబు చేసిన రాజు చింతాపరుండై యున్న సుకన్య వచ్చి యిట్లనియె. "ఒక పుట్టలో రెండు మిణుగురులై మెఱయుచున్న నెరుగ కేను పుట్ట క్రొప్పించితి. ఈ నిరోధమున కిది నిమిత్తంబగును." అనిన సంయాతి పుట్ట యొద్దకు వచ్చి యతివృద్ధు భార్గవునకు నమస్కరించి "నీ తపము మహిమ యెరుగక యిది యిట్లు చేసె. ఎరుకగలరె తరుణులు ధరణీశా." అనిన ముని "అతిశయ రూప యౌవన గర్వితయైన యీ కన్యకఁ బరిగ్రహించిగాని క్షమింపను" అనగా రాజు తన కూఁతు నమ్మునికి వరున కిచ్చి తన సైన్య నిరోధంబు పాచికొని చనియెఁ" ఇచ్చటి కొక కథ.

మరియు, సుకన్యపతికి పరిచర్య చేయుచు నొనరగా నామెకడ కాశ్వినులు వచ్చి తమ్మెరుగఁజెప్పి యిట్లనిరి. "అవ్వా నివ్వెవ్వఁ కూఁతుర వెవ్వని భార్య"వని; సుకన్య "నేను సంయాతి కూఁతుకను, భార్గవు భార్యనని జెప్పినది." వారు విని నవ్వి కామభోగ బాహ్యుడగు వృద్ధు వరియించి నీ జవ్వనంబు వృధ చేసితి, యింకనైనను నీ వయోరూపంబులకు తగిన వరు వరియింపు, మేము వానిదెచ్చెదమనిన నప్పలుకులు సహింపక అప్పుడే పోయి తన భర్తతో వారి పలుకులు చెప్పెను. చ్యవనుడు దాని పతివ్రతాత్వంబునకు సంతసిల్లి వారల పలుకుల కొడబడు మనెను. సుకన్య వారికడకు చని నాకు యౌవనవరుం గాలింపు డనెను. వా రకొలను సొచ్చిరి.

భార్గవుండును వారితోడన వచ్చె. మువ్వురు నవయౌవనస్తై మాయందు నీ వలచువానిని వరియింపు మనిన నది తనపతి యైన భార్గవుని వరించె. చ్యవను డశ్వినుల కతి ప్రీతుండై వారిని సోమపీథులఁ జేసెను.

ఇది నన్నయ్యగారు చెప్పిన కథ. ఇది పట్టి కథగా నున్నది. లోనారసి చూచినచో బహువిశేషములు కనిపించి యూరకే విడివిడిగా నున్న వస్తువుల కొక సమీచీనత యేర్పడును. అప్పు డొకదివ్యమయిన కథ ప్రసన్నమగును.

## ప్రసన్న మయ్యెడు కథ

ఆ కొలనిదగ్గర చ్యవనుడు తపస్సు చేయుచుండెను. పెక్కువేలేండ్లు చేసెను. అతని శరీరము పుట్టచేత కప్పఁబడెను. చుట్టు నాకులలములు కప్పి పుట్టగూడ కనిపించుటలేదు. అంత చాలకాలమునకు సంయాతి యను రాజచ్చోటికి విహరింప వచ్చెను. అతని కూఁతురు సుకన్య యనునది తన చెలికత్తెతో నచట విహరించు చుండెను. ఆమె యతిశయ రూప యౌవనగర్వత. అందుచేత కొన్ని సాహసపు కార్యములు చేయును. ఆమె పోయి చ్యవనుడు తపస్సుచేయు పుట్టలో చూచెను. చూచుటకు చుట్టున నున్న పొదలన్నియు వెలికి త్రోసి లాగి పీకి యా పుట్టవద్దకు పోయెను. ఆమె కంత యవసరమేమి పట్టినది? ఒక విధమైన యల్లరిపిల్ల యని యర్థము. వయసులో నున్నది. తాను గొప్ప యందగత్తె నని గర్వము. ఆపుట్టలో చ్యవనుడు కనులు తెరచుకొని తపస్సు

చేయుచుండెను. ఆమె యవి మిణుగురు పురుగు లనుకొనెను. అనుకొనినసరే. ఆ పుట్ట త్రవ్వించెను. ముని కనులు మూసి కొనెను. ఆమె కేమియు కనిపించలేదు. ఋషియు కనిపించ లేదు. కనులు మూసికొనెను. కనుక మిణుగురు పురుగులు కనిపించలేదుసరే, ఋషి యెందుకు కనిపించలేదు? చ్యవనుడు సుకన్యను వివాహ మాడవలె నని భావించెను. అందుచేత నా ఋషి యిట్లు చేసెను. ఆ కన్యను వివాహమాడుటయెట్లు? ఆమె తండ్రియైన సంయాతియే నా కూతు నీ కిచ్చెద నని చెప్పునట్లు చేయవలెను. నిజముగా సుకన్య చేసినపనికి మునికి కోపము వచ్చినచో నామె కపకారము చేయవలయును. ఆమెను శపింపవలయును. రాజు సైన్యమును శపించుట యెందులకు?

సుకన్య రూప యౌవన గర్వితయేగాని చాల సద్గుణ వతి. తన సైన్యమునకు జరిగిన మూత్రపురీష నిరోధమునకు రాజు కారణ మెరుగక చింతించుచుండ సుకన్యవచ్చి "నాయన గారూ, నే నొకపుట్ట కొప్పించితిని. అందులో రెండు మిణు గురులవలె మెరయు చున్నవి. నేను పుట్ట కొప్పించినను నా కేమియు కనిపించలేదు. దీనికది కారణమేమో" అన్నది. మన కెందుకు తండ్రి కోపపడు నేమో యని యూరకుండక తానే తండ్రియొద్దకు పోయి యిట్లు చెప్పినది. ఆమె చాల మంచి బాలిక. రాజు పుట్టవద్దకు పోయెను ఆ పుట్టవద్ద రాజు నకు చ్యవన మహర్షి కనిపించెను. అతడు తపస్సుయొక్క క్లేశముచేత చర్మము బొమికలుమాత్రమే మిగిలిన శరీరము గలవాడు. అతనిని రాజు ప్రార్థింపఁగా ముని "అతిశయరూప

యౌవనగర్వితయైన నీకూఁతును పరిగ్రహించిగాని క్షమించ" నన్నాడు. చ్యవన మహర్షి తన తపోదృష్టిచేత సదివఱకే సుకన్య తనకు భార్యగా నుండఁదగిన దనియు, నామెను వివాహము చేసికొనవలయునసియు నిర్ణయించుకొనెను. అందు కనియే సైన్యమునకు నిరోధము కల్పించెను. సైన్య నిరోధము చేసినచో రాజెట్లును తనవద్దకు వచ్చును. అప్పుడు నీ కూఁతు నా కిమ్మని యడుగవచ్చును. చ్యవనుడు వేసిన పథక మిది. మరి తా నడిగినచో రా జిచ్చునా? ఆ రాజుయొక్క స్వభావ మెట్టిదోకూడ మహర్షికి తన దివ్యశక్తిచేత తెలియును. ఆ రాజు మిక్కిలి తపశ్శాలి. మహర్షుల మహిమలు తెలిసినవాడు. అచట చ్యవనుడు తపస్సు చేయుచున్నా డని యతనికి తెలియును. చ్యవనుడు మహామహిమవంతు డనియు తెలియును. అందుకనియే "నీ తపము మహిమ తెలియక నా కూఁతు రిట్లు చేసెను. తరుణులు ఎఱుకగలరా?" అనియెను. వయస్సులో నున్నవారు కన్నుమిన్ను గానక ప్రవర్తింతురని చెప్పినాడు. తన కూఁతునందొక్క వయోదోషమేతప్ప మరి యేదోషము లేదని చెప్పెను. మునికి పరిగ్రహయోగ్య యని చెప్పెను.

ఇట్లీ కథ ప్రసన్నమైనది. మరియు తరువాతికథ ప్రసన్నమైన తెరగెట్టి దనిన? సుకన్య చ్యవనున పరిచర్య చేయుచుండెను. ఋషి తాను వృద్ధుడు. అతనియందు సుకన్య కామోపభోగముల ననుభవించుట లేదు. ఆమె మన స్సెట్లున్నదో? ఆమె తనకంటె నన్యుని వరించు చున్నదో?

సౌందర్యవంతుని వరించు చున్నదో? ఋషికి తెలియదు. అందుచేత నత డశ్వినీదేవతలను సుకన్యవద్దకు పంపించెను. వారు సుకన్యవద్దకు వచ్చి నీ వింత యందక త్తెవు. వృద్ధుని పెండ్లాడి నీ యౌవనము వృథా చేసితివి. నీ యౌవనమునకు నీ సౌందర్యమునకు తగినవరుని వరియింపుము. మేము వానిని తెచ్చెద మనిరి. ఆమె కోపించి పోయి భర్తతో చెప్పెను. ఋషి యాశ్వినులమీఁద కోపించలేదు. వారిని తానే పంపించి నాఁడుగా! అందుచేత భార్యతో నీవు యాశ్వినుల మాట కొప్పుకొను మని పంపించెను. వా రన్నమాట లేమి? ఆమె యెవ్వనినో కోరుచున్నచో వానిని తెచ్చిపెట్టుదు మనికదా? ఈమె పోయి యెవ్వనినో కోరలేదు. నాకు యౌవనవరుం గావింపు మని కోరుకొనెను. నా భర్తను యౌవనవంతుని జేయు డని యర్థము. ఆశ్వినులతో చ్యవనుడును చెరువులో ప్రవేశించెను. ముగ్గురు నవయౌవనులై వెలికి వచ్చిరి. అశ్వినులదివరకే నవయౌవనులు. చ్యవను డొక్కఁడే యిప్పుడు నవయౌవను డైనది. అట్లువచ్చి మా ముప్పురిలో నీ వలచు వానిని వరియింపు మనిరి. మొట్టమొదట నాశ్వినులు నీ వయస్సునకు రూపమునకుఁ దగిన వానిని కోరుకొమ్మనిరి. ఆమె తనకు నవయౌవనవరునే కోరెను. అశ్వినీ దేవతలు మహాసౌందర్యవంతులు. చ్యవనుడు సౌందర్యవంతుడు గాడు. అప్పుడు యౌవనవంతుడుమాత్ర మయ్యెను. తన భర్తకు నశ్వినీ దేవతలు సౌందర్యము తెచ్చిపెట్టలేరు. వారికి చేత నైనది తన భర్తకు యౌవనముమాత్రము కల్పించుట. ఆమెను సౌందర్యమునం దాశలేదు. తన భర్త యౌవన

వంతుడు కావలెనని కోరిక. అతనికి యౌవనము లేకపోయినను తనకు దిగులులేదు. ఎట్టివాడైనను తనభర్త భర్తయగుటయే యామెకు కావలెను. అతనిని తాను సేవించుచుండెను. వారు ముగ్గురు నేకాకృతులు కాలేదు. నవయౌవనులుమాత్ర యయిరి. తన భర్త తెలియుచునేయుండెను. తన భర్తకంటె యాశ్వినుకు లెక్కువ యందగాండ్రనుట కనిపించుచునేయున్నది. కాని తన భర్తనే కోరెను. అంత చ్యవనమహర్షి యాశ్వినులను సోమపీథులను చేసెను. తన మామగారిచేత నొక యజ్ఞము చేయించి వారిని సోమార్హులనుగా చేసెను. తనకు భాగ్య మిచ్చిన రాజునందు హానిచేత యజ్ఞము చేయించి తన దయ చూపించెను. తన భార్యయొక్క పాతివ్రత్యము తెలిసి కొనుటకు తన కుపయోగపడి తనకు యౌవనము ప్రసాదించిన యాశ్వినులను సోమార్హులను చేసెను.

ఇది ప్రసన్నమైన కథ. ఈ ప్రసన్నత యెట్లు సంపాదింపఁబడినది. ఈ కథయంతయు పదునాల్గు పద్యములలో నున్నది. దీసినే నిరాదరత పెడద్రోసి యాభిముఖ్యముతో బాఠకులు జాగ్రత్తగా చూడవలె నని మనవి. కాదని దేని నైన సాధనవచ్చును. కథను వేయివిధములుగా చెప్ప వచ్చును. ఇతర కథాకథనములయొక్క వైఖరినుండి యీ వైఖరిలో నున్న విశేషమును భావించవలయు నని ప్రార్థన. కథను చెప్పికొనిపోవుచు కథలోని స్థూలాంశములుమాత్రమే పైకి కనిపింపఁజేయుచు జాగ్రత్తగా చదివినచో వెనుక నెంతయో యుండుట తెలియునట్లు నిర్మించిన యొక విచిత్ర

మైన శిల్పము నన్నయ్యగారిది. ఊరకే కథ చదువుచు పోవు చుండఁగా చ్యవనఋషి సుకన్యమీఁద కోరికతో నిట్లు చేసె నని స్ఫురించదు. కథాగతభిన్నాంశములు సమకూర్చికొన్నచో నది వ్యక్తమగును. ఋషి కట్టికోరిక లేనిచో నా కోరిక యీ పద్ధతిగా సాఁగించుకొనవలయు నని తలంచ చో సుకన్యను శపించియుండును. ఆమెను కనిపించియుండును. పుట్ట త్రవ్వించి యేమియు కనిపించక యామె వెడలిపోయెను. రాజు వచ్చునప్పటికి ఋషి యెదురుగా కూర్చుండియుండెను. కూర్చుండి రూప యౌవన గర్వితయైన యామెను పరిగ్రహించికాని క్షమింప ననెను. రాజు తనకోర్కెను పెడచెవి బెట్టువాఁడు కాఁడని తెలియును. ఇందువలన చ్యవనుడు సుకన్యను పెండ్లియాడ నెంచి తదనుకూలముగ నదియంతయు సంతరించె నని యనుమీయమాన మగుచున్నది.

మఱి యీ కథయొక్క రెండవభాగమునందు నిట్లే యశ్వినీదేవతలు చ్యవనుని ప్రోద్బలమువలనే సుకన్యను పరీక్షించుటకు వచ్చి రనికూడ నచట చెప్పిన భిన్నాంశముల చేత వ్యక్తమగుచున్నది. ఆమె నేను సంయాతి కూఁతురను. చ్యవనుని భార్యనని చెప్పఁగా వారు నవ్వి "యిట్టిరూప విభవంబులు వడసి యీ ముసలివానినా వరించునది? నీ వయోరూపములకు తగినవానిని వరియింపుము. మేము తెచ్చెద" మనిరి. అంతియేకాని "మేము యౌవనవంతులము. మేము సౌందర్యవంతులము. మమ్ము పెండ్లాడు" మనలేదు. వారు యాదృచ్ఛికముగా రాలేదు. ఆమె యందమును చూచి

మోహించి రాలేదు. చ్యవనుని పంపున నామెను పరీక్ష చేయుటకు వచ్చినవారు మరియు నీ వయోరూపములకు తగిన వరుని కోరుకొమ్మనిరి. కాని నీకు తగిన వరుని కోరుకొమ్మన లేదు. అట్లనవచ్చును. ఇట్లనవచ్చును. ఇట్లనుటచేత నామెకు తన జీవునియందు దేహభ్రాంతి గాని, దేహగతావస్థాభ్రాంతి గాని లేదని తెలియుచున్నది. ఇచట నొకసంగతి చెప్పవల యును. ఇట్టి యర్థములు చెప్పినప్పుడు కొందరు నేడు విజ్ఞులైనవారుకూడ నీవు చెప్పెడు నర్థములుగాని కవి యుద్దేశించినవి కావందురు. ఇట్లన్నచో కాళిదాసాదులందు చెప్పెడు విశేషములన్నియు వ్యర్థము లగును వట్టి తాత్పర్యమే నిల చును. వ్యంగ్యాదులకు ధ్వనులకు ప్రసక్తిలేకుండ పోవును. కవితారచన యన్నది నొకవిద్య కాకపోవును. బహువిధము లైన శిల్పముల ప్రసక్తి లేకపోవును. తెలిసి చేసెడు శిల్పము నకు వెల తక్కువ యగును. ఇంగ్లీషు నేర్చినవారుకూడ Conscious artist అనియే వాడుదురు.

అంత సుకన్య భర్తవద్దకు పోయి యశ్విసుల మాటలు చెప్పెను. లోకసామాన్యముగా నైనచో తన భార్యతో నిట్లన్నవారిమీఁద భర్తకు కోపము రావలయును. ఆయనకు కోపము రాలేదుసరిగదా, వారు చెప్పినమాటల కొప్పుకొను మనెను. దీనచేతగూడ నశ్వినీదేవతలు ' చ్యవనుని పంపుననే వచ్చినారనిగూడ తెలియుచున్నది. ' వారు చ్యవనుని పంపున వచ్చి రనుట యుపలక్షకమైన మాట. అట్లు రాకపోయినను చ్యవనునియందు భక్తికలవారై యతనిచేత నేదో లాభము

పొందుటకు వచ్చిరనియు, నది చ్యవనునికిగూడ లాభమే యనియు నా దేవతలు నా ఋషియు పరస్పర మంతిగంగము నందు తెలిసినవారని యైన నిస్సందేహముగఁ జెప్పవచ్చును. కానిచో నిట్లు జరుగదు. వారు సుకన్యతో ననిష్టమైన మాట యనిరి. ఆమె భర్తతో చెప్పుటకు వెళ్ళెను. ఈ లోపుగా వారు భయపడి పారిపోవలయును. "ఒడంబడుమని పంచిన" అని నన్నయ్యగారు వ్రాసిరి. అశ్వినులు సుకన్యతో మాట్లాడి నది చ్యవనుని యింటిముంగిట కాదు. మరికొంత దూరముగా నని యర్థమగు చున్నది. అందుచేత వారు పారిపోవచ్చును.

ఈరీతిగా నన్నయ్యగా రొకపథకము వేసికొని తాను వేసికొనిన పథకము తాను చెప్పినట్టి వైఖరిచేత, నందులో మాటలాడు పాత్రలయొక్క యల్పములైన మాటలచేత వారి శీలము మొదలైనవి స్ఫురింపఁజేయుచుండును. ఇది కథాధ్వని యనవచ్చునేమో? ఏ కవియందైనను నే కావ్యమునందైనను నా పాత్రలయొక్క ప్రసంగముచేత వారి శీలము తెలియు నని చెప్పవచ్చును. అది యంగీకార్యమే. కాని నన్నయ్యగారి యందు నీ విషయమునందుగూడ నొక వైలక్షణ్యము, విశేషముగూడ గలవు. ఇచ్చట పాత్రలు చాల కొద్దిగా మాట్లాడుదురు. వానినుండి బహ్వర్థములు స్ఫురించును. వీరంద రెవరో దేవతానములైన యొక నియమవంతులు. నియమితవాక్కులు. ఒకపాత్ర మాట్లాడిన దానివలన నాపాత్ర యొక్కశీల మితరుల శీలమునుగురించి యా పాత్రలయొక్క యూహా లితర మహాకవులయందు కల్పించుట యున్నది.

నన్నయ్యగారి యందట్లు కాదు. మువ్వురు నల్వురు కలిసి కొద్ది మాటలు మాట్లాడెదరు. దానివెనుక నొక పెద్దకథ, యొక పథక మెంతయో పెట్టుకొని ప్రవర్తించిన ప్రవర్తన యంతయు నీ కొంచెపు మేరలో ప్రకాశించుట, ఇది యున్నది. ఇదియే యాయన లో నారయవలయు ననుటలోనిదియు ప్రసన్నకథా కలితార్థ యుక్తి యనుట లోనిదియు నై యుండవలయును.

ఇట్లు తా నొక పెద్దకథ వేసికొని యీకథకు పీఠికగా నేదియు చెప్పడు మరి యెవ్వరైనను చెప్పుదురు.

ఈ పది పద్యములలో సుకన్య చేసిన యొక్క-పని, యామె యనిన మూఁడుమాటలు, నామెనుగురించి యితరు లనిన మూడుమాటలు - వీనితో నొకవిచిత్రమైన సుకన్యా సృష్టి జేసెను.

ఆమె చేసిన పని యొకటియే. చ్యవనుడు తపస్సు చేయుచున్నచోట పుట్టపెరిగెను. దానిచుట్టు తీగలు పొదలు పెరిగి యా పుట్టయే కన్పించుటలేదు. అటువంటిచోటికి సుకన్యపోయి యా తీగలు పొదలు లాగివేసి పుట్టలో తొంగి చూచినది. చూచిననేకదా, మునికన్నులు మిణుగురులవలె కన్పించుట. వనములో విహారించు రాచకన్యకు నా తీగలు పొదలు కదలించి లోనికి పోయి పుట్టకన్నములో తొంగి చూచుట యెందులకు? ఇది యౌవనగర్వము, సౌందర్య గర్వము, కొంచెము చిలిపితనము, నిర్భయత్వము, సాహసము. ఈమెయిట్టిదని నన్నయ్య చెప్పడు. ఆమె రూపయౌవనగర్విత

యని ముని యామెతండ్రితో ననును. ఆయొక్కమాటయే యీ కథకంతకు పునాది. మరి యింకొక కవియైనచో "రూప యౌవన గర్వితయైన యొకకన్య యౌవనమదముచేత నా వల్లీ గుల్మములు తొలగించి నిశ్చయముగా నా వల్మీకరంధ్రములలో జూచినన్" అని వ్రాసి యుండును. నన్నయ్యగా రట్లు వ్రాయక పాఠకు డూహించుటకే వదలిపెట్టును. అట్టిపని యొక బాలిక చేయుచున్న దనఁగా పాఠకు డూహించుకొన వలయును. ఆ పాత్రయొక్క మాటలచేత నామె స్వభావము నూహింపఁ జేయుటయు సుచరితపథము. ఇచట నట్లుకాదే. ఆపాత్ర యొక పని చేయును. అది లోకసామాన్యముగా కనిపించును. విచారించినచో నొక యసామాన్యతగూడ భాసించును. ఈ యసామాన్యత నన్నయ్యగారిచేత నుద్దిష్ట మైనది. పైగా నది కథకు ప్రాణభూతమైనదిగా చేయఁబడును. అది పాఠకునకు ప్రసన్నమగుటకు సాధనములుగా పై కథలో పెఱచోట్ల కొన్నివాక్యములు సంశ్లేషించును. వీని యన్నిటి యొక్క సమాహారభావనచేత నాయన చెప్పఁదలఁచుకొన్న కథలో నున్న రహస్యము ప్రసన్నమగును.

ఇట్లామె నిశ్చయురాలు, యౌవనగర్వముచేత సాహ సములుచేయునది. కాగా సైన్యనిరోధకారణ మెరుగక తండ్రి విచారించుచుండఁగా తానేపోయి యిట్లు చేసితి, నది కారణ మగు నేమో యని చెప్పుచున్నది. తా నొక పుట్టచూచి యందులో మిణుగురు లేమో యని క్రొప్పించుట, యచట నేమియు కన్పింపకపోవుట యిది యంతయు లోకసామాన్య

మైన విషయము. సైన్య నిరోధకార్యమునకు దీనియందు కార ణమ్మే మెట్లు? ఏదో కాకూడదా యనుకొన్నదా? లేదా? లేక యేఋషియొక్క యావాసమో, యొక దేవవాసమో యనుకొన్నదా? అనుకొన్నదనుట సమంజసముగా గనిపించు చున్నది. అట్లనుకొనుట న్యాయముకూడను. ఆమె యట్లను కొన్నదని యాయన చెప్పడు. కాని యామె తండ్రితో వచ్చి యిట్లు చెప్పుటచేత దానిని మన మూహించవచ్చును. ఊహిం చినచో సుకన్య శీలమెట్టిదగు చున్నది. ఆమె యౌవనముచేత సాహసక్రియలు చేయునదేగాని ఋషిదేవతాగత నిరాదరణ బుద్ధికాదు. తనతండ్రి సైన్యము దుఃఖితమగుచుండఁగా నూర కుండు బుద్ధిహీనురాలుకాదు. చెప్పినచో తండ్రి కోపపడునేమో యని భయముచేత నల్పమైనదైన నొక సంగతి దాచునది కాదు. యథార్థమైన ప్రవర్తన గలది. దైవభీతిగలది. ఋషుల యందు భక్తిగలది. తండ్రి యెంతచెప్పిన నంతచేయును. పర మోత్తమురాలైన స్త్రీరత్నము. ఆ ముసలివానికి తండ్రి తన్నీయగా పోయి తత్పరిచర్య చేయుచు నుండిపోయినది. ఆమెయం దొక్క రూప యౌవనగర్వముతక్క మరియొక్క దుష్టగుణమే లేదు. ఆ గర్వముకూడ యా సౌందర్యగుణము నీ యౌవనావస్థను విడివిడిగా చూచి తన యాత్మవస్తువునకు వానికిని సంబంధము లేనంత విస్పష్టముగా తెలిసికొన్నదా యున్న యూహ కల్పించెడి యొకరోగిని వంటిది.

ఆమె తండ్రికూడ నీ తపపుమహిమ తెలియక చేసినది. తరుణు లెరుకగలరా? యనుటలో కూఁతు సద్గుణము లెరిగిన

వాడే. ఆమె తనమాటకు జవదాట దని, ఋష్యాదులయందు భక్తి గల దని యతనికిఁ దెలియును.

అశ్వినీదేవతల కథాభాగములో నామె ప్రవర్తన మరియు చిత్రముగా నున్నది వా రిట్లనఁగా నామె సహింపక "చ్యవనునందు నాకు సంతతప్రీతియై యుండ నిట్లు పలుకు టుచిత మగునె?" యనియే యన్నది. భర్త వారిమాటల కొప్పుకొనమనఁగా "అది యేమయ్యా, నాకు నీయందే ప్రీతి" యనలేదు. వివేకవతి, భర్త యభిప్రాయము తెలిసికొన్నది. అవతలివారు దేవతలు. తన భర్త యౌవనవంతు డగుట తన కిష్టాపత్తి పోయి వారితో నాకు 'నవయౌవన వరుంగావింపు' డన్నది. ఒక మహర్షి భార్య కావుటకు తగిన యాత్మజ్ఞానము, వివేకము ఎంతవర కుచితమో యంతవఱకే మాటాడుట మొదలైన లక్షణములు భాసించుచున్నవి.

ముప్పురు నవయౌవనులనుచూచి తన భర్తనే వరియిం చుట యామె పాతివ్రత్యము, భర్తృగతేతరగుణ మిథ్యాకాంక్ష లేని యచ్ఛమైన శీలము చెప్పుచున్నది. ఆమె భర్తనే వరియించిన దనుటచేత నామెకు సౌందర్య గుణమునందు నిష్ఠ లేదన్నది వ్యజ్యమాన మగుచున్నది. మరి యౌవనమం దెందుకుండ వలయును. ప్రజాతంతువ్యవచ్ఛిత్తి విషయము. అందుచేత నున్నది.

ఆమె పుట్టలో మునికనులు చూచి మిణుగురు పురుగు లేమో యనుకొను వేళ నన్నయ్యగారు పద్య మారంభించుచు కందపద్యమును 'విద్యుల్లతాంగి' యని యారంభించెను.

ఇట్లే యేల యారంభింపవలయును? ఈ సంశ్లిష్టాక్షర ప్రాస మెందులకు? ఒకటి యామె సౌందర్య గర్వ మింకు భాసింప జేయుటకు; రెండామె యున్నచోట నుండలేదు. అధిక యౌవనోత్సాహముచే నటు నిటు తిరుగును; ఏదియో యొకపని జేయుచుండు ననుటకు.

'సద్యస్సంజాతబుద్ధి సంభ్రమ యగుచుఁ' అని వ్రాసె. అప్పుడే పుట్టిన బుద్ధియొక్క సంభ్రమము కలది. అందుకనియే పుట్ట త్రవ్వించినది. వయసులోనున్న బాలిక. రాచకూఁతురు. ఎప్పుడేది తోఁచిన నది చేయుట యలవాటు. కాని సహజముగా దివ్యశీలవతి. వట్టి యవస్థావికారముమాత్రమే చెప్పఁబడినది.

ఇట్లు బహువిషయము లూహాగమ్యములై యేమియు లేదనుకొనుటకు వీలున్న పది పద్యములలోని కథలో ననంత విషయములు నొక విచిత్రమై కథయు లో నారసినకొలఁది దేదీప్యమానముగా ప్రసన్న మగుచున్నది. అందుకనియే కాళిదాసాదులుకూడ నిట్లు చేయలేదని చెప్ప సాహసించుట.

కథాకథనము దీనిని పోలినది మరియొకచోట కనిపించదేమో అని సందేహము. కొద్దిలో నాకు నిశ్చయము. కథను అనేకవిధములుగా చెప్పవచ్చును. వానికంటె నీ కథా కథన వైఖరి చాల యుత్కృష్ట మైనదని నాకు తోఁచినది. మరి యెప్పుడో వ్రాసెదను.

# ఋష్యశృంగుని కథ

ఇదివఱకే కథయొక్క యాత్మతత్త్వమును పట్టుకొని కథాకథన వైఖరి నన్నయ్యగారియందు మారుచుండు నని వ్రాసితిని. శర్మిష్ఠా శాకున్తలోపాఖ్యానములు రెండును చెప్పెడితీరు, శిల్పపద్ధతి యెట్లు విశిష్టమైనదో నిరూపించితిని. ఆ పద్ధతి యా రెండు కథలయందే కలదు.

పీఠికలో భిన్నకథలు భిన్నవైఖరులుగా చెప్పఁబడు నని వ్రాయుచు ఋషుల కథలు చెప్పెడి తీరే వేరని వచింపఁబడినది.

ఆ ఋషుల కథలలోఁగూడ ఋష్యశృంగుని కథ చెప్పిన పద్ధతి వేరు.

నన్నయ్యగారు కథయొక్క యాయువుపట్టు పట్టుకొని దానిని ప్రసన్నము చేయుటకే ప్రయత్నించును. కథాంశల యం దెక్కడో అక్కడ నొకచమత్కార సన్నివేశ ముండ వచ్చును. తదపేక్షయా ప్రధానార్థవిషయమును భంగించడు. అంగవిషయము అంగిని మ్రింగదు. మ్రింగినచో రసభంగము.

ఋష్యశృంగుని కథ యెందరకు తెలియును? ఈ కథ లోని పరమార్థమేమి? ఆయన యున్నచోట వర్షములు కురియును. అంగదేశములలో వర్షములు లేవు. ఆయన యంగన దేశములకు రావలయును. అతడు తండ్రివద్ద నాశ్రమపదము

నున్నాడు. తపస్వి. అతడు లోకము నెరుంగడు. స్త్రీపురుష భేదము నెరుంగడు. ఈ భేదములేనిది యాశ్రమపదము. ఈ భేదముకలది పట్టణము. ఆ స్థితిలోనుండి యీ స్థితిలోనికి రావలయును. అది యాత్మనిష్ఠ. ఇది శరీరనిష్ఠ. ఇంద్రియ ప్రవృత్తి యగోచర మగుచో నాత్మవృత్తి. తదభావమందు పరివృత్తి, లోకవృత్త మెరుగనివానికి శరీరగతమైన వాంఛలు రేకెత్తినచో ప్రవృత్తి గలుగును. ప్రవృత్తి గలవానిని ప్రబోధించినచో నింద్రియప్రవృత్తి చెడి యాత్మజ్ఞానము కుదురును.

ఎప్పుడును జ్ఞానవిషయము ప్రబోధము. ఇంతకంటె నదివరకు తెలియనిదానిని తెలిసికొనుట ప్రబోధ మని చెప్ప వచ్చును.

ఋష్యశృంగునకు శరీరగతమైన యింద్రియ ప్రమాథ నము తెలియని విషయము. ఇంద్రియములు నిద్రాణములై వసంత ర్తువునందు వృక్షములవలె తత్స్పర్శచేత లతాదులవలె ప్రబుద్ధములై పుష్పించును. పూర్వమందనవగత మైన యీ వికాస మాకస్మికముగా సంభవించును. ఒక రసాలము శిశి రాంతమున క్రొత్తచివురు తొడిగి వసంతుడు తాకినచో పులకి తాంతరంగవీథియై పూవుగా నగుటకు నున్ముఖమైన కిసల యాగ్రస్థిత క్షౌరక మ్మనుతమ సన్నివేశ సహితమై యుండును. అపుడు వసంత ర్తువు వచ్చి యిల్లై తాకును. క్షౌరక ముద్భిన్న మగును. క్షౌరకము కోరకమై, ప్రసవమై, ఫలమై పరిణమిం

చును. ఈ పరిణామేందిరకు తత్ స్ఫూరకస్ఫూర్తి ప్రధమ దశాప్రబోధము.

ఆ రసాలవృక్ష మెటువంటిదో యౌవనోదయకాల మందలి పురుషుని శరీరము నటువంటిదియే. సృష్ట్యభిముఖమై స్త్రీ వాంఛాగోపనము గలిగి యనధిగత తద్వాంఛమై తాకినచో కందున ట్లుండును. సత్యముగా లోకమునందే యుండు పురుషులకు యౌవనోదయాత్పూర్వమే సత్యము లోకములో నుండుటచేత చూచుచుండుటచేత తద్భావము యౌవనోదయ సమకాలముగ భాసించును. చాలమందియందు శరీరవికాసమునకంటె పూర్వమే మనోవికాసము జరుగును. లోకస్థితులైన వారికింతే. ఆశ్రమస్థితుడై, స్త్రీదర్శన మెట్టిదో తెలియక, కాంతాస్వరూప మెరుగక, కాంతాత్వస్థితి యెరుగక యున్న ఋష్యశృంగునియందు తద్గతమనోభావమే లేదు. యౌవనదశను పొందిన శరీరాణువులయందు వికసనదశాభిముఖమై యీ సృజనహేతుశక్తి నిండి నిబిడమై యున్నది. రసాలమునందు శిశిరాంతమునందు వికసనశక్తి వసంతర్తు స్పర్శచేత ప్రబోధింపఁబడినట్లు, ప్రబోధింపఁబడుటకు ప్రతీక్ష చేయుచున్నట్లు ఋష్యశృంగునియందు నీ యౌవనదశా పరిపాకవేళ తచ్ఛరీరగత సృజనాభిముఖశక్తి కాంతాస్పర్శ వాంఛించి ప్రబోధము పొందుటకు నభిముఖమై యున్నది.

ఈ స్థితిలో ఋష్యశృంగు డున్నాడు. కాంతాస్పర్శ యాయనకు ప్రబోధము కల్పించును. అతనికి యౌవన రహ

స్యము ప్రబోధింపఁ బడనలయును. అంగదేశపు రాజు పంపించిన వారకాంత లతనికి నా ప్రబోధమును కల్పించిరి.

"మునిముండట కందుక న
ర్తనమృదు గీతములయందు దనకౌశల మె
ల్లను జూపి విగచితాలిం
గనయై మునిపతికి ముదము గావించె మదిన్.

ఇట్లు ఋష్యశృంగుం ప్రబోధించి"

ఇది నన్నయ్యగారు వ్రాసినది. ఋష్యశృంగునకు వారు స్త్రీలని తెలియదు. వారి యాలింగనాదులచేత తన యందు ప్రబోధితమై యుద్బుద్ధమైన శక్తి యేమో తనకే తెలియదు. తత్స్వరూపఫలావగతిలేని యొకశక్తి తనయం దున్నదని ఋష్యశృంగుడు గ్రహించెను. అతడు గ్రహించు టయు కాదేమో? ఈ ప్రబోధమువలన వానిశరీరము తన్మహా విషయాభిముఖమై ప్రజ్వలించెను.

ఋష్యశృంగాగానయన కథాభాగములో నిది ప్రథమ ఘట్టము.

కాని యంగరాజు పంపించిన వారకాంతల యీ ప్రయ త్నమునకు ప్రతీకారియైన ప్రయత్నము ఋష్యశృంగుని తండ్రియైన విభాండకునియందు ప్రతిష్ఠితమై యున్నది. వార కాంతలు చేసిన ప్రబోధము ప్రవృత్తి కభిముఖమై యున్నది. ఇచట ప్రబోధశబ్దము తత్పూర్వము తెలియని యావనశక్తి తెలిసికొనుటకు సంబంధించినది. తత్పూర్వము నిద్రాణమై

యున్న యీశక్తి యిపుడు ప్రబోధముపొందినది. ఈ ప్రబోధ శబ్దమా నిద్రనుండి యీశక్తి ప్రబోధింపఁబడుటమాత్రమే చెప్పును. ఇది నిజమైన ప్రబోధముకాదు. నిజమైన ప్రబోధ మాత్మవిషయము. లోకప్రవృత్తియందు మగ్నమైన చిత్తము నాత్మజ్ఞానము పొందునటుల చేయుట నిజమైన ప్రబోధము. ఈశబ్ద మీ రెండుస్థలములయందు చిత్రముగా నతుకుచున్నది. వారకాంత లతనిని తొలుత ప్రబోధించిరి. తండ్రి యీ శరీర జ్ఞానమును నివర్తింపఁజేసి యాత్మజ్ఞానమును ప్రవర్తింపఁ జేయుటకు కొడుకును మరల ప్రబోధించెను. "తపస్వుల తపంబులకు విఘ్నంబుల సేయ ననేకరూపులై రాక్షసులు వనంబునం గ్రుమ్మరు చుందురు. తజ్జనదత్తంబులైన పానీ యంబు లపేయంబు లతిసుగంధులైన కుసుమంబులు మును లకు వర్జనీయంబు లని కొడుకుం బ్రబోధించి యప్పటియట్ల వన్యఫలంబులం దేర నరిగిన" ఈ రీతిగా వారకాంతల ప్రబో ధము జరిగెను. ఆ ప్రబోధము వట్టి యౌవనదశాగత దేహేంద్రియ జ్ఞానసంబంధి. ఋషి చేసిన ప్రబోధము యాథార్థ్యసంబంధి. నిజమునకు వారకాంతలు చేసినది ప్రబో ధముకాదు. ఋష్యశృంగుని స్త్రీగత వాంఛాసర్వ విరహిత విచిత్ర తపస్సహిత మనోవృత్తియే యది ప్రబోధ మని చెప్పుటకు వీలైనది. తండ్రిచేత మరల ప్రతిష్ఠింపఁబడిన ప్రబో ధము చెడినచో నది వికారమగును.

లోకమునందు సర్వజనులకు యౌవనోదయవేళ వికా రమే సంభవించును. లోకము నిత్యము తద్వికారమునందే

నిశ్చితమైయుండి తద్వైకృత భావసాంతత్యమే నిత్యానుభూతి విషయముగా నున్నది.

ఆధ్యాత్మిక ప్రవృత్తియొక్క వైకృత స్వరూప మీ లోకము. దీసనుండి జ్ఞానము సంపాదించుటకు లోకము ప్రబోధితము కావలయును. ఋష్యశృంగుని యందట్లుకాక జన్మచేత, పెంపకముచేత, చుట్టునున్న పరిస్థితులచే శరీరగత వాంఛా విక్రియాపేతమైన స్థితి యున్నది. అది యున్న దని యెరుగడు. ఆజ్ఞానము ప్రబుద్ధము చేయఁబడినది. తండ్రి మరల దానిని ప్రతిష్ఠించినాడు.

ఇపుడు వారకాంతలకు మరల క్లిష్టదశ ప్రాప్తించినది. అతనిని మరల ప్రబోధింప వలయునా? ప్రబోధ మిదివరకే జరిగినది. ఇప్పుడు ప్రబోధింప నక్కఱలేదు. ఏమిచేయ వలయును?

వైకృతము చేయవలయును?

"చనుదెంచి తరుణి మునినం
దను చిత్తంబునకు వైకృతము జేసె విలా
సినుల సహాలాప సహా
సన సహయానములు బంధనములు కావే?

ఈరీతిగా కథలో నున్న పరమార్థము పూర్తిజేయఁ బడినది. మొదటి రెండు ప్రబోధములు గద్య నిబంధితములై యీ వైకృతము పద్య నిబంధితమైనది. ఆయన రచన యట్టిది.

ఈ ఋష్యశృంగ కథలో నీ మూఁడు విషయముల మీఁదనే కథ యాధారపడి యున్నదని పరమేశ్వర శిల్పియైన నన్నయ్యగారికి తెలియును. ఆయన యీ విషయమును దర్శించెను. ఈ కథ యంతయు—

౧. వారకాంత యిట్లు ఋష్యశృంగుం బ్రబోధించి;

౨. విభాండకుడు కొడుకుం బ్రబోధించి;

౩. తరుణి మునినందను చిత్తంబునకు వైకృతంబు సేసె.

ఈ మూడింటిమీఁద నాధారపడి యున్నది. ఈ రహస్యమును నన్నయ్యగారు నిరూపించి యీ కథాతత్త్వ మిది యని తెలిసికొని యీ విషయత్రయ పరిజ్ఞానమే యీ కథలో రహస్యమై యది వివృతమైనప్పుడే కథాప్రసన్నత కలుగు నని తెలిసికొనిన దృష్టి.

ఇంక ఇట్లు వివృతమైన మహావిషయమును పాఠకునకు ప్రసన్న మెట్లుచేసెనో, యీ రహస్య మెట్లు ప్రసన్నమైనదో వ్రాసెదను.

ఇట్లు ప్రబోధ ప్రబోధ వైకృతములు అను మూఁడు దశలుకల యీ కథారహస్యము మూఁడుదశల నుచితరీతిని పరిపోషించుటచేత కథాప్రసన్నత కలుగును. ఇందు ప్రథమ తృతీయదశలు సామాన్యములు. వారకాంత తన చాక చక్యముచేత యౌవన దశావిర్భావముగల ఋష్యశృంగుని మనస్సునందు తద్భావము కలిగించుటలో నధిక విశేషము లేదు. అవిజ్ఞాత యౌవనభావముగల వానియందైనను విజ్ఞాత

యావన భావముకలవానియందైనను దానిప్రయత్న మొక్క రీతిగనే యుండును. ఒక్కటియే భేదము. పూర్వమే తెలిసిన వానిని వ్యామోహింపఁజేసినచో వాఁడు నైతికముగాకూడ భ్రష్టుఁడగును. ఋష్యశృంగునియందు నైతికమైన జారుపాటు లేదు. ఈ వారకాంత ఆపని చేయదు. ఆమెకు రాజు దండభీతి కలదు. అందుచేత నతనియందు స్త్రీవిషయిక వాంఛాంకురము కలిగించుటయే యామె కార్యము. అట్లు చేసినది. అట్లుచేయుటలో లౌకికవిషయ పరిజ్ఞాతయైన యామె తెలివి తేటలు కన్పించవచ్చును. ఆమె తన యాశ్రమమునకు రాగా నితఁడామెను ఋషియనుకొని కృష్ణ మృగచర్మకృత కుశాసనము నందుండఁగాఁ బనిచి దాని కతిథిపూజ సేయ నున్న నామె యిట్లనియె.

"మా యాశ్రమ మిందులకుఁ
న్యాయ నిధీ! మూఁడు యోజనమ్ములు కల దే
బోయెద నీవును విజయం
జేయుమ యందులకు చెలిమిసేయుము నాతోఁ.

అట్లైన నీ చేత సత్కారమ్ము గొందును."

అది వచ్చుచునే యీ నియమము జేసినది. తన్ను చూచి మొదటనే ఋష్యశృంగు డిట్టి సుందరాకారు మునిసుతుని జూడలేదన్నాడు. అనుటయేకాక వాని యాశ్చర్యము నాభిముఖ్యము నామె గుర్తించినది. ఈ యాభిముఖ్యమును పురస్కరించుకొని మునిముందట కందుక నర్తనాదులు చేసినది. 'ముని ముందట' యన్న శబ్దములో రహస్యార్థము గలదు.

అభినయము సేయునపుడు సాత్త్విక భావాదులు నేత్రచాలన హస్తవిన్యాసాదులు పురస్థపురుషసముద్దిష్టములుగ భాసింపఁ జేయుట గలదు. దానిచేత ఋష్యశృంగు డెంతయు కదలి పోవును. ఆలింగన మవధిప్రాయమైనది. ప్రబోధము జరిగినది.

ఈ ప్రబోధముయొక్క లక్షణమెట్టిది? దాని స్వభావ మెట్టిది? ఆ వారకాంతయందు ఋష్యశృంగుడు రమించలేదు. యౌవనవంతుడైన పురుషునియందలి యే భావము స్త్రీ వాంఛానముల్లసితమై ప్రబుద్ధమగునో తాదృగ్గుణ విశిష్టమైన భావమే యతనియందు జాగృతమైనది. తావన్మాత్రమే యీ ప్రబోధము.

అది తావన్మాత్రమగుటనే ఋష్యశృంగుడు తండ్రితోఁ జెప్పెను. అత డగ్నిహోత్రంబు వేల్వక విపరీతబుద్ధియై యుండెను. విపరీతమనఁగా వ్యతిరిక్తము. దేనికి వ్యతిరిక్తము? గృహస్థాశ్రమమందుగూడ నగ్నిహోత్రముగూడ గలదు. అతని యప్పటిభావము బ్రహ్మచర్యాగ్నికి వ్యతిరేకముగా నున్నది.

ఆ వారకాంత ఋషికుమారుఁ డనుకొని దానిని తండ్రితో వర్ణించుచున్నాడు. "కాంచన వర్ణుడు కడురూపవంతుడు కమ్మని జెడలతో ఘనము లగుచు ననయంబు వట్రువలగు రెండు పిండమ్ము లురమున విలసిల్లుచుండ" దాని రొమ్మమీఁద రెండుజడలు వ్రేలాడుచున్నవి. అది రెండు జడలు వేసికొని, రెండుజడలు రెండు భుజములమీఁదనుండి రొమ్ముమీఁద వ్రేలాడునట్లు వేసికొన్నది. ఇచ్చట నున్న

శబ్దములను చక్కఁగా విచారించినగాని యీ యర్థము తెలియదు.

పూర్వకాలమున రజస్వలయు, విప్రలబ్ధయు నేకవేణీ ధరలు. మన పురాణములయందలి స్త్రీపురుషులు చాలా మంది యూర్ధ్వరాహువులు. ఈ ద్విజట లక్షణము పాంచాల దేశమునందు నేటికి కన్పించు చున్నది ఆ బ్రహ్మచారిది కల హంస కూజితనాదము. వాని వదనమ్మువలన సుగంధము వెల్వడుచున్నది. వానిది పుంస్కోకిలాలాప చారువైన మాట.

ఆ వారకాంత సహజమైన కంఠస్వర మట్టులుండగా కర్పూరాది సుగంధద్రవ్యమిళిత తాంబూలచర్వణము చేసి మాటాడినది.

ఈ ఋషికుమారునకు స్త్రీకంఠములోని పంచమ స్వరము విచిత్రముగా వినిపించినది. అతనిలోని యౌవనభావ మునకు కాంతాకంఠగత పంచమస్వరము ప్రబోధహేతు వైనది. ఇది యొక విచిత్రమైన సృష్టిరహస్యము. మహర్షి వంటి కవియే దీనిని చెప్పఁగలడు.

వాడు కట్టిన చీరలు మృదులములు. వానిబృహత్కటి భాగమున నొక్క కనకపట్టము వెలుఁగును.

బృహత్కటి యన్న శబ్దమును ఋష్యశృంగు డెట్లు వాడెను? దానిని చూచినప్పటినుండి దాని నడుము సన్నని తనమే వాని హృదయములో హత్తుకొన్నది. "నడచునపుడు అన్నువనడుము వడకంగా" అని మొదటనే చెప్పినాడు. అహహా! యౌవనావిర్భావము గలిగిన పురుషుని చిత్తవృత్తి

యందు రమణీయ స్త్రీమూర్తి ముద్ర. పృథుకుచములు బృహత్కటి, అన్నువననము సార్వకాలికముగా శిల్పిసమూహ మారాధించు చున్న మూర్తి రమణీయత.

మరియు వానియొక్క తనువునయం దుద్భవమై యొక సౌరభము విలసిల్లినది.

అది వారకాంత. పద్మినీజాతి స్త్రీ కాకపోవచ్చును. మరియు యీ సౌరభ మెట్టిది? పవనసమీరిత మధుసంభవ వివిధప్రసవసౌరభము బోలి ఆమె శరీరమునిండ నత్తరులు వ్రాసికొన్నది. కాని యీ సౌరభము మహర్షియైన యతని యౌవనవాంఛలో తా నెరుగక జీవునియందు సుగృహీతము లైన సర్వసంస్కారాంతర్గత పద్మినీజాతిస్త్రీ భావనావిషయ మున నుపకరించినది

అది కందుక క్రీడ చేసినది. వాతావధూత బాల వృక్షమువలె నున్నది. బాల లతవలె లేదు ఆ వారకాంత వయసున చిన్నదయ్యు నది ప్రౌఢయే. ముగ్ధ గాదు. బాలయై ముగ్ధయైనచో నా ప్రబోధమే జరుగదు.

'వాడు నన్ను కౌఁగలించుకొని మొగముదగ్గర మొగము బెట్టి యొక మృదుశబ్దము జేసెను. ఆ బ్రహ్మచారి ముఖ మంబురుహాసమంబు!'

ఓహో! కవి సమయములలోని పరమరహస్యములు నన్నయ్యగారు సమర్థించుచున్నారా? అది మృదుశబ్దము చేసె నఁట. ఈ మాట యెట్టిదనఁగా? దాని కంఠారవము పుంస్కోకిలారావ మనునట్టిది. ఈ చేసిన మృదుశబ్దము

మణితము. మణితము రతిదశాపరమసోపానవిష్టము. ఆ పరమ విషయమే వాని యీదృశమైన ప్రబోధమునకు కారణ మగును.

వాడు తన చేతిపుష్పములఁ జల్లఁగా నవి యళిప్రకర నిషేవన మొప్పనున్నయవి. ఇ వ్వనకుసుమము లట్లు గావు; వరగంధంబులు.

ఈ ఋష్యశృంగుడు వట్టి ఋషికుమారుడు కాడు. ప్రకృతి పరిశీలనా పటుబుద్ధి. తామరపువ్వులో తుమ్మెద వ్రాలుట చూచినవాడు. అడవిలో మకరందమునకు తిరుగు తేంట్లపద్ధతి తెలిసినవాడు. మధుసంగ్రహణమునకై తేంట్లు ఏ పుష్పగుచ్ఛములమీఁదను గుమ్ములుగా వ్రాలవు. ఈ వారకాంత చల్లిన పూవులమీఁద గుమ్ములుగా వ్రాలినవి. ఈ రీతిగా వస్తుతత్త్వపరిశీలన చేసెడి బుద్ధి యతని కున్నది. ఇది భావుక లక్షణము. ఈ లక్షణాతిశయము కలవాడు గనుకనే యీ ప్రబోధమునకు స్థానభూతుడైనాడు. నన్నయ్య గారు దీర్చిన ఋష్యశృంగు డిట్టివాడు.

ఈ పువ్వులు నిజమైన పువ్వులా కాదా? అయినచో నంత హఠాత్తుగా తేంట్లు మూగవు. రాలినపూవుమీద తేటి వ్రాలదు. అందుచేత నివి పుష్పాకృతిగా చేయబడిన భక్ష్యములు. అవి యెట్టివో చెప్పలేము. ఇట్లని యూహింపక తప్పక వచ్చినది.

ఇది యతనికి జరిగిన ప్రబోధము. లైంగికజ్ఞానము లేకుండ లైంగిక జ్ఞానాభిముఖమైన యొక మనఃప్రవృత్తి. ఈ

ప్రివృత్తి మహర్షియైన నన్నయ్యకే తెలియును. భావుకమైన లోకము గ్రహించవచ్చును. అనుభూతి బహిర్విషయము కాదు. ఊహాగమ్యము. ఊహాలోచితము.

ఇట్టిది ప్రబోధమును తొలఁగించుటకు తండ్రి మరల ప్రబోధించెను.

అత డిట్లు తొలఁగించెను. రాక్షసులు తపంబులకు విఘ్నంబులు సేయుదురు. ఈ యడవిలో వారు తిరుగు చుందురు. తద్దత్తములు వర్జనీయంబులు.

తపస్సనగా నేమి? మహర్షు లనఁగా నెట్టివారు? తపస్సు దేవతా లక్షణము. దాని కెదురు తీర్చినది రాక్షసలక్షణము. ఇది సర్వవేదమునందు ప్రథితమైన యర్థమే. తపోవిఘ్నకారులు రాక్షసులు. అన్నమాట చాలును ఋషికుమారునకు.

మూఁడవదశ చాల సులభము. తండ్రిచేత ప్రబోధింపఁ బడిన యతని చిత్తమునకు వారకాంత వైకృతము గలిగించెను. అంతే. ఋషికుమారుడు తండ్రితో చెప్పకుండ వెడలి పోయెను. అరే! ఏమి యీ యౌవనదశా వికారప్రాభవము? ఋష్యశృంగునియంతవాడుకూడ తండ్రితో చెప్పకుండ వెళ్ళి పోయెను. ఎంత దుర్దమమైనది యీ వికారము!

నన్నయ్య గారీ కథలో చేసిన మహార్థము లివి. ఋష్యశృంగుని తీసికొని యౌవన వికారస్వరూపమును నిర్ణ యించెను. ఈ మహార్థము ప్రసన్నమగుచున్నది.

# నల చరిత్రము

## ఉత్తర భాగము

ఇది జగద్విదితమైన కథ. ఇంతవఱకు వ్రాసిన నాల్గు కథలు చిన్నవి. ఇది పెద్దది. ఈ కథను తీర్చెడి తీర్పు వేరు. ఈ కథలో ౧ హంసదౌత్యము, ౨. స్వయంవరము, ౩. ద్యూతము, ౪. వనగమనము. ఈ నాల్గు ఘట్టములు ఒక భాగము.

రెండవ భాగము నల దమయంతు లిద్దరు విడివడి యుండుట. అసలు ప్రధానకథ యిది. నలుడుపోయి ఋతుపర్ణుని యింట నున్నాడంతియే. అతడు రూపము మారినాడు. దీనికి మించి యతడు పడ్డ కష్టము లేవియు లేవు. అతడు దమయంతిని కలిసికొనుటకై చేసిన ప్రయత్న మేదియు లేదు. కష్టము లన్నియు పడినది దమయంతి. భర్తను కలిసికొనుటకు ప్రయత్నము చేసిన దంతయు దమయంతి. ఆమె పడిన కష్టము లిన్ని యని చెప్పుటకు లేదు. చివరకు నలుడు తిరిగి కలిదోషము వాసినచో నామె చేసిన ప్రయత్నఫలము.

ఇది నిజముగా నల చరిత్రమా? దమయంతీ చరిత్రమా? బృహదశ్వుడు ధర్మరాజునకు నలచరిత్రమే చెప్ప నారంభించెను. కాని నన్నయగారు దమయంతీ చరిత్ర మని చెప్పెను.

ఇంకు ప్రథమభాగ మంతయు దమయంతీదేవికి ప్రాధాన్యములేని కథ. అయినను కథ యారంభించుచునే ఈ కథలో ప్రాధాన్యము దమయంతీదేవిదికాని నలునిది కాదని చెప్పుటకు పద్యగద్యము లుపయోగించెను.

"నిషధేశ్వరుండైన వీరసేనునికొడుకు నలుండనువాడు ప్రజాపాలనంబు సేయుచుండ" ఈ రీతిగా నలుని విషయము వచనములో చెప్పెను. నలునకు ప్రాధాన్యము లేదు. మరి దమయంతీ ప్రాధాన్యమును పద్యమునందు సబంధించెను. "అందు కన్యారత్నమైన యా దమయంతి......అధిక విభవ యుక్తి చేసి"——

దీనినిబట్టియే నన్నయ్యగారి దృష్టి తెలిసికొనవచ్చును.

ఈ కథలోని రెండవభాగము మొదలుపెట్టినప్పటినుండి కథయంతయు దమయంతిమీఁదనే తిరుగును. అది యెట్లు తిరుగునో యీకథా ప్రసన్నత యెట్లు కలుగునో జాగ్రత్తగా విచారించినచో తెలియగలదు.

భర్త తాను నిదురించుచున్నపుడు తన చీర చింపి కొనిపోవు ననఁగా నాముందర పతితో దమయంతి యిట్లనియె. "అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు, సురుచిరముగ భార్యయై చూవె యెందు" అని. నలు డధికదుఃఖ రోగార్తుడు. ఈ కథయంతయు నామె యతని కౌషధ మెట్లైనదో చూపించుటయే.

నలుండు తన్ను వదలిపోయెను. ఆమె దుఃఖ మే మాత్రము? "నీ విట్లు దయలేక పోనగునా? ఎప్పుడు

ధర్మము తప్పవే? సత్యవ్రతుడవే? వగవక సాంగోపాంగము లగు నాలుగు వేదములయు నధ్యయనము పొలుపుగ నొక సత్యముతో నెన యగునే?" అని చేసిన యుపాలంభము. ఈ పద్యము నన్నయగారి సూక్తి. లోక మందరినోట నున్న పద్యమే. కాని నలుడు నాల్గు వేదములను విభాగించినవాడు. నాల్గు వేదములు చదివినవాడు. సాంగోపాంగముగ చదివిన వాడు. సంస్కృతకవి శ్రీహర్షుడు చెప్పినట్లు విద్యల కతని వలన చతుర్దశత్వ మేర్పడినది.

ఈ సంగతిని నన్నయ్యగారు కథ మొదట చెప్పలేదు. నడుమ చెప్పలేదు. యెచ్చటను చెప్పలేదు. నలుని యీ విద్యాచతుర్ముఖత్వము ఈ పద్యమునందు ధ్వనితమగు వస్తు వగుచున్నది.

ఎందుచేత చెప్పలేదు? ఈ కథ తనవలెనే కష్టము లనుభవించినవారు పూర్వముండిరని ధర్మరాజు తెలిసి కొనుటకు బృహదశ్వుడు చెప్పినది. కనుక నలదమయంతులు పడిన కష్టములు తత్సంబంధసామగ్రియు వీనికే ప్రాధాన్యము.

ఔచిత్య మింత సూక్ష్మతమమైన రహస్యము.

తరువాత నడవియందు తిరుగుట, అజగరము పట్టు కొనుట, కిరాతుడు కనుపించుట, సార్థవాహులతో దమయంతి చేదిపురము చేరుట.

మరియు నలుడు కర్కోటకదష్టుడై వికారాకృతి పొంది ఋతుపర్ణు నాశ్రయించుట. ఇక్కడికే కథ మైపోయి నది. విదర్భాపతి నలదమయంతులను వెదుకగా బ్రాహ్మణు

లను పంపించెను. సుదేవుడు దమయంతిని చేదిపురమున గుర్తు పట్టెను. ఇదిమొదలు దమయంతియొక్క పాతివ్రత్యము, ఆమె ప్రతిభావిశేషము బహిర్గతమయ్యెను.

ఏతత్పూర్వము దమయంతినిగూర్చి పాఠకునకు తెలిసిన విషయములు మూడు. ౧ ఆమె సీత రామునందునవలె నలునియందు పరమవ్రత పాతివ్రత్యము, శృంగారరసము రెండును కలిసియున్న మానుష దేవతాత్వమిశ్రి మధుర మూర్తి. ౨. కిరాతుని శపించి దహించ గలగినంత తపస్విని. ౩. ఎవ్వరికి కనుపించని ఋషులామెకు కన్పించిరి.

ఈ పై చెప్పిన గుణములు సర్వ పతివ్రితలయం దుండ వచ్చును. ఇందు దమయంతీదేవి విశేషము లేదు.

సుదేవుడు వచ్చి దమయంతిని గుర్తుపట్టి యామెను విదర్భకు తీసికొనిపోయెను. ఇచటనుండి దమయంతీ ప్రతిభా సముస్మేషభాసియైన కథాప్రపంచము వెల్లివిరియు చున్నది.

ఆమె తన సుస్థితి యేర్పడినతరువాత భర్తను వెదకుటకు మొదలుపెట్టినది.

ఏతత్పూర్వము తన పినతల్లియింట నున్నది. తాను తానని చెప్పలేదు. ఆమె యెంత గడుసరియో? ఎంత యభిమానవతియో? అట్లు తనను చెప్పికొన్నచో తన భర్త మర్యాద యెంతపోవునో యాయమకే తెలియును.

కాదు. తల్లితోనైన తన భర్తను వెతికింపుమని చెప్పచు తాను తదాలోకనవిహీనయై పరలోక కృతావాస నగుదు ననెను. యాథార్థ్యమును చెప్పెను. ఆమెలో నున్న మాతృభావమును రేకెత్తించెను. ఈ మాట తండ్రితో చెప్పలేదు.

ఇచట నొక్కమాట చెప్పవలయును. మహారాజుల యిండ్లెట్టివో, అచ్చటి యాచారము లెట్టివో చాళుక్య నృప తుల యిండ్లు సమృద్ధిగా నెరిగిన నన్నయ్యగారికి తెలియును.

ఆయన యెరిగిన యీ రాజమర్యాదలు వేఱొకసారి వ్రాసెదను.

దమయంతి తాను నలుని కలిసికొను నంతవరకు తండ్రితో మాట్లాడినట్లే లేదు. తన కోరికలన్నియు తల్లితోనే చెప్పెను. వయసు వచ్చిన కూతుండ్రు స్త్రీలు రాజగృహము లలో నెట్లుందురో తెలియవలెను.

తండ్రి మార్గణ తత్పరులైన బ్రాహ్మణుల నమోగించెను. ఎవరితోడను మాటాడని దమయంతి వారితో నిట్లు చెప్పెను. చెప్పిన మాటలు రెండే పద్యములు. మొదటి పద్యములో నామె వివేకమంతయు నున్నది. "నలు డిప్పు డసమర్థుఁ డగుటఁజేసి తన్ను నన్యు లెఱుఁగకుండ యుండు". అందుచేత నా బ్రాహ్మణులు నానా సభలయందు తిట్లనవల యును. మొదటిమాట- "నీవు నిత్యసత్యుడవని, భర్తృధర్మము నీయందు మిథ్యయయ్యె. ఈ నిర్దయబుద్ధి నీకు తగదు. ఆ పతి వ్రతయందు నీవు ప్రసన్నుడ వగుము." ఇవి నాల్గే మాటలు.

మొదటిది ప్రశంస. తరువాతివి రెండు ఆక్షేపణను. నాల్గవది ప్రార్థన. అంతయు పార్థనకాదు. నింద చేయకుండ నుండదు. తాను పడిన కష్టము దాచదు. ఈమె యెవ్వరో సీతాదేవి కంటె గొప్పదివలె కన్పించుచున్నది.

సుదేవుడు బాహుకుని పలుకులు తిరిగి వచ్చి దమయంతికి చెప్పెను. చెప్పి వెడలిపోయెను. "ఆమె పెద్దయుం బ్రొద్దు చింతించెను".

పెద్దయుం బ్రొద్దు చింతించుట నన్నయ్యగారు తరచుగా వాడుచుండుమాట ఇట్టి కొన్నిమాటలను గురించి కథాప్రసన్నతా వ్యాసములు పూర్తియైన తరువాత వ్రాసెదను.

ఈ పెద్దయుం బ్రొద్దు చింతించుట ఇచట నెట్టిది? ఎట్టిదో తరువాత నున్నది.

"నలుండు కానివాడు ప్రతివచనం బేల నిచ్చు?" ఇది యాలోచన. ఎంత విచారించినను తెగనిది. దాని యాగాము లూహించు వ్యక్తియొక్క యాత్మపరిపాక సిద్ధారయితవ్యములు. ఆమె యాత్మ పరిపాక మెట్టిదనగా? ఎంతయో యాలోచించి యా విషయము నిశ్చయించినది. అతడే నలుడని. దీనికి తాను సభలలో నలు డన్న మాటలు వెళ్ళిన బ్రాహ్మణుల ఋజమార్గవర్తిత ఆ బాహుకు డున్నస్థలముయొక్క గొప్పతనము వీటి నన్నిటిని పొంతనపరచుకొన్నది. పైగా ఆ బాహుకుడు శీఘ్రయాన కుశలుడు, సూదక్రియా నిపుణుడు, అశ్వశిక్షకుడు అని సుదేవుడు చెప్పెను. ఆ బాహుకుడు చెల

వెల నగుచు దీర్ఘనిశ్వాస పురస్సరుండై చెప్పెను. వాడు చెప్పిన మాటలు భార్య పురుషుని దోషపుంజము సహించ వలయును. అభీష్టభోగము దేహాంతరమునందు పడయును. ధర్మరతియు పడయు నన్న మాటలు.

నలుని మనఃప్రవృత్తి యెట్టిదో, యతని మాట లెట్టివో దమయంతికి చక్కగా తెలియును. ఆమె యింతని వేకశాలిని. నలుని రథధ్వనికూడ ఆమెకు గుర్తే తరువాత నలుడు రథ మెక్కి వచ్చినప్పుడు "దమయంతి యీ రథ ధ్వని విని యిది నలురథ ఘోషయని యనురాగమందె" యని నన్నయ్యగారు వ్రాసిరి. ఆయన రథధ్వనియే యామెకు గుర్తే, యాయన మనోభావము లెట్టివో తెలియవా? మరి పెద్దయుం బ్రొద్దు చింతించుట యెందులకు? వాడు కురుచ చేతులవాడు, విరూ పాంగుడు వాడు నలుడెట్లగును? కానిచో తక్కిన విషయము లెట్లు పొసగును.

అతడే కారణముచేత నైన వికృతాంగుడు కావచ్చును.

మరియు నతనిని పరీక్షించి చూడవలయును. ఇచట రెండు విషయములున్నవి. మొదటిది యాకృతి. రెండవది యతని శక్తులు, అతని మనోభావములు. లోకమున కాకృతి స్థూలమైనది; ప్రధానమైనది. తనకు నతని మనోభావములు ప్రధానమైనవి. అతడు రూపము మారినను తన భర్తయే. ఈ భార్యాభర్తృ భావము ఆత్మ సంబంధి. దీనినే నలుడు ధర్మరతి యన్నాడు.

"నలుండు కానివాడు ప్రతివచనం బేల యిచ్చు". అనగా వాడు విరూపాంగుడైనను, కురుచచేతులవాడైనను నతడు చెప్పిన మాటలు నలుడు కానిచో చెప్ప డను అర్థము. అతడు నలుడని యీ రీతిగా నిశ్చయమే చేసెను. ఎంత నిశ్చయము చేసినను గొడ్డలివలె నతనిరూపము అభ్యంతర పెట్టుచున్నది. అందుచేత "ఇంకను వలనుగల వారలం బంచి యాతని నిమ్మగా నెఱుంగవలయు" అని నిశ్చయించినది. 'ఇమ్మగా' ననఁగా ఆమూలముగా నని యర్థము. నన్నయ్యగారీ శబ్దము నీయర్థమునందే తరుచుగా వాడును.

"నీ జనని యనుమతమ్మున సుదేవుని రావించెను". తనుచేసిన ప్రతిపనియు తల్లితో చెప్పియే చేయుచున్నది. ఆ సుదేవునితో పునస్స్వయంవరము. ఋతుపర్ణుని సభలో చెప్పుమని పంపించెను. ఇది యాశ్చర్యకరమైన విషయము. అతని నిమ్మగా నెఱుంగుట యిట్లా? ఆతడు తెలిసికొనుటకు మరి కొన్ని ప్రయత్నములు చేయవలయును. అప్పుడు పునస్స్వయంవర వార్త చెప్పించవలయును. మరి యెందు కిట్లు చేసినది? బాహుకుడు నలుడని నిర్ణయించుటకు గాదు, బాహుకుడే నలుడని యిదివరకే నిర్ణయించెను. ఇమ్మగా నెరుంగుట యనగా? తనకు వికార రూపుడెందు కయ్యెను? నేనే నలుడని యతని చేత జెప్పించవలయును. ఈ మొదలైన కథ తెలియజేయఁ బడుటకు నిది ప్రయత్నారంభము.

ఈ ప్రయత్న మామె బాహుకునియొక్క నలుని తన మెంత సునిశితముగా నిశ్చయించినదో యంత నిశ్చయముగా ఫలించినది.

రథము వచ్చినది. ఆ రథధ్వని విని యది నలురథ ఘోష యని యనురాగ మందినది. "నలు నిషధేశు పుణ్య శ్లోకు లోకోపకారకు చూడంగగంటె ననుచు" ఆమె నిశ్చయ మెంతటి సూక్ష్మస్వరూపము గలదో యిందులో తెలియు చున్నది. ఆ రథధ్వని విన్నతర్వాత సందేహలేశముగూడ పోయినది.

అతనిని చూడనప్పుడు ప్రాణములు విడుతు నని తలంచి నది. మరి నలుడు వచ్చుచుండె గదా? యెందుకు చూడను?

అనగా నలుడు తన యథార్థస్వరూపమును తాను పొందగాక అని యర్థమా?

ఇదియే యర్థము. ఆమెకు బాహుకుడు నలుడని తెలి సెను. ఏకారణముచేతనో మారిపోయె ననియు తెలియును. కాని యీ బాహుకుడు తనకు నలుడు. లోకమునకు కాడు. ఆ లోకమునకు కానినలుని నలుడే నని తాను పరిగ్రహించుట లోకవిరుద్ధము. తా నా పని చేయడు. తాను చనిపోవును.

"కమలాయతాక్షి ఋతుపర్ణు చూచి" కమలమువలె విస్తారములైన కనులు కలది. ఆ రథముమీద నలుని చూడ వలయు నని కనులు విచ్చికొని చూచినది, నలుడు కనిపించ లేదు. ఎచ్చటనుండి చూచినది? ఋతుపర్ణుడే యేల కను

పించెను? బాహుకు డేల కనుపించ లేదు? వార్ష్ణేయు డే మయ్యెను? ఇది యొక విచిత్రమైన రచన. మనమే ప్రశ్న పుట్టించు కొనవలయును. మనమే సమన్వయించు కొన వలయును.

ఈ తర్వాత బాహుకుడు రథశాలయందు రథాశ్వం బుల బంధించి సమీపమున విశమించెను. దమయంతి "బాహుక వార్ష్ణేయులతోడ వచ్చిన ఋతుపర్ణుం జూచి విఫల మనోరథయై యుండనోపక కేశినియను దానింబిలచి ఋతు పర్ణు నయోధ్యాపతిగా. వార్ష్ణేయు సూతపుత్రుంగా నెఱింగితి. బాహుకుండను వా డెవ్వండో, వానియందు నా హృదయంబు ముదితం బగుచున్న యది. మన పర్ణాదునకు ప్రతివచనం బిచ్చినవాడు వాడ కావలయు. వానికడకుం బోయి యెరింగి రమ్మని పంచెను.

మొదట రథముమీఁద ఋతుపర్ణునే జూచుట కిది కారణము. అందు ముగ్గు రున్నారు. నలుడు సుస్థితిలో నున్నచో రథమునందు ఋతుపర్ణునివలె కూర్చుండును. దూరాన పోవు రథము నంతఃపురమునుండి యామె చూచు చున్నది. ఋతుపర్ణుడే యెత్తైన పీటమీద నుండెను. అరదము ముందు దిగువ ప్రదేశములో నొగలునందు బాహుకుండును వార్ష్ణేయుడును సేవకుడే. ఇద్దరకు ప్రధానస్థానము లేదు. వారు దమయంతికి కనుపించలేదు. దీనిచేత నాటి రథ నిర్మాణపద్ధతి సూచింపఁబడుచున్నది.

మరి వానియందు నా హృదయంబు ముదితం బగు చున్నయది. ఈమాట "అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా, యదేత దస్యా మభిలాషి మే మనః" యన్న యర్థమును రూఢిపరచుచున్నది.

ఈ సర్వ వ్యవహారమునందు నాచె తన యంతఃకరణ ప్రవృత్తిమీఁదనే యాధారపడి యున్నది. తరువాత బాహు కుని పిలిపించఁబోవునప్పుడుగూడ 'సందియ మేల' మొదలైన పద్యమునందు 'బాహుకుండు నైషధు డవశ్యము తా నగు నా మనంబు నానందము నొందుచున్నది' అని చెప్పను.

తరువాత ఆ పంపించిన కేశిని నలునితో మాటాడిన మాటలలో కేశిని తెలివితేట లెంతవరకు? దమయంతి చెప్పిన మాట లెన్ని? విచారించినచో కేశిని తెలివితేట లన్నియు దమయంతీదేవి వే అనవలయును. ఎందుచేతననగా కేశిని బాహుకునితో "దమయంతి నీకుశలం బడుగ పుత్తెంచె నన్నది". అనగా నంతఃపురరహస్యము బయట పడుచున్నది. వాడు నలుడు కాడేని యింతమాట యనునే? అతడే నలు డని దమయంతియొక్క నిశ్చయము. నిశ్చయాతి నిశ్చయము. ఈ రహస్యము కేశినికి చెప్పినది. తల్లికి చెప్పినది. తల్లి నమ్మలేదు. ఆమె సందేహ పడినది. అందుకనియే "సందియ మేల సర్వగుణ సంపద జూడఁగ బాహుకుండు భూవందితు డైన నైషధుడు" అన్న పద్యము నా రీతిగా నారంభించుట. ఒక్క మాటతో వెనుకనున్న పరిస్థితి నంతయు నుద్దీప్తముగాఁ జేయుట.

ఇచట నొకవిషయము చెప్పవలయును. కేశినిని దమయంతి బాహుకుని వద్దకు రెండుమార్లు పంపించినది. మొదటి సారి నన్నయ్యగారు కేశినీ బాహుకుల సంవాదమును వ్రాసిరి. రెండవసారి కేశిని వెళ్ళి తానుచూచి వచ్చిన విషయములు దమయంతితో చెప్పును. మొదటిది సంవాదము. రెండవది అతడు వంటచేయుచుండఁగా కేశినిచూచి వచ్చిన కథ. అది యట్లే చెప్పెను. దీని నట్లే చెప్పెను. ఈ యౌచిత్యము దీని యందలి శిల్పము నాన్యతో దర్శనీయము.

కేశినివచ్చి చెప్పినతర్వాత దమయంతికి తెలిసిన విషయమేమి? నలుడుకూడ దుఃఖించుచున్నాడని తెలిసెను. అతడు తనయందు మిక్కిలి యభిముఖు డని తెలిసెను. అతడు తన నిజస్వరూపమును బయటపెట్టుటయే మిగిలినది. బాహుకునివద్దకు కేశినిని పంపించుట వాడు నలుడో కాదో తెలిసికొనుటకు కాదు. అతడు నలుడని యిదివరకే తెలియును. అత డిప్పుడేస్థితిలో నున్నాడు? వట్టిరూపము మారుటయేనా? మనస్సుకూడా మారినదా? మారిన రూపము శాశ్వతముగా మారినదా తాత్కాలికముగా మారినదా? శాశ్వతముగా మారినచో తా నింక నలుఁడని చెప్పికొనలేడు. అప్పుడు దానికి తగినట్లే ప్రవర్తించును. తాత్కాలికముగా మారినచో తాను నలునివలె ప్రవర్తించును. తన హృదయగత భావములను గోపనము చేయడు. ఇప్పుడు చేయలేదు. అందుచేత దమయంతికి తెలిసెను. తాను భర్తను కలిసికొనవచ్చు నని.

కలిసికొనుట యెట్లు? తనంతట తానైనచో పోయి కలసికొనెడిదే. తాను తనతండ్రి రాజ్యములో నున్నది. తల్లి యంతఃపురములో నున్నది. తాను పోయి గుఱ్ఱాల సావిడిలో నొక కొకిబికిమేసి వానితో ప్రసంగించినచో రాజమర్యాద యేమగును? ఒకవేళ బాహుకుడు మరల నలుని రూపము పొందలేడేమో? ఎట్లైనను తన కేమియు నభ్యంతరము లేదు. లోకదృష్టిలోనది మిక్కిలి తప్పు. అందుచేత తానశ్వశాలవద్దకు పోగూడదు. బాహుకుడే యంతఃపురమునకు రావలయును. ఇందులో మరియు నంద మున్నది. అంత నిశ్చితమైన యతని నలుని తనవలన ప్రతిపదమునందు పరీక్షించుటయే. అతడు నలుడు కానిచో నంతఃపురమునకు రానేరడు. వెంటనే వాడు భయపడి పోవును.

అందుచేత తల్లితో "ఘనంబుగ వాడిట వచ్చువాడో, యే నందుల కేగు దాననో" అన్నది. అత డిచటికి వచ్చుట ఘనము. ఈ శబ్దము నేటికిని తెలుగుజాతి యిట్లులే వాడు చున్నది. అతడు రాడేని తానే వెళ్ళునట. దమయంతి తల్లి బెదరిపోయినది. వెంటనే తండ్రియొక్క యాజ్ఞచే బాహుకుడు రప్పింపఁబడెను. బాహుకుడు చనుదెంచి—

"చనుదెంచి యందు దీనా
ననవవిరళ పంకమలిన నతగాత్ర దప
స్విని నతికృశ దమయంతిం
గనియె నలుం డుదిత బాష్పకణ కలితముఖః."

"దమయంతి నలుని వికృతాం
గము జూచియు నతని నన్యుగా వగవక నె
య్యమునను లజ్జను నతి సం
భ్రమమున వివశాత్మ యగుచు పతి కిట్లనియెన్"

ఇంతకంటె నాటక రచన యెట్లుండు నేమి? మతం గాశ్రమమునందలి శకుంతలను జూచి దుష్యంతుడు—

"వసనే పరిధూసరే వసానా
నియమక్షామ ముఖీ ధృతైక వేణీ"

మొదలుగా వర్ణించినాడు. తన ధర్మపత్ని తన విరహ వ్రతభార యగుట చూచుటకంటె పురుషున కానంద మేమి గలదు? పురుషునియొక్క యాభిముఖ్య సర్వస్వ మందే యేర్పడును. అక్కడ శకుంతలయు నిచట దమయంతియు తను భర్త్రాభిముఖ్య వాంఛ గలవారు. ఇచటి భావము లన్నియు ప్రోగుచేసి చూపించవలసిన యవసరము లేదు.

కథ యంతయు దమయంతి మీద నడచు చున్నది. బాహుకుడు దమయంతిదగ్గరకు వచ్చునరికి కథ బాహుకుని వైపు మరలినది. కాని వెంటనే దమయంతిమీదకే మరలెను. ఏల ననగా — దమయంతీ దేవియే తమ భార్యా భర్తల సంయోగకార్యకరణ పరమేశ్వరి. ఆమె యతనిజూచి యన్యు గా వగవలేదట. స్నేహముతో, సిగ్గుతో తొట్రుపాటుతో వివశాత్మ యైనదట. అయి పతి కిట్లనియెన్. పతితో నే మన్నదో చూచినచో నామెయొక్క వివేకము సంపూర్ణముగా

తెలియును. ఆమె యంతటి లోకజ్ఞురాలామెయే. అనఁగా నన్నయ్యగారి యంతటి లోకజ్ఞుడు నన్నయ్యగారే యని యర్థము. ఇతర మహాకవులు లోకోక్తు లెరుగుదురు. పలుకు పసం దెరుగుదురు. మాటలోని గడుసుదన మెరుగుదురు. నుడికారపు జిగి యెరుగుదురు. లోకము నన్నయ్యగా రెరిగినట్లెరుగరు. లోకమనగా భిన్నకక్ష్యలుగల సంఘమును తత్కక్ష్యలయొక్క సువిస్పష్ట వివిచ్యమాన లక్షణసమవేతముగా నెరిగి యుండుట. దరహాము మీాద వట్టి మానవస్వభావమును వర్ణించుచు పోయినచో సర్వత్ర పాత్రౌచిత్య మేర్పడదు. ఆ పాత్ర సంఘముయొక్క యే కక్ష్యలోనిది? ఆ సన్నివేశ మెట్టిది? పరిస్థితి యెటువంటిది? వీటి నన్నింటిని విచారించి ఆ పాత్రచేత నామాట ననిపించుట, యా పనిని చేయించుటయు నుచితము. ఔచిత్య మింత తీవ్రమైనది.

దమయంతి పతి కిట్లనియెను: 'అ ట్లడవిలో భార్యను వదలి నలునివలె నితరులు నిర్దయులై వెడలినవారు లేరు. అతనికి నే నేమి కీడు చేసితిని? నన్ను వదలి పో నన్నమాట లెందుకు మరచిపోయెనో? ఇది యనిన మాటల సారాంశము. ఆమె బాహుకునితో మాటాడు చున్నదా? మరల నతని యందు భర్తయందువలె చనవు నెరపుచున్నదే. స్నేహ లజ్జాదులైన చేష్టలు బాహుకుడు భర్తయగుట రూపించు చున్నది. మాటలు బాహుకునికంటె నితరు నుద్దేశించు చున్నవి. ఇది యేమి చమత్కారము?

ఒకవేళ నలుడు మరల తన రూపము పొందలేదు. కలదో లేదో యతనికే తెలియును. మరల నలరూపము

పొందలేడేని వారి దాంపత్యము వ్యర్థమై పోవును. ఈ బాహుకుడే నలుడని తాను లోకమును నమ్మించలేదు. తల్లిదండ్రులు నమ్మినను వానితో తనకూతు రుండుట కంగీకరింపరు. ఇది యంతయు లోకము. ఇది తెలిసికొనుట లోకజ్ఞత. ఈ లోకజ్ఞతయందు దమయంతీదేవి చిత్త మవధిభూతముగా నున్నది.

నేనే నలుడనని బాహుకుడే చెప్పికొనవలయును. తన పాతివ్రత్యము ఋజువుచేసి తన ధర్మము సంపూర్ణముగా నిర్వర్తించి, తన వివేకమును భాసింపఁజేసి తన ప్రేమ నొలుకబోయుచున్న యా దమయంతిముందు నలుడు తన్నుతాను చెప్పికొనక యేమిచేయును? ఆమె యన్న ప్రతిమాటయు నామె గుండెకు శూలమువలె గ్రుచ్చుకొన్నది. ఒక్క పొల్లుమాట యనదు. ఒక్క వ్యర్థపుబలుకు రానీయదు.

నలునకింక నేమియు నాధారము లేదు. పునస్స్వయంవర ప్రసంగ మెత్తినాడు. విదర్భలో తాను చూడలేదా? అక్కడ స్వయంవరమే లేదే? కాని యామాటయే యతనికి బాధకలిగించినది. ఆ బాధ బాధకాదు. తన భార్య నే నిందుకోసము చేసితిని. అన్నంతనే తీరిపోవునది. అయినను నట్టిమాట దమయంతి కెట్టి కష్టము కలిగించును? "నే నొక పాపభావము నెరుగ ననుటకు నీ పాదములు పట్టుకొనగల్గుదు నన్నది?" ఆమె మాటాడు మాటలు దేవతలమాటలు. మనుష్యుల మాటలుకావు. దమయంతి, చంద్రమతి, అనసూయ, సావిత్రి, అరుంధతి మొదలైన యీ మహాజ్యోతు లెట్లుందురో మనకు తెలియదు. నన్నయగా రిట్లుందు రని చూపినాడు.

# నల చరిత్రము

## పూర్వ భాగము

పూర్వవ్యాసములో హంసదౌత్య స్వయంవర ద్యూత వనగమనములు నలకథకు పూర్వభాగమని వ్రాసియుంటిని. ఈ పూర్వభాగ కథలో నన్నయ్యగారు తీర్చిన తీర్పు వ్రాసెదను. ఉత్తరభాగస్థ శిల్పముకంటె నిది భిన్నముగా నుండును. ఇందు భిన్న సన్నివేశములను తదుచితముగా చేయుటయే చూపఁబడిన శిల్పము.

మొదటిది హంసదౌత్యము. హంసదౌత్యము నలకథకు ముఖము. నలదమయంతు లిద్దఱొకరొకరి గుణంబులు విని యన్యోన్యము కోర్కిగలవారయిరి. 'ఒకనాడు నలుడు దమయంతీ గుణబద్ధ చేతస్కుండై మదనానలంబు సహింపనోపక ప్రమదవనంబున గ్రుమ్మరువాడంతరిక్ష స్త్రీ కాంతా హారావళి యుంబోలె హంసావళియవనీతలంబున కవతరించిన'—దమయంతీ గుణబద్ధ చేతస్కుడు=దమయంతియొక్క గుణములయందు బద్ధమైన మనస్సు కలవాడు; దమయంతి యను త్రాడుచేత కట్టబడిన మనస్సు కలవాడు—మదనానలము సహింపనోపక, అనగా కాలు సేతులు కట్టివేసి నిప్పులో వేయఁబడిన వానివలె నుండె నన్నమాట. అంతరిక్ష మను స్త్రీ యొక్క ముత్యాల పేరువలె హంస సమూహము భూమి కవతరించెను.

ముత్యాల పేరువలె హంసల వరుస యున్నదనుటచేత గగనమున బక్షులు గుమ్ములుగా నెగురునప్పుడు మెడలోని హారమువలె నాబద్ధమాలలై పోవుట విదిత మయిన విషయమే. ఈ పోలిక చెప్పుట యెందుకనగా నలుడు దూత యయిన హంసను పట్టుకొనఁగా 'పిండుకట్టి ౦ దుగుచుండె వాతోద్ధూత శారదాభ్రశకలచయమువోలె' అన్న భావముతో నసమత్వము కల్పించి చమత్కరించుటకు, ఇచట యంతరిక్ష మను శబ్దము, అవతరించుట యన్న శబ్దము— ఈ రెండును ముఖ్యములైన శబ్దములు. అంతరిక్ష మనఁగా వాయు ప్రసారము గల యాకాశము. (వాయు రంతరిక్షే. సూర్యోదివి చంద్రమా దిక్షు నక్షత్రాణి స్వలోకే' అని వేదము) ఈ హంసలు వాయు మండలమునుండి దిగినవి. ఎచట నుండి వచ్చినవో తెలియదు. వాయు మండలమునందే యుద్భవించిన వేమో! 'అవతరించు' శబ్దము 'డిగ్గు' అన్న సామా న్యార్థమును చెప్పుచున్నను 'భగవంతు డవతరించెను' అన్నచోటి యర్థమును కొట్టుచున్నది. కనుక వాయువు తనువుగా గలిగిన దైవ మవతరించె నన్న స్ఫూర్తి యీ శబ్దములందు గలదు.

నలుడు 'హంసల నడబెడంగు చూచి నగుచు' = వాని నడకల సొగసు చూచి నవ్వుచు. 'ఎందుకు నవ్వవలయును? స్త్రీలవలె నడచుచున్నవి. దమయంతీ గతబుద్ధి కదియే కదా యూహ! 'ఎగచియెగచి యందు నెగయకుండఁగ నొక్క హంస బట్టుకొనియె నతిరయమున' ఎగురగొట్టి పైకి లేవకుండ

ముండగా నొక్క హంసను మిక్కిలి తొందరగాఁ బట్టుకొని యెను. (ఎగచు = ఎగురఁజేయు, ఎగయు=పైకి లేచు) ఆ హంస యెగురనే లేదు. దానిని మిక్కిలి తొందరగాఁ బట్టుకొనియెను. అది యెగిరిపోవు నేమో యని యతనిభయము. అది యితడు పట్టుకొనవలయు ననియే యెగుఁ లేదు.

'ఆ హంస తన కమ్మనుజేశ్వరు డపాయమ్ముఁ సేయుంగా వగచి" చేయునని వగచికాదు చేయుంగా యని వగచియు కాదు. ఇచ్చటి 'కా' వర్ణము 'కాఁ' అను నుజ్యాంతంబయి క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు ధాతువు కాదు. క్రియావిశేషణము కాదుగనుక. కదార్థమైన కావర్ణము కాదు. ఇచ్చట నర్థపుష్టి జరుగవలయు నన్నచో నిత్వర్థ ముండవలయును. ఈ వాక్యమున కర్థ మెట్లు సంపాదింప వలయును? అతడు తన కపకారము చేయడు. చేయునన్నట్లూహించి యను నర్థము కల్పించుకొనవలయును. వగచునను ధాతువున కీ రీతి క్రియావిశేణముచేయుట తక్కిన భాషలో గనిపించుట లేదు.

ఆ హంస మనుష్యవాక్యంబులతో 'నీకుం బ్రియంబు చేసెద. నీ హృదయేశ్వరి యయిన దమయంతి పాలికింబోయి' మొదలైన వాక్యములు చెప్పెను. ఈ హంసకు దమయంతి నలుని హృదయేశ్వరి యని యెట్లు తెలియును? తెలియుంబో! నీకెట్లు తెలియునని నలుడేల ప్రశ్నించలేదు? సరికదా, దాని పలుకులు తన మనస్సునకు 'అమృతధారాపాతంబునుబోలె నయిన' 'అనురక్తు' డయి దానిని విడిచెను. అనురక్తుడు =

అనురాగము పొందినవాడు. అనుసరించి రక్తుడయిన వాడు. ఈ రెండవ యర్థముకూడ నిందున్నది.

అమృత ధారాపాతమువలె ననుటలో హంసయొక్క భయముతో గూడి చెప్పిన మాటల తొందరతో గూడిన యెడములేని స్వరసాంతత్యము ద్యోతమాన మగుచున్నది. ఇదియు 'కాంతాహారావళి'యు కథలోని చమత్కారములు కావు. కథను చెప్పికొని పోవుచు ననుబంధములుగాఁ జేయ బడినవి.

ఈ హంసపిండు దమయంతివద్దకుఁ బోయి విహరించు చుండెను. నలునివద్ద విహరించుటకుఁ బోయెనని చెప్పినచోటను నిచ్చటను రెండు స్థలములయందు వచనమే వాడఁబడెను. రెండును సామాన్య పరిస్థితులు. రెండు స్థలములయందును వచనమే వ్రాయఁబడుట తొలుత చెప్పిన పసితనములో నొక భాగము.

నలుచేత విడువంగఁబడిన హంస చెలువముగ నందు దమయంతిచేతఁ బట్టువడియె. ఇందు 'పడు' ధాతు వనుప్రయుక్త మయినది. నేడు చాలమంది యిది సంస్కృతము నుండి యెరవు తెచ్చుకొనబడినదని, తెలుఁగునకు సుందరము కాదని యందురు. తెలుఁగుపద్యములో నీ శబ్దము వినఁబడినంతనే చీదరించు వారినిగూడ నే నెరుఁగుదును. వాడు కన్పడెను. కూలఁబడెను. వానికిది చేపడెను — ఇటువంటి ధాతువుల వలన నీ శబ్దము తెలుఁగునకుగూడ సహజమనియే చెప్ప వచ్చునే. కాన యిచ్చటి 'విడువంగఁ బడిన—పట్టువడియె'

అన్నశబ్దము లెంత యర్థసమృద్ధిని గలిగించుచున్నవి! సౌంద ర్యాపేక్షచేత సర్వశబ్దములు సుప్రయోజ్యము లగును. ఇది శిల్పరహస్యము.

'చెలువముగ' ఈ శబ్దము వృథా ప్రయుక్తముగా కనిపించ వచ్చును. కాని కాదు. మనము మాట్లాడుకొను చుండఁగా 'చమత్కారంగా ఇల్లా జరిగిందిరా' అనుట వాడుక. ఈ శబ్దము తత్స్థానీయము. వట్టి కార్యాలంకారమే కాక మధురార్థ సంఘటన సామర్థ్యము కలది కూడను. వంద హంసలు వందమంది సౌందర్యవంతులు వానిని పట్టుకొనుటకు వీరందఱు పరుగెత్తుచున్నారు అవి యెగిరి పోవుచున్నవి. పూవుల తోట. ఆ యందము చెప్పుటకు వీలగునా? నలుడు విడచిన హంస యే చెలికత్తె చేతికిని దొరకదు. దమయంతి రావలయును, పట్టుకొన వలయును. పట్టువడియె ననుటలో నలు డతిరయమున హంసను పట్టుకొనె ననుటలోని యతి రయత్వముకూడ స్ఫురించుచున్నది.

అచట నలునితో హంస చెప్పిన మాటలు వచనము లోనే వ్రాయఁబడెను. ఇచటను హంస దమయంతితోఁ చెప్పిన మాటలు వచనములోనే వ్రాయఁబడెను. కాని యీ మాట లలో నడుమ నొకపద్య మున్నది. ఆమాట లా పద్యములో వ్రాయఁబడుటలోని యౌచిత్యము భావుకు లెఱుఁగుదురు.

ఇది హంసదౌత్యము. ఈహంస యెవరు? దీనికీ మాటాడుశక్తి యెచ్చటనుండి వచ్చినది? తన ప్రేమ రహ స్యము దీనికిఁ దెలియుటను నలుఁడెట్లు నిశ్శంకముగా స్వీకరిం

చెను. ఈ హంస 'యవతరించెను.' ఇది దమయంతికి నలునకు సంగమకారణదూత, సంగమమునకుగారణమయిన దూతయని యర్థము. ఈ హంసలేనిచో వారి సంగమము జరుగదా? అది వఱకే వా రన్యోన్యలగ్నమనస్కులు. ఈ దౌత్యమువలన దమయంతి యధికవిరహాత ప్రయగుటయు, భీముఁడు స్వయం వరమును జాటించుటయు జరిగినమాట నిజమే! అంతమాత్ర మున సంగమ కారణదూత యనవలయునా? ఏవిధముగాఁ జెప్పిన చెప్పకూడదు? ఇచ్చటి కారణశబ్దమే చమత్కారముగా నున్నది. కారణజన్ముఁడు మొదలయిన శబ్దములు కలవు. వారి సంగమమే కారణముగాగల దూత ఈహంస మరి యెచ్చటను లేదు. ఈ యొక్క-కారణముకొఱకే యీహంస భూమి కవతరించెను. ఇతర కావ్యములలోని హంసలు, పక్షులు మాటాడినచోఁ బంచతంత్రములో పక్షులు మాటాడి నట్లు. ఇచట నట్లుకాదు. ఈహంస నలదమయంతులయొక్క-సంగమార్థమయిన కారణజన్మ కలది.

ఈ హంస శివుఁడు. ఇది శివపురాణాంతర్గత మయిన గాథ. ఆహుకు లను భిల్లదంపతులు యుగాంతరములందు దపస్సు చేయఁగా శివు డనుగ్రహించి 'మీరిద్దఱు నలదమ యంతు లయి జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు నని ప్రసాదించెను. ఆగాథ యిచ్చట ననుసంధిత మయినచో నీ నన్నయ్యగారి రత్నగర్భమైన రచన తెలియును. నన్నయ్య గారు తాను 'నానాపురాణ విజ్ఞాననిరతుఁడ' నని చెప్పి కొనెను.

ఇది యందఱకు నెట్లు తెలియునని ప్రశ్న పుట్టవచ్చును. ఆ కాలములో నీ ప్రశ్న లేదు. నేడు మన మింగ్లీషువారి చరిత్ర యెంత చక్కఁగా నెఱుఁగుదుమో నాఁడు బహు పురాణకథలు వారంత బాగుగా నెఱుఁగుదురు. ఎనిమిదవ హెన్రీ యనేకభార్యలను చేసికొన్నా డన్న విషయము విద్యావంతులకు నే డెంత పరిచితమో యాహ్లుకభిల్లుని కథ నాటి విద్యావంతుల కంత పరిచితము.

ఇట్లు పూర్వభాగములో నిభిన్న విషయములు ప్రతిదియు వ్రాసినచో బోలెడంత గ్రంథము పెరుగును. నన్నయ్యగారి ప్రతిశబ్దము విచారించినచో సంక నెక్కునకాలము పట్టును. అది వ్యాఖ్యానమగును. ఒకటి రెండు విషయములు చెప్పి ప్రధానఘట్టములే పరామర్శింతును.

దేవతలకు నలుఁడు దౌత్యము చేసెను. ఇచట నన్నయ్య గారి నేర్పు చూపించెదను. 'దమయంతీ నివేశంబు ప్రవేశించు నపుడు నిన్నెవ్వరు వారింపనోడుదురు' అని యింద్రుఁ డనెను. అశంకితుఁడై నలుఁడు దమయంతీగృహంబు సొచ్చెను. ఇచట చూడవలసినది దేవతలు. నలున కదృశ్య మహిమాదులేవియు నీయలేదు. ఇచ్చినచో గనిపించుటయు, గనిపించక పోవుటయు నలుని యధీనములో నుండెను. దేవతలకు నలుని మీఁది యధికార ముండదు. వారు సర్వవ్యాపులు. అదృశ్యులయి నలుని వెంట నుండవచ్చును. ఒక పరిస్థితి తమ కనుకూలము కానిచో నతఁడు కనిపించకుండ చేయవచ్చును. కనిపించునట్లు చేయవచ్చును.

'హంసచేఁ దన విని నంతకంటెను రూప
విభవాతిశయముల వెలయుదాని
సురకన్యకల యట్టి సురుచిర శతకన్య
కాళిచేఁ బరివృత యైనదాని
హృదయేశుఁడైన త న్నెప్పుడు వినుచుండ్క
నలయ కాశ్వాసితమైనదాని
దమయంతి జూచి కందర్ప శరావిద్ధు
డయ్యె నలుం డంత నతని జూచి
యిత డపూర్వ మనుజు డెందుండి వచ్చెనో
యనుచు నదరిపడి లతాంగు లెల్ల—'

ఇట్లు జరిగినది. హంస చెప్పిన దానికంటె నెక్కువ యందకత్తెను మొదట చూచెను. చూచినతోడనే యతని మన స్సెట్లుండెను? ఇంతయందకత్తె నాకు గాకపోవుచున్నదే యనిపించును. 'ఈమెను దేవతలు వరించుచున్నారే! ఈమె ఇంద్రాణీభోగము లనుభవించెను. అనుభవించుటకే పుట్టినది వలె నున్నది. ఇప్పుడుకూడ దేవతా స్త్రీలవంటి వందమంది కన్యలచేత సేవింపఁబడుచున్నది' యని యనుకొనును. ఆభావములే పాఠకుడు గ్రహించునట్లు చేయుటకు సామర్థ్యము కల వర్ణనము ద్వితీయచరణమునందు చేసెను.

అప్పు డేమగును? అతని యాశయంతయు తునిగి పోయెను. కాని మూఁడవచరణములో నతని యాశ మరల రేకెత్తుటకు హేతువు చూపఁబడినది. అందుచేత నలుడు కదర్పశరావిద్ధు డయ్యెను.

'అంత' చెలికత్తెలాతసని చూచిరి. 'అంత' యనగా నెప్పుడు? నలునకు మనస్సులో దమయంతీగత విరహభావము పుట్టగానే యని యర్థము. పుట్టగానే యత డచటనున్న స్త్రీ లందఱకు గనపించెను. ఎందుచేత? దేవతలు నలుని మన స్సులో నున్నారు. నలుడు దౌత్యపుమాట మరచి తాను విరహావస్థ పొందుచున్నాడు. తమ పని చెడిపోవుచున్నది. అత డచ్చటి స్త్రీలకు వెంటనే కనపించినచో వారు తొందర పడుదురు. ఇతడు వెంటనే తా నెవ్వరో చెప్పికొనవలయును. తాను తన విరహవ్యథలో నుండుటకు వీలులేదు.

'అంత' యన్న శబ్దమునం దింత యర్థ మున్నది. ఇది నన్నయ్యగారి రచన, ఇ ట్లెన్నో శబ్దములు పరమార్థభూత ములుగా వాడును.

కిరాతుని కథయు, సార్థవాహులకథయు రెండునుగూడ వ్రాసెదను.

దమయంతి యడవిలో దిరుగుచుండెను. 'ఇ ట్లరుగు చున్న దమయంతి, నంతికన్యస్తచరణ యయినదాని, నాహా రార్థి యయి యొక్క యజగరమ్ము వట్టికొనిన' ఆమె యఱ చెను. అప్పుడు ఒక్క యెఱుకువచ్చి తన పట్టిన సురియ న ప్పెనుబాము వదనంబు వ్రయ్యం దఱిగిన' - దమయంతిని కొండచిలువ పట్టుకొన్నది. అంతికన్యస్తచరణయయిన దానిని పట్టుకొన్నది. ఇది కొండచిలువ లక్షణము. ఆమెను త్రాచు పాము కఱవలేదు. కరవబోలేదు. ఎఱుకువచ్చి పామును జంపలేదు. కొండచిలువ యేచెట్టునో పట్టుకొని యొక పెద్ద

తీగవలె వ్రేలాడుచుండును. పరీక్షగాఁ జూచినగాని కొండ చిలువ యని తెలియదు. దగ్గఱకుఁ బోయినగాని యది పట్టు కొనలేదు. పట్టుకొని మ్రింగునుగాని కఱవలేదు. ఈ యాపత్తు తొలఁగుటకు కత్తితో దాని పెదవులు చీల్చవలయును. ఇది వస్తుగతౌచిత్యము.

ఇదియుంగాక యింకొక చమత్కారము. కొండచిలువ మ్రింగినంతనే మనుష్యులు చచ్చిపోరు. అది చెట్టునకు బెన వేసికొనఁగా నది మ్రింగిన జంతువు బొమికలు విఱిగి చనిపో వచ్చును.

మరియు నాకొండ చిలువయొక్క లాలజగ్ధ జంతు శరీరమున నత్తుకొని చర్మ రక్తాదులను వికారపరచును (Decompose). అందుచేత తొందఱగా రక్షింపబడినచో మను ష్యుడు బ్రతుకవచ్చును. ఆ మనుష్యుని యొడలినిండ చిలువ నోటి చొంగ మలినముగా నుండును. దమయంతి యప్పు డట్లున్నది. ఆమెను స్నానము చేయించినగాని దమయంతి యొక్క సంపూర్ణమైన సౌందర్యము కిరాతునకు తెలియదు. సురియతో బామునోరు కోసినతరువాత దమయంతి రాహు ముఖవిముక్తమైన చంద్రరేఖబోలె వెలికి వచ్చినది. ఇది వట్టి సామాన్యమైన యుపమాలంకారముగా నున్నది. చంద్ర గ్రహణవిముక్తి యయినంతనే సంపూర్ణమయిన వికాసము పొందదు. గగనమున నొక యర్ధనిమేషము ప్రకాశించిన తరువాతగాని సంపూర్ణకాంతి కనుపించదు. అట్లే దమయంతి స్నానము చేసినతరువాత చక్కగా ప్రకాశించెను. కిరాతుడు

దమయంతి స్నానము చేసిన తరువాత ఫలము లారగించిన తారువాత నామెతో నీ వెవ్వరిదాన వని యడిగి తన హృదయము చెప్పెను. వాడు 'కామసిశాత శరాహతుడయ్యెను. కొండ చిలువలాల యామె మేన నున్నంతవరకు వాని కామె సౌందర్యమును ఆమె చందనగంధి యగుటయు తెలియదు. చెఱువులో స్నానము చేసి మునిగి, మొగము తోమికొని తలయెత్తెను. 'రజనికరానన'– ఈమాటచేత స్నానము చేసి లేచుచున్న యామె ముఖదర్శనము వర్ణితము. తరువాత నామె లేచి నీళ్ళలో నిలుచుండెను. అపుడు 'పీనపయోధర రాజిత'ను చూచెను. ఈమె రాచకూతు రయి యుండు నను కొనెను. అందుచేత 'రాజసుతకా' అని ప్రయోగించెను. ఆమె చెఱువునుండి బయటికి వచ్చి నడచుచుండెను. ఆనడకి యేనుఁగు నడచి నట్లుండెను. అందుచేత 'విలసద్గజపతి గామిని' యని వ్రాసెను.

ఈ విశేషణము లన్నియు నీ మహాక్రమమును బోధించు చున్నవి.

తరువాత నామె వానిని శపించెను. వాడుదగ్ధుడయ్యెను.

మరి సార్థవాహులకథ. 'ముందట నొక్క చనుపం గని దానిం జొచ్చునప్పు డందలి జనంబులు' 'చనుపను జొచ్చుట' యనఁగా సారము మైలుపొడుగున నుండవచ్చును. ఇరువది గజముల వెడల్పున పోవుచుండ వచ్చును. ముందు పోవు వారికి వెనుకపోవువారికి కొంత దవ్వుండవచ్చును. వారు పోవువరకు నిలుచున్నచో గంట పట్టునో యరగంట పట్టునో

ఎవ్వరాగుదురు? ఆమె వారిని దాటిపోవుటకు జనుపలో ప్రవేశించినది; 'చొచ్చు' అన్న మాట కిది యర్థము.

దమయంతి యాసమయమున తల చీకిరి బాకిరిగా నున్నది. మాసిన సగముగుడ్డ కప్పికొన్నది. పిచ్చిదానివలె నున్నది. ఆమెను జూచి కొందఱు పిశాచమన్నారు. కొందఱు భయపడినారు. కొంద అధికహాస్యము చేసినారు. కొంద అడవిలో నేమి వెతకుచుంటివని వెక్కిరించినారు. 'తల్లీ' నీవు దేవతవని నమస్కరించినారు. ఈ మహాపతివ్రత నట్లన్నవారిని వారి ప్రకృతులనుబట్టి రాత్రి నిద్రపోవునపు డేనుఁగులు పాపులను జంపెను. వెక్కిరించి వెక్కిరించనివారిని వికలాంగులను జేసెను. ఆమెను దేవత వని నమస్కరించినవారు చావలేదు. మరియు నెగతాళి చేసినవారిని 'అఱవ నఱవ' చంపెను.

'నేను నలుని భార్యను. మీరు నలుని జూచితిరా' యని యడుగగా శుచి యనువాడు 'మే మెప్పుడు నలుని చూడలేదు. సింహములను, నేనుఁగులను చూచుచున్నాము' అని పరిహాసము చేసినాడు. 'మీ రెచ్చటికి పోవుచున్నా' రని యామె మరల నడిగెను. అప్పుడుగాని వాడు తాము 'సుబాహుపురమునకుఁ బోవుచుంటి' మని చెప్పలేదు. ఒక దీనావస్థలోనున్న స్త్రీని చూడగా నెంతటి నిరాదరము! ఇది యెంతటి లోకజ్ఞత! ఇట్టి చెడ్డ నడతకు భగవంతు డెట్టి శిక్ష చేసెను! ఇది కాంతా సమ్మితత్వముగా గావ్యము చేసెడు నుపదేశము!

ఎండ మిక్కిలి యెక్కువఅగుడు నా చనుప యొక చల్లని నీళ్ళుగల చెఱువునద్ద విడిసెను. అంత 'అర్థరాత్రము నప్పు డంగుల కేతెంచె, గజయూధములు జలకాంక్షచేసి' వారు ప్రొద్దెక్కువఅగుడు నడచిరి. అంత నర్థరాత్రమున నేమి జరిగెనో చెప్పుట కారంభించెను అనఁగా, బూర్వము చనుపలు పోవునపుడు తెల్లవారుకడలేచి, ప్రొద్దెక్కువఅగుడు బండ్లు నడిపించుకొని, యెచ్చటనో విడిసి కూళ్ళువండికొని, యచ్చటనే నిద్రింతురు. మరల తెల్లవారునప్పుడుకాని బయలుదేరరు. ఇప్పుడుగూడ బండ్లు దోలికొని దూరప్రయాణము చేయువారంతే' ఈ మహావిషయము పాఠకు డూహించవలసినదే! ఆ పరిస్థితి తెలిసినచో నది తెలియును. నన్నయ్యగారి రచన యిట్లుండును.

ఆ యేనుఁగులు వచ్చి చనుపలోని పలుమందిని పలు విధములఁ జంపెను. ఆ చనుప 'అవినీతు సిరియుబోలె నడగి విఱిసి చనియె' ఈ యుపమానము మొదట చెప్పినదానికి సరిపోవుచున్నది. ఆ చనుపలోఁ బెక్కుమంది యవినీతులు. కనుకనే దమయంతి నటు పరిహాసించిరి. అందుకనియే నశించిరి. ఇదియంతయు వ్యంగ్యభూతమైన విషయము సుచరితమైన ధ్వని మార్గముకంటె విచిత్రమయిన ప్రతిభతో నానార్థ కల్పనలు చేయుట.

ఆ యేనుఁగులు దమయంతిని జంపలేదు. వానికిఁ దెలిసి కాదు. దైవమున్నాడు. అప్పు డెవరు చావరాదో వారు మిగులుదురు. ఆమె యనుకొనుచున్నది. 'జీవితార్థులయిన

జీవుల సుఖసుప్తులయిన వారిజంపె 'నఅవ నఅవ' ఇచ్చటి 'అఅవ నఅవ' యన్న పీప్సాశబ్దము 'అంతికన్యస్త చరణయయిన దాని నొక్క యజగరమ్ము పట్టుకొంపన' యన్నటువంటిది. జంతు స్వభావజ్ఞాన మచ్చట నెంతయున్నదో యిచ్చట నంత యున్నది. ఏనుఁగులు నీళ్ళకు వచ్చినవి. జనులను ద్రొక్కినవి. అవి కౄరముగా చంపును. చీకటిలో వానికి సరిగా గని పించదు. జనము భయపడి కేకలు వేయుదురు. అఅతురు. ఈ యఅపులు విని యేనుఁగులు మఅల వెనుదిరిగివచ్చి చంపును. రాత్రిపూట, నడవిలో నేనుఁగులు కొన్ని పల్లెల మీఁదఁబడి కాదాచిత్కముగా నిట్లు చేయుట భయపడి యేడ్చిన యేడ్పులు విని తిరిగిపోయి చంపుట. ఇది యదార్థము. సరిగా జ్ఞాపకము లేదు. పదిపంద్రెండేండ్లక్రింద నుత్తర హిందూస్థాన ములో నొక యడవిపల్లెలో నిట్లు జరిగిన దని పత్రికలలో వ్రాసిరి. ఈ 'యఅవ నఅవ'లోని యౌచిత్యము నా కప్పుడు తెలిసినది.

ఇట్లు పోయినంతమేర నన్నయ్యగారి రచనలో మహా ర్థములు రత్నములే వెదకవలయును. ఎంతవ్రాసినను సూచి కయేగాని సర్వము కానేరదు.

# ప్రధాన కథ

## ౧

ఇదివరకు కొన్ని యుపాఖ్యానములగురించి వ్రాసితిని. ఇప్పుడు ప్రధానకథా నిర్వాహణమును గూర్చి వ్రాసెదను. ఇది రెండుమూడు వ్యాసము లగును. ఇది మొదటిది.

భారత మితిహాసము. కావ్యముగాదు. అందుచేత దొలుతనే పాండవులను దీసికొని వారిని వర్ణించుట, కథవారి దగ్గరనే ప్రారంభించుట జరుగును. పాండవులు శతశృంగ పర్వతమునుండి హాస్తినాపురము జేరునప్పటికి ధర్మరాజు పదునారేండ్ల వయస్సువాడు. భీముడు, నర్జునుడు, కవలు నొకరికంటె నొక రేడాది యేడాది చిన్నవారు. అంతవరకు వీరికి విద్యాబుద్ధులు జరిగినట్లే లేదు. దుర్యోధనుడును, భీముడును పదునేనేండ్ల వయస్సువారు. ఆ నూర్వురన్నదమ్ములు నొకనికంటె నొకడు రోజు చిన్నవాడు. దుర్యోధనునకును చివరివాడైన విరజసునకును మూడునెలల పదిదినములు వయసులో దారతమ్యము.

ఇట్లువచ్చినపాండవులు 'ధృతరాష్ట్రునెయ్యమున సంతత వర్ధితులగు' చున్నారు. ఇచట 'నెయ్యమున' అన్న శబ్దము వాడుటచేత ధృతరాష్ట్రునియొక్క మనోభావ మెట్టిదో చెప్పఁబడినది. ఇది వట్టి స్నేహము. వారియందు ధృతరాష్ట్రు

నకుఁ బ్రేమలేదు. కొడుకులయందు బ్రేమయున్నది. ఈ భేద మప్పుడే నిరూపింపబడినది.

ఈ పాండవులు దుర్యోధనాదులతో కుమార క్రీడా రతులై యుండిరి.

ఇచ్చట మూఁడుపద్యములు వ్రాయఁబడినవి. రెండు కందపద్యములు. ఒక సీసపద్యము. పాండవ కౌరవ విరోధము నకు నీ విరోధకథకు నీ మూఁడుపద్యములలోని తాత్పర్యము మూలభూతము. ఈ మూడుపద్యములు సరిగా దెలిసినఁగాని కౌరవపాండవ వైర మర్థముకాదు.

ఇది యర్థమగుటకు నందలి పరిస్థితు లన్నియుఁ జక్కఁగా నవగాహనము జేసికొనవలయును. పాండవు లచట బుట్టి పెరుగలేదు. కౌరవు లచట బుట్టి పెరిగినారు. ఆ స్థితికి ప్రత్యక్షముగా వారసులవలె గనిపించెడి వారు కౌరవులు. పుట్టిన నాటినుండి పదునేను వత్సరములు రాజభోగము లనుభవించుచు రాజకుమారులు పొందవలసిన మన్ననల బొందుచు, రాజకుమార భావమునందు బాదుకొని పోయిన వారు దుర్యోధనాదులు. వీరంద రుద్ధతులు. ఈ యుద్ధతత్వమునకు గారణము పైన జెప్పినదియే.

అట్టి పెంపకము లేదు. రాజభోగము లనుభవించి యెరుగరు. అందరిచేత రాజకుమారులుగా గౌరవింపఁబడి యెరుగరు. ఇట్టివారు పాండుసుతులు. అందుచేత వారు 'వినయాన్వితులు'.

మొదటి పద్యములో వినయాన్వితులై పాండవులు ధార్తరాష్ట్రులతో నొడగూడి యున్నారని చెప్పెను. రెండవ పద్యములో 'ఉద్ధతులు రాజసుతులు భీమునకు గీడ్వడదొడగి' రని చెప్పెను.

నన్నయ్యగారి తాత్పర్యమంతయు గౌరవు లుద్ధతులని చెప్పుటలో నున్నది. వా రిదివరకు బాండవుల నెరుగరు. ఏ మైదారేండ్ల వయసులోననో వారు వారు కలసికొనినచో బాల్యక్రీడలయందు సౌహార్ద మేర్పడి యుండెడి దేమో! పదునారేండ్ల ప్పుడు మొదటిసారి కలిసికొనుట. కౌరవులకు 'మేమే రాజకుమారులము మీ రెవరు?' అను దుర్భావము సహజముగా నుండును. అట్టి భావముతోనే వారు పాండవులయెడఁ బ్రవర్తింతురు. ఆ ప్రవర్తనచేతనే వా 'రుద్ధతు' లని వ్రాయఁబడినది. మన యింటిలో మన పిల్ల వానితో బాటు చుట్టపు పిల్లవాడుగూడ జదువుకొనుచుండినచో మన పిల్లవాడు చుట్టపు పిల్లవానిమీఁద నధికారము జేసినట్లు.

ఈ పెదతండ్రికొడుకుల యౌద్ధత్యమును పాండవులు సహింపలేరు. వారి యసహనము నేవిధముగాను చూపించుటకు వీలులేదు. వీరికి వారికి నాటలలో కక్షలు పెరుగుచున్నవి. ఈ సంగతి పెద్దవారికి తెలియనే తెలియదు. బాల్యములో నిట్టి యనుభవము లున్నవారికి గాని యీ విషయము విస్పష్టముగా దెలియదు.

ఈ కక్షలు మిక్కిలిగా బెరిగినవి. మొదట సామాన్యముగా నున్నవి.

"వదలక పెనగి పక్కు ౩౦
బడియేవుర నొక్కపెట్ట పట్టి ధరిత్రిం
జెదరబడ వైచి పవనజు
డదయుండై వీపులొలియ నందర నీడ్చున్."

కౌరవులు పది పదునేనుమంది యొక్కసారిగా భీముని మీదికి బోదురు. అదఱ నతడు క్రిందబడవైచి లాగును.

వారి స్పర్ధ లింకను నెక్కువైనవి. వా రొకరిమీద నొకరు పగసాధించుకొన మొదలిడిరి. కౌరవులు పాండవుల నేదియో చేయుదురు, పోయి చెట్లెక్కుదురు. భీముడు చెట్లను కదల్చును. వారు క్రింద బడుదురు. 'మమ్ము పదిమంది నొక్కసారి నీ బుజముమీద నెక్కించుకొని నీళ్ళలో నీదుము; నీ బలము జూతు' మని యెగతాళి చేయుదురు. అతడందర బుజాన నెక్కించుకొని నడినీట ముంచి యేడ్పించును. ఈ క్రీడామాత్సర్యము నానాటికి బెరిగిపోయినది. పెద్దలకు దెలియుటకు వీలులేదు. తెలిసినచో నందరను జీవాట్లు పెట్టుదురుగాని దానివలన లాభములేదు.

కౌరవులలో బెద్దవాడు దుర్యోధనుడు కానిచో నేమయ్యెడిదో తెలియదు. దుర్యోధనుడు సహజముగా దురభిమాని. రెండవది యీగడచిన పదునేను పదునారు వత్సరములుగా నతడే రాజస్థానీయుడు. తండ్రి గ్రుడ్డివాడు. ఇతడావీట నేదిచెప్పిన నదియే జరుగును. అతనిమాట కెదురు లేదు. జన మతడే రాజనుకొనుచున్నారు. జనము లతడే

రాజను కోనుచున్నారనియు నన్నయ్యగారు కథాధోరణిలో వ్యంగ్యముగానే చెప్పెను.

"జనపతి పంపఁగ సారథి
ఘన విషకృష్ణాంగములఁ గఱపించె."

ఈ కఱపించినది సదురవోవృచున్న భీముని ఇచట 'జనపతి' యన్న శబ్దము వాడుటచేత దుర్యోధను డానాటికి హాస్తినలో నెట్టిస్థితి ననుభవించుచున్నాడో స్ఫురించవలయును. పైన నతి దుర్దతుడు ఉద్ధతోద్ధతుడు; తనకు బాండవులొదిగి యుండవలయునని కోరును. వా రొదిగి యుండరు సరికదా! భీమునివలన నాటలలోఁగూడ వారిని గెలువలేకుండెను: అందుచేత శకుని దుశ్శాసనాదులతో నాలోచించి భీముని జంపుటకు నిశ్చయించెను.

ఇటనుండి భీముని జంపుటకు ప్రయత్నములు చెప్పఁబడెను. భీముని జంపుటకు బ్రయత్నములు సేయుట, యవి విఫలమగుటతో వారి వైరము రూఢమగును.

వైరముయొక్క కారణములు భీముని జంపింపవలయునన్నంతవరకు దెచ్చినవి. వారి కుమార క్రీడలలో భీముడు తన బలము ప్రదర్శించుట మాత్రముగా జెప్పఁబడినది. ఇంతటి మహావైర వృక్షమునకు నీ మూడు పద్యములలోని క్రీడా మాత్సర్యము బీజ మగుచున్నది.

పైన జెప్పఁబడిన పరిస్థితి యంతయు సమన్వయించుకొనినచో నీ క్రీడా మాత్సర్యమున కంతశక్తి చాలదు.

నన్నయ్యగారి శిల్పరహస్యమే యిది. ఆయన లోకము నందలి పరిస్థితులను సర్వాంకషముగాఁ దెలిసినవాడు. జీవితము లోని భిన్నఘట్టముల రహస్యముల నెరిగినవాడు పాండవులు వినయాన్వితులని చెప్పుటచేత రాజసుతు లుద్ధతులని చెప్పుట చేత, తరువాత దుర్యోధనుని జనపతి యని చెప్పుటచేత నీ ఘట్టములోని యాంతర మహార్థమంతయు పాఠకుడు గ్రహించు కొనుటకు వదలి తాను లోకసామాన్యముగా గథ చెప్పినట్లు తెలియును. తల్లోకము తెలిసినచో నాలోక సామాన్యత తెలియును.

ఈ దుర్యోధనునకు పైన చెప్పిన కారణములేగాక మరి పెద్దకారణమే కలదు. పాండవులు వచ్చినప్పటినుండి జను లందరు, మంత్రులందరు యుధిష్ఠిరుడే రాజని యనుచున్నారు. యుధిష్ఠిరుడు చనిపోయినచో రాజ్యము తనదే. యుధిష్ఠిరుడు చనిపోనక్కఱలేదు. అతనిని చెఱసాలలో నుంచవచ్చును. కాని భీముడుండగా ధర్మరాజును బంధించుటకు వీలులేదు. కనుక భీముని వధింప వలయును.

"ఉపాంశు వధ జేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మ
త్కృపాణ పటుశక్తి నత్యధిక కీర్తినై యేలెదన్"

ఇది దుర్యోధనుని నిశ్చయము 'నిస్సపత్నముగ' ననుటచేత పైని చెప్పిన యర్థము భాసించుచున్నది. 'అపాండ వముగా' ననుటచేత నతనికి బాండవులయెడ నెంత విరోధ

భావము పెరిగినదో తెలియు చున్నది. అపాండవముగా ధాత్రి నేలెదనని యెప్పుడో వైరము ప్రబలినతర్వాత యుద్ధ భూమియం దనుకొనవలసిన మాట. దానిని దుర్యోధను డిప్పుడే వాడినాడు. అతని వైరభావ తైక్ష్ణ్య మటువంటిది.

భీముని రహస్యముగా వధియించును. అపుడు ధర్మ రాజును బంధించును. ఈ రెండు వాక్యములయొక్క యర్థ మేమి? ధర్మరాజు నిదివరకే పట్టుకొని బంధింప ప్రయత్నించెనా? భీముని యప్రమత్తతవలన నది సాధ్యము కాలేదా? దుర్యోధను డిదివరకే పాండవుల కపకారము జేయుట కూహించెను. భీమునివలన నా ప్రయత్నములు సాగలేదు. పాండవులస్థితి యతనికి సూదియైనచ్చి దబ్బనమై తేలిన ట్లనిపించెను.

ఇందులో నొక విచిత్రమైన సంసారస్థితి గలదు. ఈ సంసారపు పరిస్థితులలోననే యీ భారత కథవంటి కథ వృద్ధిబొందుటకు వీలున్నది. కౌరవ పాండవు లన్నదమ్ముల బిడ్డలగుటయే యీ కథ యిట్లు సాగుటకు కారణము. అన్న దమ్ముల బిడ్డలు కానిచో, బంధుత్వము లేనిచో నీ కథలోని కొన్ని సన్నివేశములకు సందర్భము లేదు. ఇది యొక విచిత్ర మైనకథ. లోకములో నిట్టికథలు జరుగుచునే యుండును. అన్నదమ్ములకు, నన్నదమ్ముల బిడ్డలకుఁ బ్రబల విరోధము. ఆ విరోధ మా యిద్దరి పురుషుల మధ్యనే. తక్కిన బంధువు లందరు స్త్రీలు పురుషులు నుభయులకు సమానులే. అంత విరోధములో నొకని యింటికి పచ్చనితోరణము గట్టినచో

నా యన్నయో యన్న కొడుకో వచ్చి యింటిలో భోజనముచేసి పోవును. వారి యాడవాండ్రు వీరి యాడవాండ్రు మాటాడుచునే యుందురు. వారి వారి సంతానము, తండ్రులకు ప్రబల విరోధమైనను గలిసి యాడుకొనుచునే యుందురు. ఆ పురుషులుమాత్రమే యొకరినొకరు సాధించుకొనుచుందురు. ఇది లోకముయొక్క స్వభావము. భారతకథ యీదృశ సంసార స్థితినుండి బయలుదేరినది. అది యెట్లు పరిణామము బొందునో? పరిణమించినంతమేర ని బంధుత్వ మా విరోధము నెట్టి హద్దులలో నుంచునో సమగ్రముగ నాలోచించి వ్రాసినంతయు స్ఫూర్తిగా భాసింపజేయుచు వ్రాసినవాడు నన్నయ్య. ఈసంగతి తరువాత వ్రాసెదను.

ఇపుడు దుర్యోధనుడు భీముని రహస్యముగా వధించి ధర్మరాజును బంధించి రాజ్యము తాను తీసికొనవలయుననిగదా యూహ! భీమునే బంధించరాదా? అదియే యసాధ్యమైన, విషయము. ఈయాటలలో నెన్నిసార్లో భీముని బంధించుటకు, వధించుటకు బ్రయత్నములు చేసెను కాని సాధ్యపడలేదు. ఈ సంగతి విదుర భీష్మ ధృతరాష్ట్రులకు దెలియరాదు. రాజభటులచేతనే వారిని బంధింపించవచ్చును. కాని తనకంత వ్యక్తిత్వము రాలేదు. ఏది చేసినను రహస్యముగాఁ జేయవలయును, తరువాత తనకు దెలియదనవచ్చును. ఇదియంతయు బంధుత్వమువలన వచ్చిన బాధ. వీరిలో వీరి కింతవైరము పెరిగినదని పెద్దల కెవ్వరికి దెలియనే తెల్లియదు. తెలిసిన నేదో పిల్లలలో పిల్లలకు వైర మనుకొను చుండిరి. గాని తొండ

ముదిరి యూసరవెల్లి యగు నని యెవరు ననుకొన్న క్రైరి. తండ్రితో జెప్పి లాభములేదు. అతడును పసితన మని నిరాదరించును. యువరాజుగాఁ జేయఁదగిన వయసుగాదు. విద్యా బుద్ధులుగాని వీరిలో నెవరికిని లేవు. భవిష్యత్తులో నేమి జరుగునో యెవరికి దెలియదు. నిస్సపత్నముగా దాను ధారుణి నేలుదు నన్నయూహ దుర్యోధనున కట్టి వయస్సులో కలిగెను. దుర్యోధనున కప్పటికి బదు నెనిమిదేండ్లుండునో, దుర్యోధనునకు వయస్సు చాలదు. ఊహ లిటువంటివి.

౧. భీముని తాళ్ళతో గట్టి నీళ్ళఁ ద్రోయించెను.

౨. పాములచేత గరిపించెను.

3. విషము బెట్టించెను.

"దుర్యోధనుండు భీమునకు దన చేసిన యొగు లెల్లను కృతఘ్నునకుం జేసిన లగులునుంబోలె నిష్ఫలంబులైన సిగ్గువడి వెండియు బాండవుల కెల్ల నపాయంబుసేయ నుపాయంబు జింతించుచుండు."

ఇది యంతయు నిగువది పద్యములలో జరిగినది. కుమారాస్త్ర విద్యాప్రదర్శనమువఱకు దుర్యోధనుడు మఱల మాటాడ లేదు.

భీముని దా నేమియుఁ జేయలేక పోయెను. సిగ్గుపడి యూరకుండెను కచ్చె మనసులోఁ బెట్టుకొనెను.

బాల్యవిరోధ మిట్లే యుండును, అదియును బంధుత్వములో నేర్పడినచో?

నన్నయ్యగారి భారత కథారంభ మిట్లున్నది. ఆయన చేసినదేమియు లేదు. ఉన్న పరిస్థితు లున్నట్లు చిత్రించెను. ఆ పరిస్థితియొక్క భిన్నాంశములను పరిశీలించినచో నాయన చెప్పిన దాసిలోని గొప్పదనము తెలియును. ఆ కథయందలి యర్థము ప్రసన్నమగును.

# ప్రధాన కథ

## ౨

భీముని బంపుటకు జేసిన ప్రయత్నములు వ్యర్థమైన తర్వాత దుర్యోధనుడు మరల పాండవులజోలికి బోలేదు. వారి యందలి యతని యసూయ దినదినాభివృద్ధి బొందుచునే యుండెను. తరువాత ద్రోణాచార్యుడు వచ్చుట, వీరందరకు విలువిద్య నేర్పుట, పైన కుమారాస్త్ర విద్యాప్రదర్శనము వరకు గ్రంథ మూరకే జరుగును. ఈ యస్త్రవిద్యా ప్రదర్శనము కథ పెరుగులలో రెండవఘట్టము.

రాజకుమారు లందరు ప్రదర్శనారంభమందు ధనుస్సు లెక్కువెట్టి వరుసగా నిలుచుండిరి. అపుడు వారు "ఉద్యద్గుణ శ్రేణీరమ్యులు"

ఈ నాటికి కౌరవ పాండవులకుగల మాత్సర్యము పెద్ద లందరకు తెలిసినది. రాజధానిలో నందరకు తెలిసినది. తెలిసిన దని యెట్లు తెలియు ననగా? ప్రదర్శనారంభమున భీమ దుర్యోధనులు గదాయుద్ధము చేసిరి. వా రిద్దరు పిన దండ్రి పెదతండ్రి కొడుకులవలె బోరాడలేదు. ఒకరి నొకరు సంహారింపవలయు నన్నంతగాఁ బోరాడిరి. ఈ సంగతి నన్నయ్యగా రెంత విచిత్రముగా చెప్పిరో చూడుడు. "పాండవ కౌరవ్యగదావిఘట్టన మకాండప్రోత్థమై భావి పాండవ కౌరవ్యరణాభిసూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్."

ఇది యాశ్చర్యము. సామాన్యముగాఁ జూచినచో భవిష్యత్తులో నెట్లును యుద్ధము జరుగఁబోవుచున్నది. గాన నిట్లు వ్రాసెనని విచారించనుండఁ బోవలయును. కాని యర్థ మది కాదు. భీమ దుర్యోధనుల పరస్పర విజిగీషయు, వారి క్రోధములును నాటికే పండియున్నవి. అవియే భారతకథ యంతయు నిట్లు జరుగుటకు గారణము.

వారి "గదా కౌశలంబు సూచు జనుల పక్షపాతజనిత పరస్పర క్రోధవచనంబులు విని ద్రోణుండు రంగ భంగ భయంబున నశ్వత్థామంబంచి వారి నుద్దత నారించి" ఈ వచనములవలన పాండవ కౌరవుల విరోధభావము ఆ విరోధము తీవ్రమై యుండుట, ద్రోణాదుల కా సంగతి తెలియుట, లోకములోన పాండవులు గొప్ప యని కొందరు, దుర్యోధనాదులయందే యభిమానము గలవారు కొందరు, వారువీరు తీవ్రముగా వాదించుకొనుట, గురుపుత్రుడు గనుక నశ్వత్థామ మాట కౌరవ పాండవులు సమానముగా మన్నించుట యంతయు నూహ కందుచున్నది.

ఆ పద్యము చివరి రెండు చరణములతో నీ వచనములో నన్నయ్యగారు చేసిన చమత్కార మిది. ఆనాటికి పాండవులు కౌరవులతో పాటయిరి. ప్రజలలో చాలమంది వారిని రాజులుగా మన్నింపఁ జొచ్చిరి. వారి పక్ష మొకటి బయలుదేరెను. వారి నేమి చేయుటకును వీలులేదు. ఇంతటి పరిస్థితిని నన్నయ్యగారు రెండుమాటలలోఁ జెప్పెను.

పోయినంతమేర నిల్చుండుచునే యుండును. అందుచేత ప్రధానమైనవే వ్రాసెదను. కొంతసేపటికి కర్ణుడు రంగద్వారమున నిలిచి భుజాస్ఫాలనము చేసెను. ఆధ్వని కొండమీఁద పిడుగు పడ్డట్లుండెను. అందరు భయపడిరి. పాండవులు ద్రోణాచార్యు నొద్దకుఁ బోయిరి. నూరుగురు తమ్ములు దుర్యోధనుని జుట్టుకొనిరి అందరును ద్వారమువంకఁ జూచుచుండిరి. కౌరవులు సుయోధనుని బరివేష్టింపగా భీమార్జునయములు ధర్మరాజు నేల పరివేష్టింపరు? ఏమిటి యీ రహస్యము? దుర్యోధనుడు ధృతరాష్ట్రి నంతటివాడైనాడు. అతడే వారికండ. పాండవుల కిచట నండ యెవ్వరును లేరు. భీష్ముడు రెండు పక్షములవారికిని సమానుడు. ద్రోణు డర్జునునియందలి ప్రేమచేత పాండవులయం దభిమానము గలవాడు. వారి కేదైన భయము వేసినచో ద్రోణునితోపోయి చెప్పికొందురు. ద్రోణుని మరుగు సొత్తుగు. పాండవుల యీస్థితి దీనియందు వ్యంగ్యభూతమగు చున్నది.

నన్నయ్యగారు కథ చెప్పికొనిపోవుచు జరిగిన విషయమేదో చెప్పును. ఆపరిస్థితులలో నది యట్లే జరుగునుగాన నా పరిస్థితులు రూపుకట్టవలయును. ఇది యాయన శిల్పము యొక్క పరమరహస్యము.

ఆ వచ్చిన కర్ణుడు సాలప్రాంశుడు. నిజోజ్జ్వలత్కవచుడు శశ్వత్కుండలోద్భాసితుడు. ఇచట 'నిజ', 'శశ్వ' చ్ఛబ్దములు నన్నయ్యగారే వాడగలుగుదురు. ఆ కర్ణుడు "జగత్కర్ణ పూర్ణాలోలద్గుణుడు" వానిని జూచి యందరా

శ్చర్యపోయిరి. అతడు "జనుల నందఱ నదల్చి చొత్తెంచి రంగ మధ్యంబున నిల్చి కలయఁజూచి కృప ద్రోణాచార్యులను నమస్కరించి యర్జును నాక్షేపించి యిట్లనియె". ఈ మాటలను బట్టి యెన్నో విషయము లూహింపబడు చున్నవి. అతడు "జగత్కర్ణ పూర్ణాలోలద్గుణు" డనుటచేత కర్ణుడు ధనుర్విద్యా పండితుడని యెఱుగని వారచట నెవరు లేరని యర్థము. ఎందు కెఱుగరు? యమునవద్ద హస్తిపురము గంగవద్ద సూతుని యిల్లు. ఒక దేశములో నిద్దరొక విద్యయం దుత్తీర్ణులుండగా లోక మిద్దరను గురించియు జెప్పికొనును. శతవిధాల వారొకరి నొకరెరిగి యుందురు. కనీసము దూరముగానైన నొకరి నొకరు చూచుకొని యుందురు. కర్ణు డుద్ధతుడు. అతడు జనుల నందఱ నదల్చి చొత్తెంచె ననుటచేత వాని యౌద్ధత్యము ధ్వనితము. ఇతడు కృపుడు, ఇతడు ద్రోణుడు, ఇతఁ డర్జును డని వాని కెవరును చెప్పలేదు, వానికే తెలియును. తెలియు ననగా సన్నివేశము చూచి గుర్తించవచ్చును. అర్జునుని గుర్తించుట కష్టము. అతని నెప్పుడో దూరముగానైన చూచి యుండవలయును. అతనిని రావలదని యెవరు ననలేదు. నీ వెవ్వర వని యెవరు నడుగలేదు. ఈ విద్యలన్నియు నేను నేర్తు ననియె. సరే చూపించుమని ద్రోణు డనుజ్ఞ నిచ్చెను. ఇది యంతయు నొక విచిత్ర సన్నివేశము: ఒక ప్రాంతములో నా విద్యలో నారితేరిన వారిద్దరుండిరని తెలిసినపుడు జరిగెడి సన్నివేశము.

ఆ విద్యలేవి? ఆగ్నేయ వారుణానిలమేఘ భూమి శైలాద్యశ్వాద్యస్త్రములు ప్రయోగించుట. ఆ విద్యలు ౨౬, ౨౭ పద్యముల యందున్నవి. ఆ విద్యలర్జునుడు ప్రయోగించి నప్పుడు కర్ణుడు లేడు. వానిని తాను చేయుదునని కర్ణుడె ట్లనెను? సరే నని ద్రోణు డె ట్లనెను? కర్ణు డవే యెట్లు చూపెను? నన్నయ్య యిట్లేలకు వ్రాసెను?

ధనుర్విద్య రెండు విధములు. ఒకటి బాణములు ప్రయోగించుటలోని లాఘవమును నేర్పును. రెండవది మంత్రాధిష్ఠితమైన యస్త్రములు ప్రయోగించుట. కర్ణుడు శరలాఘవ కౌశలము నెరిగినవాడని యందరికు తెలియును. ఆ విధముగానే యతడు జగత్కర్ణ పూర్ణాలోలద్గుణుడు. అతడు సూతకులజుడగుటచేత వాని కస్త్ర ప్రయోగము తెలియరాదు. అతడు క్షత్రియుడని వదంతి లేదు. అతడు కానీనుడని వదంతి గలదు. కుంతికి పుట్టెనని తెలియనక్కర లేని వదంతి. లోకములో నధర్మ సంబంధముచేత పుట్టిన వారి నెవరు చెప్పుకొనరు? సూతుని భార్య గర్భవతి కాలేదు. పిల్లవాడు వచ్చెను. ఆ పొరుగిండ్ల వారందరకు నెవరో కని పారవేసిన బిడ్డయని తెలియును. ఆనోట నానోట బదిమందికి తెలియును. ఈ సంగతి లోకజ్ఞులైన వారందరికి సులభ గ్రాహ్యమే. నన్నయగారు 'లోకజ్ఞుడు'.

ఇతడు సూతుడగుటచేత నస్త్రవిద్య లెట్లు తెలియును? తెలిసినవియే యేల ప్రయోగింపవలెను? ఎవడు నేర్చిన యస్త్రవిద్యయైనను ప్రదర్శించెదునవి యవియే. యుద్ధ

భూమిలో ప్రదర్శించెడునవి వేరుకావచ్చును. విద్యాప్రదర్శన మాత్ర ప్రయోజనముకలవి యవి ప్రయోగించుటవలన జన సంక్షోభము కలుగదు. వాడు విద్య నేర్చినట్లు తెలియును.

వెంటనే దుర్యోధనుడు వానితో స్నేహము చేసెను. అనాడెన్నాళ్ళనుండియో భీమునకు తాను జోడు; అర్జునునకెవడున్నాడన్న విచారములో నున్నాడు.

వీరిద్దరు ద్వంద్వయుద్ధ మాడిరి. అపుడు కృపుడు సభను నిలిచి వారించి ద్వంద్వయుద్ధము వారి నడుమ జరుగ రాదన్న యుద్ధాచారమునందు నిపుణుడు గనుక కర్ణున కిట్లనియె.

"కురుకులజుండు పాండునకుఁ గుంతికి పుత్త్రుడు రాజధర్మ బంధుర చరితుండు నీ వితనితోడ రణం బొనరించె దేని వి స్తరముగ నీదువంశమును తల్లిని దండ్రిని జెప్పు చెప్పినన్ దొర యగుదేని నీ కెపరి దోర్బలశక్తి నితండు చూపెడిన్"

అని కృపుడు పలికెను. "దొరయగుదేని" దొర = సమానము, రాజు అని రెండర్థములు నీవుకూడ నతనివలె ప్రసిద్ధమైన రాజవంశమునందు బుట్టినచో, నీతల్లిదండ్రులు కూడ రాజవంశీయులైనచో నితనితో నీవు ద్వంద్వయుద్ధము చేయవచ్చునని యర్థము. దానికి కర్ణుడు సమాధానము చెప్పలేడు. చెప్పలేదు. దుర్యోధనుని నేర్పిక్కడ నున్నది. అతడు 'దొర' యనగా 'సమానుు' డన్న యర్థము దీసి వేసి 'రాజ'ను నర్థము స్వీకరించి కులముగాని, శౌర్యముగాని

సేనగాని కలవాడు రాజని జెప్పి రాజైన యర్జునునితో రాజగాని యుద్ధము చేయగాదా? అయినచో నే నితని కంగరాజ్య మిచ్చి యిప్పుడే రాజు చేసెద నని భీష్మ ధృతరాష్ట్రులకుం జెప్పి వెంటనే బ్రాహ్మణాశీస్సు, సింహాసనము, మణిమకుట కేయూరాది హారములు, ఛత్ర చామరములు కల్పించెను.

కృపుడు నామాటకీ యర్థము కాదని యనలేదు. మరి యేమియు ననలేదు. ఇదిగో నే నితని కంగ రాజ్య మిచ్చుచున్నా నని భీష్మ ధృతరాష్ట్రులతో ననెను. వారు సరే నాయనా నీ యిష్ట మన్నారు. ఈ యంగరాజ్య మిచ్చుట కాతఁ డెవఁడు? యువరాజు కూడ కాడు. పాండవులు రాకముం దతఁడగు నేమో యన్న యనుమాన మున్నను పాండవులు వచ్చిన తరువాత ధర్మరాజే యువరాజగునని యందరకు తెలియును. ఇట్టి స్థితిలో దానె ట్లిచ్చెను భీష్మ ధృతరాష్ట్రు లె ట్లంగీకరించిరి? తనమాటకు వేరర్థముతీసి దుర్యోధను డిట్లు చేయుచుండగాఁ గృపుఁడెందు కూరకుండెను?

'దార' యన్న శబ్దము కృపు డుపయోగించుట, దానికి దుర్యోధనుడు వేరర్థ మిచ్చి మాటాడుట, నాల్గయిదు పద్యములలో నున్నది. ఇదియొక యలంకారము. దీనిపేరు వక్రోక్తి, శ్లేషచేతగాని, కాకువుచేతగాని యన్యార్థకల్పనము చేయుట వక్రోక్తి. ఇది యేకపద్యగతమై యున్నచో తేలికగా గుర్తు పట్టవచ్చును. దీనిమీద కథ నడిపిన నన్నయ్యగారు గండమును నాటకాంగముగా రచించిన లక్షణకర్త వంటివాడు. ఈరీతిగా వక్రోక్తి కథాశిల్పాంగ మైనది.

కాని దుర్యోధనుడు కర్ణున కంగరాజ్య మిచ్చుటలో నధికారము లేదు. ధర్మములేదు. న్యాయములేదు. అందరు మాటాడకుండ నెందు కూరకుండిరి? దుర్యోధనుని మాట కాదనలేరు అతడు తక్కువ వాడుకాడు. తాను యువరాజు కాకపోయినను, ముందు యువరాజగు వీలు లేకపోయినను రాజ్యాంగములో నతని పలుకుబడి యట్టిని. అతని సామర్థ్య మట్టిది. ఒక సమర్థుడైన మంత్రి నే నొక పని జేతు ననఁగా రాజైన కాదనలేడు. అందులో నితడు రాజుకొడుకు; మహా బలశాలి; గదాయుద్ధ నిపుణుడు; రాజకార్యవేత్త. "దాన సమ్మానంబులఁ బ్రకృతి జనంబులకు సంతోషంబు సేయు వాఁడు" తా నట్లు చేయుదునని, తానే, పాండవులను వారణా వతమునకు బంపు మని చెప్పినప్పుడు చెప్పెను. ఈ తన పలుకుబడి నంతయు నుపయోగించి కర్ణున కంగరాజ్య మిప్పించెను. ఇది పెద్ద రాజకీయపు ఎత్తు. ఇది తానే యువ రాజు తప్పకుండ నగునట్లు చేయుటకుఁ జేసిన ప్రయత్నము. ఇందులో నింత ప్రయత్న మున్నదని నన్నయ్యగారే ధ్వనించెను. దినదినసానమున "దుర్యోధనుడు కర్ణుం దోడ్కొని కరదీపికా సహస్రంబుతో నిజమందిరంబున కరిగె". కరదీపికా సహస్రముతో నరుగుట రాజలక్షణము. కర్ణుడు రాజు గనుక వెళ్ళవచ్చును; నిజముగా వెళ్ళినది తాను ఇది యంతయు నీతి పుష్పించుట. ఈకథ యంతయు దుర్యోధనుని సామర్థ్యమే వెల్లడించు చున్నది. అతడు పాండవులయందు దుష్టుడే తప్ప యతని సామర్థ్యము సర్వజన భయావహముగా నున్నది. ఎదురాడరానిది. అప్పటి యతని సామర్థ్య మెట్టిదో యందర

కంటె గర్ణున కెక్కువ తెలియును. దుర్యోధనుని ప్రతిభ యంతయు నతడు ప్రత్యక్షముగా చూచెను.

అందుకనియే దుర్యోధనునితో నిట్లనెను.

"బృహదబ్ధి మేఖలాఖిల
మహీతల క్షత్రవర సమక్షమున మహా
మహిమాన్వితులుగా నున్నను
మహీశుగాఁ జేసి తతి సమర్థత వెలయఁగ."

ఇది కర్ణుడు గ్రహించినది, చూచినది, తెలిసికొనినది, అందరకు దెలిసినది. 'అతిసమర్థత' యున్నగాని యీ పని సాధ్యము కాదు. పరిస్థితు లట్టివి.

నన్నయ్యగా 'రతిసమర్థత' యన్న నొక్క మాటవాడి యెంతటిపరిస్థితి నెన్ని మహార్థములను సంగ్రహించెనో చూడుడు. ఇది నన్నయ్యగారిశిల్పము. 'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో నారయ' వలసినది.

దుర్యోధను డిట్లు చేసినప్పుడు ప్రతివానికి గంటగింపుగానే యున్నవి. కాని యెవ్వడును మాటాడలేదు. పాండవులకు గంటగింపుగానే యున్నది. వా రేమనుటకు వీలులేదు. వారిమాట సాగదు. విదురుడు, కృపుడు, వీరు ముగ్గురే వారి యండ.

విదురుడు శాంతుడు. అతనికి నీతి చెప్పెడునేర్పేగాని చేయించెడు నేర్పులేదు. కృప ద్రోణులు వింటి యొజ్జలు. వారి మాటకు వెల యేమి? అయినవాడు భీష్ముడు. అతనికి

వా రెంతయో మీరు నంతియే చేతనయి ధర్మరాజుకూడ మరి యేదో రాజ్య మింకెవనికో యిత్తు నన్నచో సరే ననెడు వాడేమో?

ఈ స్థితిలో పాండవులకు నెదురాడు పలుకుపడిలేదు. సామర్థ్యములేదు కుటుంబబలము లేదు. తండ్రి రాజగుట లేదు. వారూర కుండిరి లోపల మండుచునే యుండెను. సహజముగాకూడ వినయవంతులు. అయినను వారిలో భీముడు కొంచెము పెళుసు. దుర్యోధనుని లెక్కచేయని దత డొక్కడే. వారు వినయముగా నుండి తగినవేళ ధృతరాష్ట్రుడు ధర్మరాజును యువరాజునుగా చేయునేమో యని యెదురు చూడవలసిన వారేగాని నీకీ యధికారము లేదను స్థితిలో లేరు.

కర్ణుడంగ రాజైనతర్వాత నతని తండ్రి సూతుడువచ్చి కొడుకును కౌగలించుకొనెను. అపుడు భీమునకు దెలిసెను. "నీవు కులమునకుఁ దగఁగ ప్రతోదము గొని రథము గడప దొడగుము" అర్జునునితో నీకు యుద్ధ మెందులకు? పురోడాశము కుక్కకువలె నంగరాజ్యము నీ కెందు కనెను. కర్ణుడు తెల్లబోయెను.

"తగఁగ ప్రతోదము"–'తగన్' మీద 'కాన్' ప్రత్యయము వేసి దానికి హ్రస్వ మిచ్చుటలో నాక్షేపమెంత ధ్వనిత మగుచున్నదో చూడ వచ్చును. ఈ రసధ్వనిని పుట్టించు నన్నయ్యగారి మార్గము లనంతములు. అత్యాశ్చర్యకరమైన మహాకవులయొక్క శిరోభూషణమైనవాడుమాత్రమే చేయ దగిన ప్రయోగ మీ ఘట్టములోననే యున్నది. కర్ణుడు తన

యస్త్రకౌశల్యము చూపించినతర్వాత తా నర్జునునితో ద్వంద్వయుద్ధము చేయవలయు నని యున్న దనగా నర్జును డతని "పిలువంగఁబడక సభలకు బలిమింజను" పాపులు పోవు లోకములకుఁ బోయెద వని యాక్షేపించెను. అనగా పార్థునకు కర్ణుడిట్లనియె.

"అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుడు దుర్బలాయాసక్షే
ప నిబంధమ్ములు పలుకక
ఘన నిశితాస్త్రముల పలుక గడగుము నాతోన్"

ఈ పద్యములో "దుర్బలాయాసక్షేపమ్ము" లను మాట యున్నది. "దుర్బలాశ్వాసాక్షేప" యని పాఠాంతరము. ఇక్కడ నర్థ మెట్లు? విగ్రహ వాక్యము లేవి? ఏదో చెప్పుటకు వీలులేదని కాదు. దుర్బలుడైన వానియొక్క ఆయాసముతోఁగూడిన యాక్షేపముతోఁగూడిన నిబంధన లని చెప్పవలయును. నిబంధ మనుటచేత దుర్బలు లిట్టివి కల్పింతు రని యర్థము. ఈ సమాసము మధురమైనది కాదు. ఏదో యొక క్లిష్టతగల సమాసము. ఆ కూర్పులో నొక వైలక్షణ్య మున్నది. ఆ వైలక్షణ్యము రసధ్వనియొక్క ప్రాణము. ఇం దాక్షేపముయొక్క గాఢత్వము వ్యజ్యమాన మగుచున్నది. ఇట్టి స్థలముల నిట్టి సమాసములు గూర్చుట రససిద్ధులైన మహాకవులే చేయగలరు. ఇది వదలి యసలుకథ కడకు వచ్చి భీముడు కర్ణు నట్లదలించగా గర్ణుడు తెల్లమొగము వేయగా భ్రాతృపద్మ వనమధ్యమ్మునుండి దుర్యోధన

మదాంధగంధసింధురంబు వెలువడి వచ్చి భీముని 'అనిలజ' యని సంబోధించి కొన్ని మాటలు చెప్పెను. నీవు వాయు దేవుని కొడుకవు. నీ వింకొకని పుట్టుకనుగూర్చి యేల ప్రశ్నింతువు వని యర్థము. అంతటితో నాగక "నీ కిట్లు పల్కను తలపను నగునే?" యని యనెను. నీ విట్లని నోటితో ననుటకు వీలులేదు సరిగదా యూహించుటకుగూడ వీలు లేదని యాక్షేపణ.

ఇంత విచిత్రముగా వ్రాయు నన్నయ్య యెంత కర్థ మగుటలేదు 'పల్కను తలపను నగునే' యన్నమాటంబు తీసివేసి యిట్లనుటకు వీలులేదు సరిగదా నీ వి ట్లూహ సేయుటకుగూడ వీలులేదనియే వ్రాసినచో మన మీనాడు మాటాడుకొను మాటల కా పలుకుబడి దగ్గరగా నుండి మన కర్థ మగును. ఆహా యనిపించును. నన్నయ్యగారి నాటి పలుకుబడి సుంతదవ్వు. ఆ భావమే యాధునికులు చెప్పెడు పద్ధతి కొంచెము వేరుగా నుండును. అది మనకు సన్నిహితముగా నుండి శీఘ్రముగ గ్రహింతుము. నన్నయ్య యర్థముకాకపోవుట కిదియు నొక కారణము.

దుర్యోధను డేదో చెప్ప 'వానితోడి దేమి' యని కర్ణుడు తాను వెడలిపోయెను. పాండవుల కా సభలోనున్న గౌరవ మట్టిది. వారిని దుర్యోధనుడు రాజకీయముగా లెక్క చేయడు. చేయలేదని పట్టించుకొనువారును లేరు. భీము డైనను దుర్యోధనునితోఁ బ్రత్యక్షముగా మాటలాడడు. తా నచట పరగృహవాసముంబలె నున్నా డని తెలియును.

ఒక చిన్న విషయముగూడ చెప్పి యీ వ్యాసము ముగింతును. భాతృపద్మవనమధ్యమునుండి దుర్యోధనమదాంధ గంధసింధుర మన్నమాట చిత్రముగా నున్నది. ఏనుగు తామర పూవులను త్రుంచును. లీలగాఁ ద్రుంచును. వాని యం దాదరము లేనిదిగాదు. వానితో నాడుకొనుట దాని కాహ్లాదకరము. కాని యా పూవులు సర్వము నశించును. దుర్యోధనుడు మదగజము. అతని తమ్ములు తామర పూలు. ఇతని సామర్థ్యలీల వారి నాశనహేతు వగు చున్నది.

# ప్రధాన కథ

## 3

భారతములోని ప్రధానకథ కౌరవపాండవుల వైరము. దీని యంకురము, దీని వృద్ధి, బాల్యక్రీడలు, కుమారాస్త్ర విద్యాప్రదర్శనము – రెండుగా ప్రదర్శింపబడినవి. మూడవది లాక్షాగృహ దహనము. అది యంతయు నొక దైవదుర్విలసితము. కథ జరుగుటయే కాని దానియందంత విశేషము లేదు. ఈ వైరవృక్షమునకు నిజమైన పుష్పోద్గమము ద్యూతము. ఆ ద్యూతము భారతకథ కాయువు పట్టు. దుర్యోధనుని వైరభావమునకు కర్ణశకును లిద్దరాలంబములు. వారిద్దరు లేకుండ భారతము లేదు. ద్రౌపది లేనిచో వారివైర మింత తీవ్రరూపము దాల్చెడిది కాదు. ద్రౌపదీ వస్త్రాపహరణమే కౌరవపాండవ వైరభావమునకు శిఖరము వంటిది. విరోధము లుండవచ్చును ఒకరి కొకరపకారములు చేసికొనవచ్చును. ఈ విరోధము స్త్రీ మానభంగ హేతుక మైనప్పుడు దాని నెట్టనము పట్టరానిదిగా నుండును. ఈ సర్వ వైరవృక్షమునకు ద్రౌపది మూలకందముగా గన్పించుచున్నది. ఆమెను బలాత్కారముగ దుశ్శాసనుడు చీరలొల్చుటచేత, నామెను తన తొడమీద గూర్చుండుమని దుర్యోధనుడు సన్న చేయుటచేత, భీముడు ప్రతిజ్ఞలు చేసెను. అందుచేత ద్రౌపదియే యీ మహా వైరవ్యూహమునకు నడిబొడ్డుగా గన్పించు

చున్నది. ప్రత్యేకముగా ద్యూతమంతయు, ఆ ద్యూతము యొక్క పరిణామ మంతయు, దుష్టమైన పర్యవసానమంతయు, మగల నాడిన పునర్ద్యూతమంతయు, నరణ్యాజ్ఞాత వాసములు గూడ సర్వమును ద్రౌపదీ హేతుకములు. ద్రౌపది లేనిచో నీ భారతకథ నిల్చుండెడిది కాదు. ద్రౌపది లేనిచో ద్యూత మాడెడివారు - పాండవు లోడిపోయెడివారు. తరువాత నేమయ్యెడిదో భగవంతునకు తెలియవలయును. ఒకవేళ ధృతరాష్ట్రుడు వారి రాజ్యము వారల కిచ్చెడి వాడేమో? పాండవులు జీవితాంతము సామాన్య రాజకుమారులవలె బ్రతికెడి వారేమో! ద్రౌపది కీ ప్రాధాన్యము కథయందు దున్న దని తెలిసికొని వ్రాయుట కథారహస్య పరిజ్ఞానము.

విదురుడు పోయి పాండవులను ద్యూతమునకు పిలిచి కొని వచ్చెను. పాండవులు ద్రౌపదియు వచ్చి వృద్ధులకు నమస్కారము చేసిరి. "అంత ద్రుపదరాజ నందనయు గాంధారికి మ్రొక్కిన నక్కోమలిం జూచి గాంధారి కోడండ్రెల్లను విస్మితులై యిట్లనిరి.

"అఖిల లావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలతగా దీనియందు నిర్మించె నొక్కొ
కానినా డిట్టి కాంతి యే కాంతలందు
నేల లేదని సామర్ష హృదయ లయిరి"

ఈ ఘట్టము భారతకథకు ప్రాణభూతముగ ద్యూతాది యందు నిక్షిప్తమైనది. కౌరవ పాండవులకు తగినంత విరోధ మున్నది. ఆ విరోధమున కిది యవధిభూత మైనది. గాంధారి

కోడండ్రెల్లరు ద్రౌపదిని చూచి యోగ్యలేసి తనమును పొందిరి. ఆమెయొక్క లావణ్యమునకు చుప్పనాతి తనము పడిరి. లావణ్యమనగా సౌందర్యముగాదు. శరీరకాంతి, ఆవిడ శరీరకాంతికి వారు మాత్సర్య పడిరి. ఈ శరీరకాంతి కొంత సహజమైనను నెక్కువ భాగము పోషణచేతను, భోగము లనుభవించుటచేతను వచ్చేడిది. ఆమె లావణ్యము పాండవుల సంపత్సమృద్ధిని చెప్పుచున్నది. ఆమెయందు పాండవులకు గల ప్రేమ చెప్పుచున్నది. ఆమె భోగపరాయణత్వమును చెప్పుచున్నది. అట్టి భోగము మనకు లేదే యని గాంధారి కోడండ్రు మాత్సర్య పడిరి. మాత్సర్య పడుటయే కాదు. కోపించిరి. అమర్ష శబ్దమునకు కోపమును, మాత్సర్యమును రెండును నర్థములే. మన మే యర్థమును చెప్పుకొన్నను చెప్పు కొనవచ్చును. రెండర్థములును చెప్పుకొనవలయు ననియే నన్నయ్యగారి యూహ. నన్నయ్యగారు శబ్దము లిట్లేవాడును.

మరునాడు తెల్లవారి నంతనే ద్యూతారంభము. ఈ రీతిగా జరుగఁబోవు మహాకైతవ ప్రక్రియారంభమునందు తత్ప్రక్రియా శిఖరభూతమైన ద్రౌపది నిట్లు వర్ణించి ద్యూతావసాన మంతయు నామెకు జరిగిన యవమానము, ఆమె ప్రతిభ, ఆమె ధర్మబుద్ధి, సర్వముగా పర్యవసించిన కథను వ్రాయుట యిది మహాశిల్పము.

ఈ కథా పర్యవసానము—

"తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రులద్దైన భీ
కర పరస్పర కోపవేగము క్రన్నబాచి విపత్తి సా

గర నిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులన్
పురుషసింహములన్ సజేసులఁ జూసి తద్దయుఁ బ్రీతితోన్"

ఈ రెండు పద్యములు నన్నయ్యగారు ద్యూతాద్యవసానముల సిశ్శేషించి ద్యూతము దేసహేతువున విపరీతమైన పరిణామమును పొందెనో, యీ పరిణామము దేనివలన తాత్కాలి కోపశాంతి పొందెనో యీ ద్రౌపదీదేవిని మొదల నట్లుచెప్పి చివర నిట్లుచెప్పుట యిది మహాశిల్పము. భవభూతి కాళిదాసాదులకు తాదృశులకు దప్ప తక్కినవారికి తెలిసినది కాదు. చేసినదికాదు. ఇది యొక మహాద్భుతము.

ఇందులో మరియొక చమత్కారము. ద్రుపదరాజ నందన గాంధారికి మ్రొక్కినపుడు గాంధారి కోడండ్రెల్లను జూచిరి. ఇది పాండవులు ధృతరాష్ట్రాదులకు మ్రొక్కిన స్థలముగాదు. స్త్రీజను లుండెడు నంతఃపురము. అందుచేత ద్రౌపది పెద్ద యత్తగారి దర్శనము చేయుటకు భర్తలను వదలిపెట్టి తా నంతఃపురమునకు వెళ్ళినదని స్ఫూర్తి కలుగు చున్నది. లేనిచో గాంధారి వందమంది కోడండ్రు పురుషు లున్నచోటికి రారు.

మరియు 'వారు సామర్షహృదయులైరి' యని చెప్పుట చేత నేమి యర్థమగు చున్నది? వట్టి ద్రౌపదియొక్క లావణ్యా వర్ణనము కథ కనవసరము. ఇది శృంగారరసప్రబంధము గాదు. ఆ వందమంది కౌరవుల భార్యలు నాటిరాత్రి తమ భర్తలతో ద్రౌపదిని గూర్చిన యసూయ వాక్యములు చెప్పియే

యుందురు. ఈ మొదలైనదంతయు నూహించుకొనవలయును. తమ భార్యలు చెప్పినదానినిబట్టి కౌరవులలో ప్రతివాడును ద్రౌపదిని చూడవలయు నని యే కోరును. ఆమెకు పరాభవము జరుగుచున్నప్పుడు తమ భార్యల కది సంతోష హేతు వని తూష్ణీంభావమే వహించును. మరునా డట్లే జరిగినది. ఒక్క వికర్ణుడుతప్ప వందమందిలో నెవ్వడును లేచి యిది న్యాయము కాదనడే. ఇందుకు దుర్యోధనునియందు వారికి గల ప్రణయ భయములే కాను, తమ భార్యలు పొందిన మాత్సర్యముకూడ హేతువే. ఇది యంతయు లోకమునం దుండు స్వభావము. నన్నయ్యగారు దీని నేమియు చెప్పడు. ఆ పద్య మట్లువ్రాసి వదలిపెట్టెను. తక్కిన దంతయు పాఠకు నూహించుకొమ్మని వదలిపెట్టును.

"ఇట్లు పాండవకౌరవు లతి ప్రణయ గౌరవమ్మున న ద్దివసంబు సలిపిరంత ప్రభాతంబ"—కౌరవ పాండవులనిన సమాసమునందు ప్రాశస్త్యత యెక్కువ యుండును. కాని 'పాండవ కౌరవు'లని యున్నది. తరువాత 'నతిప్రణయ గౌరవమ్మున' యని యున్నది. ప్రణయ మధిక మనుటకు వెనుకనున్న యతిశబ్దము చాలును. గౌరవ మక్కఱలేదు. కాని రెండును వాడఁబడెను. ఇది క్రమాలంకారము చెప్పుకొనుటకు ద్వంద్వ సమాసముగాదు. ఐనను క్రమాలంకారస్ఫూర్తి భాసించును. పాండవులు కౌరవులయందు ప్రణయముతో నున్నా రని, కౌరవులు పాండవులయందు గౌరవము చూపించి రని చెప్పి కొనవచ్చును.

పాండవులు వచ్చిరి. పెద్దలకు నమస్కరించిరి. ద్రౌపదిని చూచి కౌరవభార్య లసూయం బొందిరి. ఈ మాత్రమే పెద్దచెప్పి క్రిందివచనములో "ఇట్లు పాండవ కౌరవులతి ప్రణయగౌరవమ్మున నద్దినంబు సలిపి" రనుటలో 'ఇట్లు' అన్న శబ్దమున కర్థము లేదు. పైన చెప్పిన మాటలలో వా రొకరియం దొకరు చూపించిన ప్రణయగౌరవము లేదు గనుక. మరి యెందు కిట్లు వ్రాయుట? దీనిచేత పాఠకుడే యూహించవలయును. కౌరవ పాండవుల కొకరియం దొకరికి ప్రణయగౌరవములు లేవు లేనివి వారు నటింతురు. ద్యూతము జరిగి దుష్టఫలము పుట్టువరకు వా రొకరి నొకరు చేసికొను మర్యాదల కవధి లేదు. ఇదియంతయు నబద్ధమైన మర్యాద. హృదయములోనిది కాదు అందుకని 'యిట్లు' అన్నమాట 'ఇత్థ' 'మితి' శబ్దముల యర్థము లేనిదైనది.

నన్నయ్యగారు 'ఇట్లు', 'అంత', 'అందు' మొదలైన శబ్దములు చాల విచిత్రముగా వాడును. ఈ శబ్దములు కథలోని రహస్యములు, కథాగమనవైఖరి మొదలైన చిత్రచిత్రములైన యర్థముల నిచ్చుచుండును. 'అంత' యన్న శబ్దమునకు నలోపాఖ్యానములో వ్రాసితిని.

కథాకలితార్థయుక్తి యన్నమాట యీ ఘట్టములో విస్పష్టముగాఁ దెలియును. ఇందు ద్యూతము ద్రౌపదిని సభకు తోడ్తెచ్చుట, వస్త్రాపహరణము, ధృతరాష్ట్రుడు మరల పాండవుల రాజ్యము పాండవుల కిచ్చివేయుట, ఈ సంగతులు జరిగెను. ద్యూతము జరిగినప్రదేశము ధృతరాష్ట్రుడు క్రొత్తఁగా

నిర్మించిన సభాభవనము. ఆ సభాభవన మెటువంటిది? దాని నిర్మాణ వైఖరి యెట్టిది? ఈ కథ చెప్పుకొని పోవుచుండగా నీ సంగతి తేలవలయును. ఇందు జరిగినట్లు చెప్పబడిన కథ యంతయు నొకదినమున జరిగెనా, కొన్ని దినములు జరిగిన నీ సంగతి తెలియవలయును. ద్రౌపదికి వరము లిచ్చిన దెవ్వరు? మరల ధృతరాష్ట్రుడు ధర్మరాజులకు నింద్రప్రస్థ రాజ్యమిచ్చిన సమయ మెట్టిది? ఓడిపోయినతర్వాత మరల తమకు రాజ్యము వచ్చువరకు ధర్మరాజాదు లేమి చేయు చున్నారు? ఇట్టి యనేక ప్రశ్నములు పుట్టును. వీని యన్నంటికి నన్నయ్యగారి రచనలో సమాధానము లున్నవి.

"ఆ ధృతరాష్ట్రు చేసిన యనర్ఘ మణిప్రకరానుబద్ధ శో
భాద్యుతి నొప్పుచున్న సభ.........దుర్యోధను డర్థి జూపఁగ"

ధర్మరాజు మెచ్చెను. దుర్యోధను డర్థిఁ జూపించెను. అర్థిఁ=కోరికతో.. మరికొంత సేపటికి ధర్మరాజు శకుని జూదములో నోడించును. ధర్మరాజు సంపదయంతయు తనకే వచ్చును. ఆ ధర్మరాజునకు తనసభ చూపించుటలో దుర్యోధనున కంత కోరిక యెందులకు? ధర్మరాజు మెచ్చుకొన వలయు ననియేకదా? ఆ ధర్మరాజు మెచ్చుకొనిన నేమి? మెచ్చుకొనకపోయిన నేమి? ఇదియంతయు నటన యందమా? నటన కాదు. ఆ ధర్మరా జన్నచో నెంతయో గౌరవము. అతని పట్టుదల యంతయు రాజ్యము పాండవుల కీయగూడదని మాత్రమే. కోపమున్నచో భీమునిమీఁద నున్నది. తక్కినవారి మీద లేనేలేదు. తక్కినవా రన్నచో గౌరవమే లేదు. ధర్మరా

జన్నచో నతనికి మిక్కిలి గౌరవము. పరాక్రమ విషయము నందుగాదు. ధర్మరాజశక్తుడని పాండవులు హస్తినకు వచ్చిన క్రొత్తలోనే సిగ్గ్ణుంచెను.

"ఉపాంశు వధ జేసి మధ్యము మదోద్ధతుం జంపి సి
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి"

మదోద్ధతుడు భీముడు వానిని చంపవలయును. ధర్మరాజశక్తుడు; అతని బంధించవలయును. పరాక్రమ విషయమున ధర్మరాజు డశక్తుడైనను అతని పాండిత్య ధర్మ పరిజ్ఞానాది ముఖ్య విషయములు లోకారాధ్యములు. వారిది సమిష్టి కుటుంబము. అతడు తనకంటె పెద్దవాడు. మయసభయొక్క సౌందర్యము తెలిసినవాడు. అతడు మెచ్చినగాని తనసభ యుత్తము మైనదిగాదు అందుచేత నతడు మెచ్చవలయునన్న కోరికతో దుర్యోధనుడు తన సభ యంతయు నతనికి చూపించెను. ధర్మరాజు మెచ్చుకొనెను. దుర్యోధనుడు సంతోషించెను. ధర్మరాజునకు మాత్సర్యములేదు. అతని మెప్పుదల సమక్కల్మషముగా నున్నది. ఈ కారణముచేతగూడ ధర్మరాజన్నచో దుర్యోధనునకు మిక్కిలి గౌరవము.

దుర్యోధనుడు ధర్మరాజుతో నెప్పుడు మాట్లాడడు. నన్నయ్యగారు వ్రాసిన భాగములో దుర్యోధనుడు ధర్మరాజుతో ద్యూతసమయమునందుతప్ప మరి యెప్పుడును మాటాడలేదు. ఈ ద్యూతసమయమున రెండుసారులే మాటాడెను. మొదటిసారి జూదమాడుమని, రెండవసారి

తనబంధులు తన మామయైన శకుని యాదు నని. ఈ రెడు పద్యములు చూడుడు.

"అనఘ సుహృద్ధ్యానము బిం
దొనరింతము ప్రొద్దువోకయును నగు"
"అనఘ మా మామ నాకై కడంగ
జూద మాడెడి నీతోడ"

మరి యెచ్చటను దుర్యోధనుడు ధర్మరాజుతో మాటాడ లేదు. ఈ మాటాడిన రెండుసార్లు ధర్మజుని 'అనఘా' అని సంబోధించెను. మొదటి పద్యములో సంబోధన మేదో పద్యరచన యట్లే యుండునని యనుకొన్నను రెండవపద్యము లోని మొదటిసంబోధనము నన్నయ్యగారు బుద్ధిపూర్వకముగా నొక ప్రయోజన మాశించియే యట్లు వ్రాసెనని తెలియగలదు. ఇది దుర్యోధనుడు ధర్మరాజునకు చేయుగౌరవము వారి కుటుం బములోని మర్యాద. దుర్యోధనునకు పాండవులయం దెంత మాత్సర్యమున్నను సముదాచారము నుల్లంఘించడు. పైన నతనికి ధర్మరాజునందు మిక్కిలి గౌరవము

ఇట్లు రెండు సంబోధనలచేత నొక విచిత్రమైన నాగర కతయు, సముదాచారమును, కుటుంబమర్యాదయు, దుర్యో ధనుని శీలములోని యొకయంశమును రహస్యముగా గుప్త పరచి లోనారసి తెలియదగిన శిల్పమును నన్నయ్యగారు ప్రదర్శించిరి.

నన్నయ్యగారి యీదృశ శిల్పరహస్యములు పెక్కు లున్నవి. తరువాత మరికొన్ని వ్రాసెదను.

ఇంక సభాస్వరూప మెట్లు నిరూపింపఁబడినదో చూతము. "అ య్యపూర్వ సభామణికుట్టిమంబున నందరు సుఖాసీనులై" — ఈ మణికుట్టిమ మెచట నున్నది!

ధర్మరాజు సర్వము నోడిపోయినతరువాత విదురుడు ధృతరాష్ట్రునకు రహస్యముగ కొన్ని మాటలు చెప్పెను. ఆ సభలో నీ రహస్యము చెప్పుట కెట్లు వీలుపడెను?

తరువాత ద్రౌపది "సభకుం జనుదెంచి కురువృద్ధు సమీపంబున నున్నంత" ఈ కురువృద్ధుడు ధృతరాష్ట్రుడా? భీష్ముడా? బాహ్లికుడా? భీష్ముడై యుండవలయును. తరువాత దుశ్శాసను డామెను లాగఁబోవునపుడు "కడు భయంబు నొంది గాంధారియొద్దకు నరిగె" ఈ గాంధారి యెచ్చట నున్నది?

"నేను రజస్వలను. ముట్టుకుండుము. ఏకవస్త్రనై యున్నదాన. మరి గురుబంధు జనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తు ననిన" పైన సభకు వచ్చె నని యున్నది ఇచ్చట సభ కెట్లు వత్తు నని యున్నది.

ఈ పై వాక్యములనుబట్టి యీ సభానిర్మాణ మెట్టిదో యోచించుకొనవలయును.

సామాన్యముగా భారతదేశ రాజసభ లెట్లుండును? ఆ సభానిర్మాణవైఖరి యెట్టిది? అది తెలిసినగాని యీ యర్థము గోచరించదు. ధర్మరాజుయొక్క మయసభ వేరు. ధృతరాష్ట్రుడు నిర్మించిన యీ సభానిర్మాణము వేరు. మయ

సభలో ద్వారము లున్నవి. గదు లున్నవి. సామాన్య రాజ సభవంటిది గా దా మయసభ. ధృతరాష్ట్ర నిర్మితమైన యీ సభ యనర్ఘమణులతో చేయఁబడినదైనను నిర్మాణవైఖరి సామాన్య రాజసభవంటిది.

ఈ పూర్వ రాజసభలయొక్క నిర్మాణపద్ధతి రెండు విధములు. ఒకటి పొడవుగా సాగినటుల నిర్మింపఁబడును. తుదల పెద్ద స్తంభములు, ఆ స్తంభముల యుపరిభాగములు గోళాకృతిగ కలుపుటలు.

రెండవరకము ఈ స్తంభములను గోళాకృతిగ కల్పుట లతో చతురస్రముగ నిర్మించి యొకవైపున వదలివేయుట. ఈ రెండువిధములలో దేనికిని గదులు, తలుపులు నుండవు. వట్టి మైదానముగా నుండును. మొదటిదానికి చంద్రగిరి కోట లోని మహాలు దృష్టాంతము. రెండవదానికి మధురలోని తిరుమలనాయకుని యంతఃపురము దృష్టాంతము. ఈ తిరుమల నాయకుని యంతఃపురము వట్టిసభ అంతఃపురమని వ్రాయుట ఇంగ్లీషుమాటకు తెలుగు చేసితిని.

ఇట్టి యొకసభను మనస్సులో నూహించుకొన్నచో పై చెప్పిన పరిస్థితులు విశదమగును. రెండు స్తంభములకు నడుమగా నొక్కొక్క భాగముగా నుండును. సభ చతుర స్రముగా నుండినచో నడిమి విశాలమైన దేశమున ప్రధాను లైన సభ్యులందరు కూర్చుందురు.

అచ్చట నీ యపూర్వ సభామణికుట్టిమము గలదు. కంబము కంబము నడుమ నున్న విభక్త దేశములలో నున్న

తాసనములు వేయఁబడి నాసమీద పెద్దలు రాజులు కూర్చుం
దురు. అందుచేత నొక రెండు స్తంభముల నడిమి ప్రదేశమున
నొక యున్నతాసనమున ధృతరాష్ట్రుడుగాని, మరి యెవ్వరు
గాని కూర్చున్నచో సభయంతయు వారికి కన్పించదు.
సభలోనున్న సర్వప్రదేశములకు వారు కన్పించరు. ఇందు
చేతనే విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యముగ
మాట్లాడుటకు వీలైనది. ద్రౌపది సభకు వచ్చెను.
వచ్చెనని యెందరకు తెలియును? వచ్చి యామె కురువృద్ధుని
సమీపమం దున్నను గాంధారియొద్ద నున్నను నెవ్వరికిని
కన్పించదు. విశాలముగా నున్న నడిమి ప్రదేశమునకు వచ్చి
నప్పుడే ద్రౌపది యందరకుఁ గన్పించును. అప్పటికి రానేర
ననుటయే గురుబంధు జనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తు
ననుట.

మరి యీ ద్యూత మెన్నాళ్ళు జరిగినది? ఒక్కనాడే
జరిగినదా? అన్నది వేరొక ప్రశ్న.

ఆనాటి ప్రభాతంబ ధర్మరాజునకు దుర్యోధనుడు సభ
చూపించెను. అంత పెద్దసభ చూచుటకు, అందలి శిల్ప
మంతయు పరీక్షించుటకు రెండు మూడు గంటలకు తక్కువ
పట్టను. వారు భోజనము చేసి యప్పటికి వచ్చిరా? కొంత
సేపైన తర్వాత పోయి భోజనము చేసిరా? ఆనా డంద రుప
వాస ముండిరా? ఈ ప్రశ్నలు తేలవు?

ధర్మరాజు తన సర్వసంపదయు నోటువడుటకైన నొక
దినము నిస్సందేహముగ పట్టును. ద్రౌపదికొరకు కబురంపించు

టను. నామె ప్రశ్నలకు, నామె వచ్చుటకు, నామె వస్త్ర ములు పర్వాతోపమాన మగునవరకు విప్పుటకు నెంత కాలమైన పట్టును. ఇది యొకనాడు జరిగిన వ్యవహారము గాదు. రెండు మూనాళ్లు జరిగి యుండవలయును.

విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యముగా చెప్పిన మాటలు నిస్సందేహముగ నొక దివసావసానమును సూచిం చును. తక్కిన కథ రెండవనాడు జరిగి యుండవలయును. ద్రౌపదీ వస్త్రాపహరణము జరిగిపోయినది. భీముని ప్రతిజ్ఞ లైపోయినవి. "భీమసేను నతి రౌద్రాకారంబు నూచి భీష్మ విదుర ద్రోణాదు లిది కోపంబున కవసరంబు కాదని యాతపం బ్రశాంతచిత్తుసం జేసిరి. అంత—

'ధృతరాష్ట్రు నగ్నిహోత్రా
యతనంబున నఱచె వళుల నగ్నులు శాంత
ద్యుతు లయ్యె గౌరవస్త్రీ
తతి హృదయము లధికశోక తప్తము లయ్యెన్

'క్రూరాత్మకులై దుష్పద
వీరతులగు ధార్తరాష్ట్ర వీరుల శయ్యా
గారముల నెగసె నెంతయు
ఘోరంబుగ గాక ఘూక ఘూత్కారంబుల్.'

'అట్టి మహోత్పాతంబులు
పుట్టినఁ గృపవిదుర కలశభూశాంతనవుల్
నెట్టన ధృతరాష్ట్రజులకుఁ
బుట్టె నరిష్టమని రిష్టమున దమలోనన్.'

"అంత నంతయు నెరింగి గాంధారి విదురుం ద్రోణాచార్యుని ధృతరాష్ట్రు కడకుం బోయి పాండవ పరాజయంబును ద్రౌపది పరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనుం బిలిచి యిట్లనియె"

ఈపైన వర్ణింపఁబడిన పద్యములయందలి సంగతులు జరుగుటకు వారముదినములకు తక్కువ పట్టదు. ఇందులో లోకచమత్కార మున్నది. అగ్నిహోత్రగృహములయందు నక్క లఱచెను కౌరవుల పడకటిండ్లలో కాకులు గ్రుడ్లగూబలు కూసెను. ఆ నక్కలు పడకటింట్లయం దెందు కరవ లేదు? అగ్నిహోత్ర గృహములు రాజసౌధములకు తుద నుండును. ఊరున కదియొకకొస. రాజసౌధములే గ్రామమునకు చివర నుండును. అగ్నిహోత్రగృహములు వానివెనుక నుండును. అగ్నిహోత్ర గృహముల నంటుకొని పొలాలు, నడవులు వ్యాపించి యుండును. అందుచే నక్కలు అగ్నిహోత్రగృహములకు రాగలవు. పడకటిండ్లవఱకు రాలేవు.

"కౌరవస్త్రీతతి హృదయము లధికశోక తప్తము లయ్యెఁ" - కౌరవుల భార్యల హృదయములు గగ్గో లయ్యెను. వీరందరు ద్రౌపది లావణ్యము చూచి సామర్ష లైనవారు. ద్రౌపది కింత యవమానము జరుగునని వారనుకో లేదు. ఈ యవమానము కొంపలంటించు నట్లున్నది. ఈ దుర్వార్త యనుకొనిన మేర దాటిపోయినది. వారు ద్రౌపదినిగూర్చి యెంత యసూయపడినను నిండుసభలో ద్రౌపది యిట్లు పరాభవింపఁ బడుటనుగూర్చి వారూహించి యుండరు. ఇంత

జరిగినతర్వాత నెవరి మనసులును బలుకడఁ బొందియుండవు. వారి హృదయము లధిక శోకతప్తము లయ్యెను. "అయ్యో! మన మింత యనుకొనలేదే! ఊరకే మన భర్తలతో ద్రౌపదిని గూర్చి మన యసూయ వెల్లడించితిమి. ఇప్పుడింతపని జరిగినది. ఈ ద్రౌపదీదేవి యవమానమునకు మనమే హేతువులము" అని వారు దుఃఖమును బొందిరి. శోక శబ్దములోని స్వారస్య మిది.

ఇట్లనంతములైన మహార్థములు నన్నయ్యగారొక్క శబ్దములో చెప్పి విడిలిపెట్టెను.

'అంతనంతయు నెరిగి గాంధారి అనఁగా కోడళ్ళువచ్చి మొరపెట్టికొనిరి. అగ్నిహోత్రాయతనములయందున్న రక్షక భటులు వచ్చి చెప్పిరి. ఈ వార్తలు వేరితో చెప్పఁగలరు? దుర్యోధను డన్నచో భయము. వానితో చెప్పరు. ధృతరాష్ట్రుడీ కుత్సితక్రియకంతయు మౌనమూ వహించెను. అతడు గూడ దీని కంగీకరించినట్లే. ఆయనతోడను చెప్పరు. మిగిలినది గాంధారి పట్టమహిషి. స్త్రీ సులభముగా సభిగమ్యురాలు. పాండవపరాజయము, ద్రౌపదిపరిభవము, దుర్నిమిత్తోత్పత్తి వీనియందలి కారణ కార్యత్వముమాత్రమే యామె ధృతరాష్ట్రునకు చెప్పెను. ఆ చెప్పుటకు తానొక్కతెయే పోయినచో భర్త యాదరించడేమో యని విదురుని తోడు తీసికొని వెళ్ళెను. వెళ్ళి చెప్పఁగా ధృతరాష్ట్రుఁ డొప్పుకొనెను. కొడుకును పిలిచి యిది న్యాయముకాదని చెప్పెను. "వారివలన

నీ దురాగ్రహం బుడగు మసి కొడుకును భంగించి” తరువాత ద్రౌపదిని పిలిపించెను.

కొడుకును భంగించి యనుటలో నున్నది. కవితాశక్తి యంతయు. ధృతరాష్ట్రుడు కోడలినిపిలిచి యామెనోదార్చి పాండవుల రాజ్యము పాండవుల కిచ్చి వేయవలయునని యూహించెను. ఈసంగతి కొడుకుతో చెప్పలేదు. చెప్పినచో నత డప్పుడే వల దనునేమో? ఆ కొడుకును చీవాట్లు పెట్టిన వైఖరి వేరు. ద్రౌపది పరమ పతివ్రత, తపస్విని. అయోనిజ. ఆవిడ ప్రకృతి మానవ భామినికాదు. నీ మూలమున పాండవులు మిక్కిలి దుఃఖపడు చున్నారు.’ ఇవి యనిన మాటలు. దుర్యోధనునిలో నున్న మంచితనమును. జాలిని ప్రేరేపించు మాటలు. పాండవుల కింత చేసితిమికదా! రాజ్యము మనదేకదా! యింక తండ్రి చేసినచో పాండవులు దాసులుగా నుండకుండ చేయును. పేరునకే గాని వారిచే నెప్పటికిని దాస్యము చేయించు కొనలేము అని దుర్యోధను డూరకుండెను. ధృతరాష్ట్రుడు తాను చేయఁబోవు పనికి కొడు కడ్డము రాకుండ వాని తీవ్రోద్వేగమును మళ్ళించుటయే యీ భంగించుట కర్థము. ధృతరాష్ట్రు డంత నీతిమంతుడు. కొడుకు పగ తీరినది. ఇంక బంధువులను సంతోషపెట్టవలయు నని యతని యూహ.

ఇన్నాళ్ళు పాండవు లెచ్చట నున్నారు? ఏమి చేయు చున్నారు? వారి స్థితి యెట్లున్నది? ఈ సంగతి యేమియు తెలియదు. ఇంక నీ ఘట్టములో ననేకములైన చమత్కారము లున్నవి.

# ప్రధాన కథ

## (ద్యూతము - పరిశిష్టము)

మఱియు నీ ద్యూతము జరిగినన్నాళ్ళు పాండవు లెందుండిరి? పాండవులు దుర్యోధనునకు దాసులైరి. ఈ దాస కృత్యము చేసిరా? చేయవలయు నని నియమింపఁబడిరా? నామకః దాసులేగాని యట్టి నియమములేదు. నిజముగా దాసకృత్యము చేయవలయు నని యాజ్ఞాపింపఁబడినచో యుద్ధ మప్పుడే జరిగెడిది. వారిని పరాభవించి తేజోవిహీనులుగా జేసి యూరకుండుటయే దుర్యోధనాదులు చేయఁగల్గిన పని, జూద మాడబడినది. వారి సంపదయు రాజ్యమును తీసికొన బడినది. ద్రౌపదీ మానభంగము జరిగినది. దుర్యోధనునకు గావలసిన దింతియే. నిజముగా వారిచేత దాస్యము చేయింపను, చేయించుట సాధ్యముగాదు. దానికి వేరే ప్రయత్నము చేయవలయును. చేసినచో నది దీనికంటె నెక్కువ యపాయ కరము.

పాండవులు హస్తినలో నున్నప్పుడు వారైదుగురకు నైదు మేడలు. ద్రౌపదికి నంతఃపురములో వేరే నివసము. ఇవి యేర్పాటు చేయఁబడియుండును. వారు తమ మేడలలో నుందురు. ధృతరాష్ట్రుడు ద్రౌపదిని రావించి వరమిచ్చెను. ఈ ద్రౌపదిని రావించినప్పుడు ద్రౌపది వచ్చుచున్న దని

పాండవులకుఁ దెలియదు. తెలిసినచో నెందుకని తర్జన భర్జనలు జరిగియుండును.

ఆమె రెండువరము లడిగినది. ధృతరాష్ట్రుడు వాని నిచ్చెను. మూఁడవవర మడుగు మనెను. క్షత్రియ సతి మూఁడవవర మడుగఁగూడ దని ద్రౌపది చెప్పెను. "అనిన ధృతరాష్ట్రుండు కోడలి గుణంబులకు, ధర్మం బెఱుంగుటకు సంతసిల్లి యనుజసహితుండైన యుధిష్ఠిరు రావించి, ధర్మ రాజుక పాండు రాజ్యంబునందు సమర్పించిన" "దాని నంతయు భీమసేనుండు విని" "మృగ మధ్యంబున నున్న సింహాంబునుంబోలె ననుజమధ్యంబున నున్న యాతని కర తలంబున వారించి ధర్మరాజు".

"ఇట దుశ్శాసనుచేత నంత వృత్తాంతంబును విని దుర్యోధనుండు కర్ణశకుని సైంధవులతో విచారించి ధృత రాష్ట్రి పాలికిం జని"

ఈ యీ వాక్యములు కించిత్కించిద్వ్యవహితములుగా గ్రంథమునం దున్నవి.

అనుజ సహితుండయిన యుధిష్ఠిరు రావించి—ఈ అనుజులలో భీము డున్నాడా లేడా? యని ప్రశ్న. ఉన్నచో "దాని నంతయు భీమసేనుడు విని" యన్న ప్రసక్తిలేదు. ఇందుచేత ధృతరాష్ట్రుడు రమ్మనగా భీమసేనుడు రాలేదు. నేను రానన్నెను. ధర్మరాజునకు ధృతరాష్ట్రుడు తిరిగి రాజ్యమిచ్చి నన్న విషయము భీమునకుఁ దరువాత దెలిసెను. అప్పు డతనికి కోపమువచ్చెను. ఇట్టి యర్థము పొసగుటకు నన్నయ్యగారు

కథ చెప్పుచు భిన్న విషయములను వ్యవహితము చేయుట హేతువగు చున్నది.

పాండవులకుఁ దిరిగి రాజ్యమిచ్చెనన్న సంగతి, వారింద్ర ప్రస్థమునకుఁ దిరిగిపోయినసంగతి దుశ్శాసనుడు చెప్పఁగా దుర్యోధనునకుఁ దెలిసెను.

ఈ పరిస్థితులచేత నొకటి యవగతమగు చున్నది. ఆ రాజగృహములందు ప్రదేశము బహువిశాలమయినది. ఒక చోట జరిగిన సంగతి మరి యింకొకచోటఁ దెలియదు.

ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరములిచ్చిన స్థలము మహా సభలోగాదు. ఇది యాయన గృహములో జరిగినట్లుండెను. సకలబాంధవ హితంబు సేయందలంచి యిట్లు చేసెను. అనగా నప్పుడు బంధువుల నందఱ బిలిపించి యుండవలయును. అందరును రాచవారే. వేరిగృహములు వారివి. పిలిపింపఁబడక యెవ్వరును బోరు.

ఇదియొక విచిత్రమయిన రాజగృహము. రాజరాజ నరేంద్రుని కోటలో నిట్లుండెడి దేమో? దాని నంతయు నన్నయ్యగారు చిత్ర చిత్రములుగా వ్యంగ్యభూతముగాఁ దన కావ్యమునందు విపచించెను.

నన్నయ్యగారి కావ్యము నిట్లు చూడవలసిన యవసర మున్నది. నన్నయ్య భారతములో క్షత్రియు లెవ్వరు మాటా డినను మిక్కిలి స్వల్పముగా మాట్లాడుదురు. విస్తరించి మాటాడరు. ఇది యొక రాజరీవి. దీనికి నన్నయ్యగారి

యందు బహూదాహరణములు గలవు. ఆయన ధర్మరాజాది పాత్రములను తీర్చిన తీర్పే యిది. అందరు నభిమానవంతులు. ఎంత యవసరమో యంతియే మాటాడుదురు.

నాల్గయిదు మాటలలో ననంతమయిన యర్థమును జెప్పుట మహాశిల్ప మని కొంద రందురు. న్యాయమే. అట్టి శిల్పము నన్నయ్యగారియందు పొందిన యవధిని మఱి యెచ్చటను బొందలేదు. నావ్రాసిన యీ సర్వోపన్యాసములు దీనికే యుదాహరణములు.

ద్రౌపదిని దుశ్శాసనుడు పట్టుకొని లాగఁబోయినపుడు "కృష్ణ పంకజాక్షి కడు భయంబు నొంది : గాంధారి యొద్దకు నరిగె" ఇట్లు తల్లిదగ్గర దాగియున్న ద్రౌపదిని దుశ్శాసనుడు జుట్టుపట్టుకొని సభకు లాగికొనివచ్చెను. పసిపిల్లల యాటలలోఁ గూడ తల్లిదగ్గర దాగినవానిని దాకి యోడించరు. ఇంక నీ దుశ్శాసనుని దౌర్జన్యము నేమని చెప్పవలయును? ఈ యొక్క మాటతో దుశ్శాసనుని దౌర్జన్యము, క్రూరత్వము, పశుత్వము వెల్లడించఁబడెను.

ద్రౌపది కట్టుపుట్టము లొలిచిరి.

"ఇది సేయఁగా దని మది విచారింపక
సదగ్రహి తుండు దుశ్శాసనుండు
నెట్టన ద్రౌపది కట్టిన పుట్టంబు
సభలోన విడ్చె నాశంక లేక
యుడుగక యొలువంగఁబడియు మున్నపనీత
మైన తద్వస్త్రంబు నట్టి వలువ

లలితాంగి జఘనమండలమున బాయక
యొప్పుచు నున్న న య్యువిదఁ జూచి
సభ్యు లెల్ల ముదితసమ్మదు లయిరి దు
శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమానమయిన నొలువంగ నోపక
యుడిగె లజ్జబొంది యుక్కు దక్కి.

ఈపద్య మొక యాశ్చర్యమైన విషయము. మహాకవిని చదువుట కొంచెము కష్టము. స్థూలముగాఁ జదువుచుఁ బోయినచో నతడేమి చేసెనో యెప్పుడును దెలియదు. సూక్ష్మముగాఁ జూచినగాని యాయన హృదయము గోచరించదు. ఇచట ద్రౌపదీ మానభంగము చేయవలయు నని దుర్యోధనాదుల సంకల్పము. అనఁగా నామె నిండు సభలో వివస్త్రగా నిలిచి యుండవలయును. కాదయేని యామె శరీరావయవము లనాచ్ఛాదితములై కొంతకుఁ గొంతయయిన కనపించవలయును.

ఈ భారతమున రెండే విషయము లద్భుతము లున్నవి. అవి శ్రీ కృష్ణదేవుని పరమేశ్వరత్వ సూచకములు. ఒకటి ద్రౌపదీ వస్త్రాపహారణము. రెండవది రాయబారపు ఘట్టమున విశ్వరూప ప్రదర్శనము. ఈ రెంటిలో మొదటిది నన్నయ్యగారి చేతిలోఁ బడినది. ఈ సందర్భమున నన్నయ్యగారు కృష్ణుని ప్రసక్తి చేయలేదు. ద్రౌపదీదేవియొక్క వస్త్రచయము "పర్వతోపమాన మయిన నొలువంగనోపక, దుశ్శాసనుండు లజ్జపొంది యుక్కుదక్కి యుడిగెను."

ఒకటి కొలఁదట లజ్జ పడెను. రెండు దుఃఖ దక్కెను. తా నేదో మహాఘనకార్యము చేయవలయు ననుకొనెను. అట్టి దుష్టులయొక్క యూహాలు ఫలింపనప్పుడు సిగ్గుపడుట తప్ప మరి యేమియుఁ జేయలేరు. ఉక్కదక్కట యెందులకు? ఇంతకు మించి యేమియు జేయలేడు. ద్రౌపది దాసి కనుక నామె కట్టిన చీరయు వెలగల ధనము గనుక నది తమసొమ్ము. తాము తీసికొనవచ్చు నన్న మిషచే నీదురుద్యోగమున కుపక్రమించెను. ఇంతకు మించి యేమి చేసినను ప్రాణాపాయము. అసలు లజ్జచేఁ గ్రుంగుచుపడెడువానికి మరి యే యితరమయిన యూహ రానే రాదు. వా డంత స్తబ్ధుడై పోయెను.

ఒలువఁబడిన వస్త్రములు పర్వతోపమానములై యుండెను. ఎందు కున్నవి? కారణ మేమి? ఇది ప్రకృతిలో జరుగు పనికాదు ఈ మహాశ్చర్యమునకు హేతువేమో తాను చెప్పడు. చెప్పినచో వ్యాంగ్యవైభవ మంతయు నశించిపోవును. ఆయన చెప్పనే లేదు. ఈ గ్రంథము చదువు చుండఁగా నన్నయ్యగారు దీనిని చెప్పలేదని యెవ్వరు ననుకొనరు. చెప్పలేదని తెలిసికొనుటకు ప్రయత్నము కావలసి యున్నది. ఇక్కడ చెప్పుట మిక్కిలి యనవసరము. సర్వమానవులకు, సర్వపాఠకులకు ద్రౌపది తత్కాలమున శ్రీకృష్ణధ్యానము చేసెను. పరమేశ్వరు డామె నిట్లనుగ్రహించె నని తెలియును. ఇది యందరిమనస్సులలో నుండి యున్న భావమే. నన్నయ్యగారికంటె నే త్రసరేణుమాత్ర మయిన దక్కువ యయిన కవి యయినచో ద్రౌపదిచేత కృష్ణస్తోత్రము చేయించి యుండును.

ఇది భగవన్మహిమ యని విస్తరముగా నుపన్యసించి యుండును. అట్లు చేసినచో రసభంగ మాయి తీరును. ఒక మహాదుర్వ్యవసాయము జరుగు చున్నది. పాఠకుని మనస్సు దానియందు లగ్నమయి యున్నది. లౌకికపరిస్థితులు రస హేతువు లయినట్లు దైవికవిషయములు గావు. కావ్య ప్రపంచమున భక్త్యాదుల ప్రసక్తి తక్కువ. పరమేశ్వర మహిమాభివర్ణనము, తన్మహిమాజనిత మహాశ్చర్యములు పఠిత యొక్క మనస్సును వ్యభిచారి సాత్త్వికాది భావములనుండి మరలించి భగవంతునిగూర్చి యూహింపఁ జేయును. అపుడు కావ్యత్వము నశించును. కావ్యము చర్వణశీల మయినది. భక్తి తద్భిన్నమయిన మననశీల మయినది. కావ్యార్థ మననమునకు, భగవత్సంబంధ మయిన మననమునకు భేద మున్నది. కావ్యార్థమననము ; రస హేతువు. భగవత్సంబంధ మయిన మననము వైరాగ్యహేతువు.

ఈ సందర్భమున భక్తికిగూడ రసత్వ పట్టాభిషేకము చేయవచ్చు ననుకొందరు లాక్షణికుల ప్రసక్తిని నే నెత్తుట లేదు. నన్నయ్యగారు దానికి వ్యతిరేకులని తెలియుచున్నది. ఇదియుగాక నన్నయ్యగారిచట శ్రీకృష్ణదేవుని ప్రసక్తి మరి యొక దృష్టితోగూడ వదలి యుండవచ్చును. అది రసమే కావచ్చును. అయిననో నీ ద్రౌపది వస్త్రాపహారణ సందర్భమున నున్న రసభావమున కది యంగమగునా? భక్తి యెప్పుడును దక్కిన రసములను విరచును. ఒకవేళ నది రసమయి నచో దానినిగూర్చి ప్రస్తావించినంతనే యది రాజయి

కూర్చుండి ప్రధానరసమును సేవకుని జేయును. భక్తి యెప్పుడు నంగముకాదు. అది యంగిగా భాసించును. భాసించినచో ప్రధానరసము భంగమగును. ఈ రసవిషయము నిట్లు వదలి వస్త్రాపహరణ సందర్భమున రసభంగము జరుగం బోవుట యుండలి యౌచిత్యమును విచారింతము.

వివస్త్రత్వము పేరు నగ్నత్వముగా నాధునిక ప్రపంచమున సమృద్ధిగా ప్రచారము జరిగియున్నది. ఈ నగ్నత్వమన నేమి? అచ్చముగా వివస్త్రత్వమే నగ్నత్వమా? శరీరాంచలములు కనిపించుటయు నగ్నత్వమే. పెనుగాలికి వసనము తొలఁగినచో లోకులు పరిహసింతురు. పాశ్చాత్య స్త్రీలు కొందరు నగ్నస్పృత్యముని చేయుదురట. అపుడు వారు నిజముగా నగ్నలుకారు. శరీరవర్ణమువంటి వర్ణముగలిగిన దుస్తులొడలి కంటుకొనినవి ధరింతురట. మరియింక నగ్నత్వమేమి? ఊరు, కటి జఘన ప్రదేశములు వివస్త్రముగా గన్పించుటయే నగ్నత్వమా? శరీరాంచల రేఖలు కన్పించుట నగ్నత్వమా? శరీరాంచల రేఖలు కన్పించుట నగ్నత్వము. అట్లు కన్పించునట్లు వస్త్రములు ధరించుట యనాగరకత. అందుకని యొడలి నంటుకొనులాగున ధరించుట యనాగరకత, అది యొకవిధమయిన యనాగరకత. ఆధునిక పాశ్చాత్య స్త్రీల దుస్తులు శరీరాంచల రేఖలు తెలియచేయునట్లుండును. ఇది యొక విధమయిన నగ్నత. అందుచే ననాగరత. భారత దేశమునందలి స్త్రీ పురుషులు ధరించు దుస్తులు కుచ్చెళ్ళతో,

ముడుతలతోఁ గటిప్రదేశాలను సుపరామృష్టముగ గోపనము చేయును.

ఈ పై పద్యమున "మున్నపనీతమయిన తద్వస్త్రమ్ము నట్టి వలువ లలితాంగి జఘనమండలమున బాయక యొప్పు చున్న" యని నన్నయ్యగారు వ్రాసిరి. ఇదివర కొలువఁబడిన యా చీరవంటి చీర యామె జఘనమండలమున బాయక ప్రకాశించుచుండెను. గాలిచేత దొలఁగి మరల పిహితమయిన యెడములో లిప్తకంటెఁ దక్కువకాలమునగూడ పరిహాసము జరుగుచున్నది. అంత యెడముకూడ లేదు. దుశ్శాసనుడు చీరలాగెను. ఈ చీరలాగబడకముందే యచట వేరొక చీర యుండెను. మానభంగ మేమియు జరుగలేదని యర్థము. ఇది యింతకంటె నధికముగా నున్నది. ఏ చీర యొలువఁబడెనో యా చీరవంటిదే మరియొక డచట నుండెను. అచట నున్న చీర మరియొక విధమయిన చీర యయినచో నీ చీర తొలగింప బడుట, మరియొక చీర వచ్చుట యన్న వ్యవధానము మనసులో నయిన గలుగును. ఇచట నదికూడ లేదు.

ఇచట జఘనమండల మనుటచేత జఘనమే కాదు; కటిప్రదేశాదులకుగూడ నిది యుపలక్షక మయిన శబ్దము. ద్రౌపదీ మానభంగ మనునది కించిత్తయినను జరుగలేదు. చూచుచున్న వారి కా యూహాయే కలుగలేదు. దుశ్శాసను డామె చీర యొలిచినట్లే లేదు. గాలిలో చేతు లాడించి నట్లున్నవి. ఒక్కటియే భేదము. అతని చేతు లాడినప్పుడెల్ల నతని చేతిలో నొక క్రొత్తచీర కన్పించు చుండెను. అది

ద్రౌపది శరీరముమీఁదనుండి లాగినట్లు గన్పించు చుండెను. ఇది దీని పరమార్థము.

ఈ మహారహస్యము నన్నయ్యగారు సాధించుట కేమి చేసెను? "మున్నపసీగ మయిన తద్వస్త్రమ్ము నట్టి వలువ లలితాంగి జఘన మండలమున బాయక" యన్న నాలు మాటలచేత నీ మహార్థ మంతయుఁ బుట్టుచున్నది. నన్నయ్య గారు నగ్నత్వమనగా విచారణ చేసినాడు. ఆ నగ్నత్వ మే యంశమునందును రేఖామాత్రముగ నయిన పట్టకుండ నీ మాటల నుపయోగించెను.

మఱియొక విశేషము. ద్రౌపదీ మానభంగము చేయ సమకట్టిన దుశ్శాసనుని జూచి భీముడు చేసిన ప్రతిజ్ఞ యిది.

"కురువృద్ధుల్ గురువృద్ధబాంధవుల నేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లుచేసిన ఖలుఁ దుశ్శాసనుఁ లోకభీ
కరలీలఁ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిఁ

మఱియు దుర్యోధనుడు ద్రౌపదిని తన యూరు తలము నెక్కఁగా రమ్మని సంజ్ఞ చేసినపుడు.___

"ధారుణి రాజ్యసంపద మదంబున కోమలి కృష్ణజూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యద్దురాత్ము దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరు చేయుదు సుయోధను నుగ్ర రణాంతరంబునన్

ఈ రెండు ప్రతిజ్ఞలు విచిత్రముగా నున్నవి. వీని రొమ్ము నెత్తురు త్రావెదను. వీని తొడలు విరుగఁ గొట్టెదను. ఇంతవరకు న్యాయమే. ఎప్పుడు? మొదటి పద్యములో 'అనిన్'—అనగా యుద్ధము నందనియు, రెండవ పద్యములో 'ఉగ్రరణాంతరంబునన్' అనియు నున్నది. ఈ యుద్ధ ప్రసక్తి యెట్లు? పాండవులు కౌరవులకు దాసులయిరి. ఈ ప్రతిజ్ఞలు రెండును చేసినప్పుడు యుద్ధప్రసక్తిలేదు యుద్ధము జరుగుటకే వీలులేదు. వారి రాజ్య మొకుచుకొన్నారు జీవితాంతము పాండవులు దాసులుగా నుండవలసినదే. రెండవసారి ద్యూతమునకు నరణ్యాజ్ఞాతవాసముల నిబంధన యున్నదిగాని మొదటి జూదమునకు లేదు. అప్పుడీయుద్ధము, తొడలు విరుగఁగొట్టుట వ్యర్థప్రలాపముగాఁ గన్పించుచున్నవి. మొదటిప్రతిజ్ఞ చేసిన తర్వాత "అతని యతిమానుషంబయిన మహావ్యవసాయంబున కద్భుతంబంది దిక్కులు సూడక దిక్ప్రబద్ధముఖరితముఖు లగుచు సభాజనులు" ఉండిరి.

రెండవసారి ప్రతిజ్ఞ చేసినతర్వాత భీముడు "సర్వజన భయానక క్రోధావేశ వివశుండై యాయుధమ్ము లున్నవలనికి దృష్టులు నలుపుచు నగ్రజుమొగంబు సూచుచున్న భీమ సేనుని" అని యున్నది. మొదటి దెట్లయినను రెండవ ప్రతిజ్ఞ లోని వైయర్థ్యము భీమునియొక్క క్రోధావేశ వివశత్వమని నన్నయ్యగారే చెప్పిరి.

నన్నయ్యగారి యర్థములా మన మెంతో విచారించినను వాని నాయన మనకంటె పూర్వమే విచారించి యుంచును.

భారతకథలో నున్న సర్వరహస్యములు పరిస్థితులలో నున్న మర్మములు నన్నయ్యగా రాలోచించిరియే యెచ్చట నే రహస్యము సిక్షేపింపఁబడి యున్నదియో తెలిసికొనియే వ్రాయును.

ఇది వట్టి కోపావేశ మయినను జరిగిన పరిస్థితినిబట్టి వారికి వీరికి యుద్ధము కాక తప్పదను నొక మహాశంక - నిశ్చయప్రాయ మైనది సర్వజనుల హృదయాంతరాళముల యందుండియే యున్నది. ప్రత్యేకముగా భీముడు కౌరవులతో మరల పొత్తు కలిగించుకొనుటకు నిష్టపడడు. అట్టి భీముని మాటలివి. అందుకనియే మరల ధృతరాష్ట్రుడు రాజ్యము నిచ్చివేయగా "రాజ్య సంప్రాప్తి పాండవసత్తములకు సతి కారణంబున ధృత మయ్యెనను నింతకంటెను కష్టమ్ము కలదె యొండు" అని "శత్రునరుల నుగ్రసంగరమ్మున జంపి కుతల రాజ్య మెల్ల గొందు ననుచు మృగ మధ్యంబున నున్న సింహంబునుంబోలె ననుజమధ్యంబున నున్న" అని వ్రాయ బడెను. సేవకులయి యున్న వీరికి యుద్ధముసేయు నర్హత లేదు. ధర్మరాజతనిని వారించెను. మొదటిసారి ప్రతిజ్ఞలు చేసినపుడు భీముడు యుద్ధమున కింత సిద్ధపడలేదు. దుర్యోధనుని తొడలు విరుగఁ గొట్టెదనని యాయుధమ్ములున్నవలనికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబు చూచెను. అప్పుడు భీష్మ విదుర ద్రోణాదు లాపిరి. మొదటిసారి ప్రతిజ్ఞ చేసి యూరకుండెను. ధృతరాష్ట్రుడు రాజ్యమిచ్చినతర్వాత కౌరవులను చంపుదు నని వాచ్యముగా చెప్పెను. ఈ మూఁడు భేదములు చమత్కారముగా నున్నవి. మనకు చూచినచో

ద్రౌపది వస్త్రము లొలుచుట మిక్కిలి దుఃఖకరము. తన తొడమీఁదఁ గూర్చుండ రమ్మనుట దానికంటె తక్కువది. ద్రౌపదివలన రాజ్యము మరల వచ్చుట తత్పూర్వముగల రెంటికంటె తక్కువది. కాని భీము డొకదానికంటె నొక దానికి నుత్తరోత్తర మధికాధిక కోపము పొందుచున్నట్లు కాన్పించు చున్నాడు. అతని కోప ముత్తరోత్తర బలీయ మని చెప్పుటకు గారణము. మొదటిసారి ప్రతిజ్ఞ చేసి యూర కుండెను. రెండవ ప్రతిజ్ఞ చేసి యాయుధాగారమువంకఁ జూచెను. మూఁడవసారి వాచ్యముగా చెప్పి వెంటనే యుద్ధముచేయుటకు బయలుదేరఁ బోవుచుండెను. ఇవి కార ణములు. మొదటిసారి తాను ప్రతిజ్ఞ చేసెనుగాని వెంటనే కౌరవులను చంపు నూహ వెలిపరుచనే లేదు. అప్పు డతని కా యూహ లేదు. ఆ యూహ రెండవసారి కలిగెను. దానిని భీష్మ ద్రోణ విదురులు వారించిన మాత్రతో సరిపోయి నది. మూఁడవది అన్నగారే వారించెను. చేయి వలదన్నట్లు పైకెత్తెను. ధర్మరాజు చేసిన దింతమాత్రమే. తొడలు విరుగ గొట్టెద నన్నప్పు డన్నగారి యంగీకార మున్నదో లేదో యని తెలిసికొనుట కతనివంక చూచుచుండెను. శత్రువు లంతటి యపకృతి చేసినప్పుడు, తనకంతటికోపము వచ్చినప్పు డన్నగారంగీకరించునా లేదా యన్న విచారణ విచిత్రముగా నున్నది. ఆ యన్న యదుపెట్టిదో? అతని నాయకత్వ మెట్టిదో? ఈ తమ్ముల యనుయాయిత్వ మెట్టిదో? మనసుపట్టని యొక వైషమ్యపాధ్యాయిక వ్యంగ్యమగు చున్నది.

ఇప్పుడీ మూఁడుపరిస్థితులలో నుత్తరోత్తర మధికాధిక మగుటకు కారణమేమి? ఇందులోఁ ధర్మసూక్ష్మము విచారించినచో నధికులకు తెలియదు. ఒక భావమునకు, నొక కార్యమునకు నాటి వెల వేరు. నేఁడు మనము కట్టెడు వెల వేరు. ద్రౌపదీ వస్త్రాపహరణము నట్టిపరాభవ దృష్టితోఁ జేయఁబడినది. పాండవులకు పరాభవము చేయవలయుననియే దుర్యోధనుని యుద్దేశ్యము. ఒకదృష్టితోఁ జూచిన నది యధర్మముగాదు. వీరి కవమానముచేయుట. తల గొరిగించి గాడిదమీఁద నూరేగించినచో నది పట్టుకోరాని యవమానము. అపరాభవాగ్నిచేత నివాత్మహత్య చేసికొనవచ్చును. ద్రౌపది చీరలొలుచుట నిజముగా విచారించినచో నాగరకభావమునకు ద్రోహము చేయుటకాని తక్కిన యేభావము ద్రోహము చేయఁబడలేదు. స్వజనులు వస్త్రములు ధరించుచున్నారు. దేనికి? ఒక సభ్యత లోకమున వృద్ధిబొంది యా సభ్యతాభావము మర్మ ప్రదేశగోపనముగా వృద్ధిపొందినది. ఒక యోగి లేదా యోగిని దిగంబరులై గ్రామములవెంట సంచరించుట చూచుచున్నాము. ఎవరిదారిని వారు తలలువంచుకొని పోవుదురు. ఉన్మత్తుఁడు వివస్త్రుఁడై కనిపించును. మన యిండ్లలో మహా వ్యాధిగ్రస్తులు గుడ్డతొలగినది తెలియక పడియుందురు. ఈ యేపరిస్థితులయందు నవమానము జరుగుటలేదు. బుద్ధిపూర్వకముగా నొకవ్యక్తిని వివస్త్రముగా చేయుటయం దవమాన మున్నది. అవమానమునకు మించిన యేభావమును లేదు. పైగా నీ చీరలొలిపించుటయందు పాండవులను గౌరవించుట యున్నది. మీరు మహాపౌరుషవంతులుగదా! బలశాలురుగదా! సభలో

మీకీ పరాభవము చేసెదము. మీరేమి చేసెదరో చేయుడన్నట్లున్నది. ఈ కార్యమువలన పాండవులకు తాత్కాలిక పరాభవమేగాని, వారి వ్యక్తిగౌరవమునకు భంగము వాటిల్లుటయేగాని మరి యేమియు లేదు రెండవది చీరకంటె పెద్దది. తమ భార్యను దుర్యోధనుడు తొడమీఁద కూర్చుండుమనెను. పూర్వము చేసిన యవమానము జంతుభావ సంబంధ మయినది. ఇది స్త్రీపురుష భావసంబంధ మయినది పారలౌకిక మయినది. మొదటి పరాభవ మిహసంబంధమై దేశ సంబంధ మయినది. ఈపరాభవము భార్యాభర్తృభావసంబంధ మయి పౌరుషముతోఁ గూడిన శృంగారభావ సంబంధమయి సంతానమును తగులుచుండుటచేత నముత్రభావ విషయమయినది. ఈ రెంటియం దింతభేద మున్నది. మొదటిది జంతుత్వమాత్ర సంబంధమయినది; రెండవది నరత్వ సంబంధమయినది.

మూఁడవది స్త్రీసంబంధమయిన మరల రాజ్యము సమకూరుట వట్టి ధర్మవిషయము. పాండవులు ధర్మనిష్ఠులు ధర్మముమీఁద నాధారపడి మోక్షమున్నది. తా నార్జించిన విత్తము త్తమము, పిత్రార్జితము మధ్యమము, భార్యావిత్త మధమము, స్త్రీవిత్త మధమాధమము. అందుచేత భీముడు మిక్కిలియు కోపించెను. ధర్మరాజు వారించెను.

ద్రౌపదీ సంపాదితమయిన రాజ్యానుభూతియందు ధర్మరాజునకు మాత్ర మీ యధమాధమ బుద్ధి లేదా? ఎందుకు వారించెను? ధర్మజునియొక్క ధర్మస్వరూపము చాలనిగూఢ మయినది. ధృతరాష్ట్రు డిచ్చుటచేత రాజ్య

మిప్పుడు వచ్చినది. పాండవులకు మరల స్వాతంత్ర్యము వచ్చినది. తత్పూర్వమునందు తమమీద తమకు, తమ యాయుధములమీద తమకు తమ వర్మ వరూథమ్ములమీద తమకు నధికారము లేదు. అందుకనియే ద్రౌపది యడిగిన రెండవ వరము.

"నెమ్మిని ధర్మజు నలువురు
తమ్ములు తమ యాయుధములు తమ వర్మ వరూ
థమ్ములయుతోడ సకల హి
తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్."

అని యున్నది. అందుచేత నిప్పటి భీముని పౌరుషము, ఆయుధప్రయోగము చేయగల సామర్థ్యముకూడ స్త్రీవిత్తము క్రింద లెక్కగట్టబడవలయును. రాజ్యసంపద ననుభవించుటకు స్త్రీవిత్తదోష మెంతె యున్నదో తమ పరాక్రమము ప్రకటించుటకు స్త్రీ ప్రసాదకృత సామర్థ్య మను దోస మంతియే యున్నది. ఇందుచేత ధర్మజుడు కరతలమ్మున వారించెను. తొడలు విరుగగొట్టెద నన్నప్పుడు పరాక్రమము ప్రదర్శించుటకు వీలే లేదు. అందుచేత ధర్మరాజతనివంక నే చూడలేదు. ఇది నన్నయ్యగారి రచనాంతర్నిగూఢ, మహార్థములు.

దుర్యోధనుని తొడలు విరుగఁగొట్టెద నన్నప్పుడు భీముఁ డాయుధములున్న వలనకి దృష్టులు నలుపుచుండె నని వ్రాయఁబడియున్నది. ఈ యాయుధము లున్న దిక్కేది? వీ రెచ్చట నుండిరి? ఆయుధము లెచట నుంచఁబడినవి?

దీనినిగూర్చి కొంత విచారించినచో నాటి యాచారము తెల్లమగుచు. రాజసభలోనికి సాయుధులై యెవ్వరును బోరాదు. సభలో ప్రవేశింపఁబోవునపుడు ప్రస్తుతకాలమున పాదరక్షలు, ఛత్రములు వెలినదలివచ్చినట్లు, పాశ్చాత్యులు పైకోట్లు వాకిలివద్దనున్న సేవకులపరముగా నప్పగించి వచ్చినట్లు, సభలోని కాయుధములు తేరాదు. సభలో ప్రవేశించు నందరును తమ తమ యాయుధము లొకచోట బెట్టి రావలయును. ఆ స్థలము సభలోననే యొక మూల లేదా యొక ప్రత్యేక ప్రదేశము. "ఆయుధము లున్న వలసికి" నని వ్రాయఁబడినది కాని "యాయుధాగారము వంక" నని లేదు. సభలోనుంచి వెడలిపోవునపుడు వారు తమ తమ యాయుధములను తీసికొని పోవుదురు.

# ఆయన అనంతముఖ శిల్పము

నన్నయ్యగారి రచనాపద్ధతి గ్రహించుటకు సూచనగా నుండుటకు నే నింతవరకు ప్రయత్నము జేసితిని. భావుకులకు నేను వ్రాసిన దక్కరలేదు. అ భావుకులకు నా వ్రాసిన దానితో ప్రయోజనము లేదు. తెలిసికొందమను నభిలాషగల వారికొఱకుఁ జేసిన ప్రయత్నమిది. ఈ రీతిగా గ్రంథమంతయు నెచ్చ మెచ్చుట నే యే వైశిష్ట్యము నాకుఁ దోఁచినదో యది యంతయు వ్యాసముల రూపమున వ్రాయుట యసంభవము. గ్రంథవిస్తరమును నే నెంతసేపు వ్రాసినను నన్నయ్యగారి కథాశిల్పమునుగూర్చియే వ్రాసితిని. ఈ కథాశిల్పమునకు వన్నెలు తెచ్చు మరియు ననేకములయిన చమత్కారములు భాషావిషయములును వందలకొలది గలవు. అన్నిటిని వ్రాయు టకు దావులేదు

అందుచేత నాయనశిల్పముయొక్క యనంతముఖత్వము నీ వ్యాసమునందును, భాషావిషయ మింకొక వ్యాసము నందును సూచనగా మాత్రమే వ్రాయగల్గుదునుగాన నట్లే వ్రాసి ప్రస్తుతము విరమింతును. నిజముగా నన్నయ్యగారి భారతమునకు వ్యాఖ్యానము వ్రాసినగాని చెప్పవలచుకొన్న దంతయు చెప్పుటకు వీలులేదు. ప్రస్తుతము కొన్ని విషయ ములు వివరింతును.

నన్నయ్యగారి మార్గము మిక్కిలి విచిత్రమయినది. అన్యకవులయందు గానరానిది.

దుష్యంతుడు శకుంతలను జూచెను. "కచ్చుఱ వేట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచిపోవఁగా వచ్చితి మెందుఁ బోయిరొకొ వారసినన్" అన్నమాట యిది. "మేము వారిని జూచిపోవుటకు వచ్చినారము. వారెచ్చటికి వెళ్ళిరో" యని ప్రశ్న. ఆమెను సంబోధించలేదు. ఆమెను జూచియే అడిగినాడు.

ఆమె యాశ్రమకన్యక. ప్రత్యక్షముగాఁ బ్రశ్నించుట మర్యాద కాదేమో? ఆమె దుష్యంతు నుండు మనెను. రాజు సంతోషించెను. ఆమె సౌందర్యమున కచ్చెరువందెను. నీ విచ్చటి కెందుకు వచ్చితివనెను. ఆమె తాను కణ్వుని కూఁతుర ననెను. అప్పుడు రాజు "ఇది మునికన్యయేని మరి యేలొకొ యీ లలితాంగియందు నా హృదయము తద్దయుందగిలె నిప్పలు కింకను నమ్మనేర నయ్యెద" అని సందియంపడి ఆమెను దన జన్మవృత్తాంత మడిగెను. ఆమె తన జన్మవృత్తాంతము చెప్పెను. అప్పుడు రాజు "ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహావృత్తి నున్న నా హృదయము రాజపుత్రియని యిక్కమలాక్షి నిజాభిజాత్య సంపద నెరిగించినన్ మదన బాణ పరంపర కిప్పుడుండ నాస్పదమయి సంచరించె" అని యనుకొనెను. ఈ రెండు పద్యము లొక్కరీతిగానే యారంభింపఁబడెను. సంశయము, సంశయనివృత్తియు నేక

స్థానమునందు జరుగుట యీ యారంభ సామ్యములోని వ్యంగ్యము.

నన్నయ్యగారి భావము లనంత జాతులు గలవిగా నుండును. భావములలో నింత జాతి వైవిధ్యము చాల యరుదుగా నుండును. ఎంత గొప్పకవి యయినను వాని భావమీ పద్ధతిగా నడచునని గ్రహింపవచ్చును. కాళిదాస, భవభూతి, తిక్కన్నాది సర్వమహాకవులయందును వారి భావము యొక్కజాతి విస్పష్టముగాఁ దెలియుచుండును. నన్నయ్యగారి యెడల నట్లుగాదు. ఎప్పటికప్పుడొక్కొక్క నూత్నమయిన వైచిత్రి కన్పించుచుండును.

కుంతికి గర్ణుఁడుదయించెను. "ఈ బాలు నెత్తికొని యింటికి జన్న నన్నుఁ నా బంధు లందరు మనంబున నేమి నారొక్కో బాలు సూర్యనిభు నిట్టుల డించి పోవంగా బుద్ధి పుట్టునని కన్యమనంబు లోనఁ వందురి వగచుచున్న" — ఈ వగపు యొక్క లక్షణమెట్టిది? ఆ బాలునచ్చట డించిపోవగా బుద్ధిపుట్టుచున్నదని వగపు. అతని నచట డించిపోవుట కిష్టము లేకపోవుట. ఇష్టము లేకపోవుటకాదు. ఆ రీతిగా బుద్ధి పుట్టుచున్నందుకు వగపు. అట్టియూహ యేలవచ్చెనని వగపు. ఇది యొక విలక్షణమయిన భావము.

బ్రహ్మలోకమునకుఁ బోవుచున్న బ్రాహ్మణులతో ననపత్యుఁడయిన పాండురాజు భార్యాద్వయసహితుండయి చనుచున్న ఋషు లిట్లనిరి.

"వీర లతి లలితమ్మృదు లా
కారలు గిరివిషమగహన గహ్వరముల రా
నేరరు కావున నట చను
దేరకు నలువుండ యివియు దేవపథంబుల్.

"అనిన విని నరుల కక్కడ
చనబోలమి యెరిగి పాండు జనపాలకు డి
ట్లనియెను స్వర్గద్వారం
బనపత్యులు కాన నోపరటె మునులయ్యా."

ఇవి రెండుపద్యములు. మునులేమని రనగా? "ఈకుంతీ మాద్రులు మెత్తని శరీరములుగలవారు, వీరు రాలేరు. అగుడు-ఇవియును దేవపథము" లని. "ఇవి" మీదనున్న 'యు' అన్న సముచ్చయములోని యర్థము. పాండురాజు గ్రహించెను. తా మనపత్యులుగాన దేవపథములకుఁ బోలేరని ఋషుల తాత్పర్య మయినట్లు ఇది యెట్లు గ్రహించెను? ఋషులన్న మాటలలోని మెత్తదనము, జాలి, ధర్మము, సర్వమును వారి ముఖలక్షణముల చేత, మాటలయందలి కాకువుచేత గ్రహించి యుండును

ఇట్టిది మఱియొక విచిత్రమయిన రచన.

ఆయన యొక్కొక్క మాటతో నొక్కొక్క మహా విషయమును వ్యంగ్యభూతముగాఁ జేయును. ఏకచక్రపురంబున బాండవులు నివసించుచున్న గృహమున నార్తధ్వని యెగసిన గుంతి జాలిబడి భీమునితో వారి కుపకారము చేయుమనెను.

అసిన భీమసేనుండిట్లనియె. "ఎరిగి నాకుఁ జెప్పు మిదియేమి యెవ్వరివలన నింతయయ్యె" నెలుగిలయినది. ఇందు భీముడు తల్లిని 'నాకుఁ జెప్పుము' అని యేకవచనమే ప్రయోగించెను. కాని తరువాత ధర్మరాజు వచ్చి తల్లితో "వగనుతకీర్తి యీయ యసిలవంగను డెవ్వరితోడ నేసి భీకరసమరంబు సేయ సమకట్టిన యట్లు మహానురాగ నిర్భరమున నున్న వా డితని భావము సూడగ వేరు వీని సుస్థిరబలు మీరు పంచితిరో నిచ్చెరదాన యుపక్రమించెనో" యనియు, "భీమసేనుడు మీకు విడువందగియెడు కొడుకే" అనియు, కుంతిని బహువచన శబ్దములతో 'మీరు'ని మీకు'ని గౌరవించుచున్నాడు. పైన ద్రుపదునితో దమ్ము గురించి చెప్పుకొనునపుడు 'వీరు కుంతీ మహాదేవు' లని చెప్పెను. ఆ భీమునకు దల్లి యందంత చనవు. ఈ ధర్మరాజునకు దల్లియం దింత గౌరవము. ఇది చమత్కారమయిన సృష్టి. ఏ కావ్యకవులును చేయనిది ఇది నాటకకవులు చేసెడి శిల్పము. ద్యూతములో దురోధనుడు ధర్మరాజు "వనఘు" యని మాత్రమే యెప్పుడును పిలుచుట వంటిది. భీముడు తిండిపోతు. (నిందార్థకముగా గాదు) తల్లి యెప్పుడు నతని కడుపుచూచి పెట్టును. ఈ చనవు వేరు. ధర్మరాజుయొక్క పరిచయము వేరు. ధర్మరాజుయొక్క స్వభావమే వేరు. ఈ ధర్మరాజును నన్నయ్యగారు తీర్చిన తీర్పే వేరు. తల్లి నిట్లు ధర్మరాజు గౌరవించుట యనునది ధర్మజుని పాత్రపోషణము జాగ్రత్తగా జూచినగాని తెలియదు.

ఇంక ఈ కుంతి యెటువంటిది?

ద్రౌపదీ స్వయంవర విషయము ద్రుపదపురమ్మునుండి యొక బ్రాహ్మణుడు వచ్చి యేకచక్రమున నున్న పాండవులతోఁ జెప్పెను. ద్రౌపది యర్జునునకొఱకే సముద్భవించె నసియుఁ జెప్పెను. 'దానివిని పాండు నందను లందులకుం బోవనున్న కొడుకుల యభిప్రాయం బెఱింగి కుంతి యిట్లనియె

"కడుఁబెద్ద కాల ముండితి
మొదలబడి యిందెంత కాలమున్నను మన క
య్యెడు లాభ మేమి మఱి యె
ప్పుడు నుచితమె యొరుల యిండ్ల పొత్తున నుండన్?

దక్షిణ పాంచాలంబు నగరంబు రమ్యం బనియుఁ బాంచాలపతి పరమ ధార్మికుం డనియును వింటిమి. మఱి యట్లుంగాక—

"అడుగకయు విప్రవరులకు
నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం
గుడువఁగఁ బెట్టుదు రెప్పుడు
గడు హృద్యము లయిన మోదకంబులతోడన్"

అందులకుం బోవుద మనినం గొడుకు లెల్ల వల్లె యని మీ పంచిన విధంబ చేయం గలవార మని యొడంబడిరి కొడుకుల కెట్లును ద్రుపదపురమునకుఁ బోవలయు నని యున్నది. వారు పోవుటకు సిద్ధముగా నున్నారు. అప్పుడు కుంతి చెప్పిన మాట లివి.

అసలుసంగతి వారు చెప్పరు. ఆమె చెప్పదు. మనసు లెరిగి యొకరినొక రనుసరింతురు. ఆ కుంతియొక్క రాచరికము కొడుకుల మన సెరిగి వారి యూహాయే తన యూహా యని చెప్పుటలోని నేర్పు. కుంతి యెంత నీతిమతియో తెలియు చున్నది.

“కొడుకులెల్ల నట్లెయును”– ఇచట ‘నెల్ల’ యనుశబ్దము పరమార్థము. కొడుకు లందరొక్కసారి యొప్పుకొనినట్లు. “మీ పంచినవిధంబ. యనుటలో ‘మీ’యన్న బహువచనము ఐదుగురును కలిసినపుడు తల్లిని గౌరవించుటయే. విడి విడిగా నున్నప్పుడు భీమనకుల సహదేవులు తల్లిని చనవుగా నీ వందురు.

మఱియొక విషయము. ద్రుపదపురికిఁ బోవునప్పు డంగారపర్ణు నర్జునుడు జయించెను. ఓడిన గంధర్వుడు పాండవులతో స్నేహము సేయుకొను, మీకు గంధర్వహయంబులు నూరేసి నూరేసి యిచ్చెద ననెను. అర్జునుడు వెంటనే స్నేహమునకు నెట్లొప్పుకొనును? ఇంతకుముందే విరోధముతో దమతో యుద్ధము చేసె నాయెను. అర్జును డన్నాడు గదా— “నీతోడ బద్ధసఖ్యంబు సేసెద. నీ గుఱ్ఱములు నాకు వలదు. మరి నీవెందుకు మమ్ముదరి పలికితి” వని. గంధర్వుడు కారణము చెప్పెను. అర్జునుడు గంధర్వునివలన తపతికథ, వసిష్ఠునికథ చెప్పించుకొనెను. చివరకు “మాకు నతి ప్రియుండవు సమస్త విదుండవు” అని మమ్మెవ్వనిని బురోహితునిగా దీసికొమ్మందువో చెప్పు మనెను. మొదటి తర్జనకు జివరి

'మాకు నతి ప్రియుండ' వనుటకు నడుమ నర్జునుడు రెండు ప్రశ్నలు వేసెను. ఇదియంతయు దమతో దెలియక యుద్ధము చేసిన యంగారపర్ణుని యెడల సహజముగా నుండు వైముఖ్యము తొలగిన క్రమము సూచించుటకు. ఇది నూటయిరువది పద్యములమీది కథ. ఇది యొక విచిత్రమయిన కథాకథన శిల్పము. ఇట్టి శిల్పము సంస్కృత నాటకకర్తలలో భాస మహాకవియందు గన్పించుచున్నది. తక్కినచోట్ల గన్పించుట లేదు. ఇంకొకచోట నొక్క యత్నముతో నస్ఫుతమయిన భావమును వెల్లడిచేయును. నన్నయ్యగారియం దిట్టి వనేక ములు గలవు. ఉదాహరణ కొక్కటి చూపించెదను. 'వైహాయసంబున వరమత్స్యయంత్రంబు సవిల్లు మోపెట్టి యెవ్వ డేనుశరముల నేయు నక్రమమున నతడ నాతనయకు వరుడగు ధర్మయుక్తి" నని చాటించిన నా ఘోషణము విని రాజు లెల్ల వచ్చిరి. ఈ పద్యములో 'సవిల్లు' అని యున్నది. ఈ విల్లనగా నే విల్లు? మత్స్యయంత్రమువద్ద నుంచిన విల్లు. "ఈ" శబ్దముచేత నానా దేశములయందు ఘోషణము చేయుటకు వెళ్ళినవారు నిర్దేశించలేరుగదా? ఎక్కడనో యున్న వింటిని 'ఈ విల్ల'ని చెప్పుట యసంభవము.

కనుక ఘోషణము చేయుటకుఁ వెళ్ళినవారు పెద్ద బండిమీద నాధనుస్సునుగూడ దీసికొని వెళ్ళిరని యర్థము. ఏలననగా నావిల్లంత పెద్దది. దాని వంచరాని తనము దానిని జూచిననే తెలియును. అందుచేత ప్రతివాడును రాడు. రాకూడదు.

మహాకవి తన రచన ననంతముఖములుగాఁ జేయును. నన్నయ్యగారు తన కావ్యమునందు భిన్నవృత్తములు వాడును. వృత్తము వాడినచోట నెల్ల నర్థమో భావమో విలక్షణముగా నుండవలయును. కథ మారుట, కథలో నొక ఘట్టముయొక్క ప్రత్యేకత మొదలయిన ప్రయోజనము లపేక్షించియే వృత్తమును మార్చును. లక్క యిల్లు తగులఁబడిపోయినది.

మధ్యాక్కర:

"పో\[వై]న భస్మంబు వాయదోఁచి యబ్బావిలో నడగి
యేవురు కొడుకులతోడ నందొక్క యింతి యత్యుగ్ర
పావక దగ్ధయై యున్న జూచి యప్పౌరులు దాని
భావించి కుంతియు సుతులు నని శోక పరవశు లగుచు"

ఇచట నీ మధ్యాక్కరను వాడుట వృత్తౌచిత్యము. ఈ యౌచిత్యము భిన్నవృత్తమగుట మాత్రముచేతనే సంపాదింపఁబడినది. పాండవులు చనిపోలేదు. చనిపోయిరని యందరు ననుకొనుటకు వీలయిన స్థితి. ఇదియొక విలక్షణమయిన పరిస్థితి. దానికి విభిన్నమయిన వృత్తము. నన్నయ్యగారి రచన యంతయు సర్వథా యిట్లేయుండును.

ఈ మధ్యాక్కరలో "అప్పౌరులు దాని భావించి" యన్నచోట 'దాని' యనఁగా దేనిని? అదియేది? అది ఒక్క యింతియా?

అయినచోఁ గుంతియు సుతులు నని భావించుట పొసగదు. అపుడు దాని గుంతియని భావించి వారు కొడుకులని

భావించవలయును. వాక్య మిట్లుండవలయును. వాక్య మిట్లు లేదు. 'దాని' అనఁగా నచ్చట నున్న పరిస్థితిని అని యర్థము. ఈ తచ్ఛబ్దము నన్నయ్యగారు సర్వవిభక్తులయం దిట్లు వాడును.

"అవిరళ సూర్యమండల సహస్రసముప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్యదా
నవ సుఁయక్షరాక్షసగణమ్ము కరమ్ము భయమ్ము నొందెనం
దనసియు దిర్దిగం దిరిగె నబ్ధి శిలోచ్చయ సంచయమ్ముతోన్"

ఈ పద్యములో "అందు" అనఁగా 'నా విషయమునం' దని యర్థము. అనఁగా నర్జునుని చేతిలోఁ బాశుపతాస్త్ర మున్న దనుటచేత స్పష్టమ్యైంత మయిన తచ్ఛబ్ద మిది.

పద్య ముదాహరించితినిగాన దీనియందలి మూఁడు విశేషములు చెప్పెదను. ధనంజయ ప్రవరుఁడు - ధనంజయ శబ్దధారులలో శ్రేష్ఠుఁడని యర్థము. ధనంజయుఁడనఁగా నగ్ని హోత్రుఁడు. ఆ పేరుగల ఋషు లుండవచ్చును. ఈ పే రర్జును నకు గలదు. వీ రందరిలో నర్జునుడే శ్రేష్ఠుఁడని యర్థము. కానిచో నామధేయునకు శ్రేష్ఠవాచకము పట్టదు.

పాశుపతాస్త్ర మర్జుని చేతిలో వెలుఁగుచున్నది యన్న వాక్యము తెలుఁగు నుడికారము. పాశుపతాస్త్రము అతని చేతిలో మంత్రము. అతని చేతిలో నుండదు. లోకములో "ఇది వాని చేతిలో పనిరా" యందుము. వానికి సాధ్యమయిన

కార్యమని వ్యంగ్యము. అతని చేతిలో పాశుపతాస్త్రము వెలుఁగు చున్న దనఁగా? పాశుపత మతని యధీనమం దున్న దని ధ్వని.

'గణమ్ము కరమ్ము భయమ్ము నొందె'' ఈ ద్విత్వ మకార త్రిరావృత్తి వారి భయ మెంత యధికముగానున్నదో ధ్వనింపఁ జేయుటకుఁ జేసిన రచనాశిల్పము.

వృత్తౌచిత్యమునకు మఱియొక యుదాహరణము చూపించెదను. పాండు రాజును 'కిందము' డన్న ముని ''నీవును ప్రియా సంగమంబయిన యప్పుడ పంచత్వం బొందెదు మని'' శపింపఁగా పాండురాజు వైరాగ్యము పొంది తన సర్వసంపదయు దానము చేసెను.

పృథ్వీవృత్తము:

''అమూల్య మణిభూషణమ్ములు గజాశ్వ బృందమ్ములుఁ
సమృద్ధ ధనధాన్య రాసులు ప్రశస్త గోవర్గముఁ
క్రమమ్మునను భూసురేశుల కగణ్య పుణ్యార్థియై
యమర్త్యనిభు డిచ్చె పాండువిభు డత్యుదారస్థితిఁ''.

ఈ వృత్తము భిన్నమగుటయేగాక మొదటి జగణము రెండవ సగణము, మూడవ జగణము, నాల్గవ సగణము తరువాత యలగల చేత దాని నడకలోనను ఇచటి యక్షర విన్యాసము చేతను నెంతో తెగదెంపుగాఁ జేసిన దానవైఖరి వైరాగ్య భావమంతయు ధ్వనించుచున్నది. శబ్ద బ్రహ్మ మనఁగా దెలిసినవాఁడు నన్నయ్య. భవభూతి, మురారి, నన్నయ్యలు ముగ్వురే శబ్ద బ్రహ్మ వేత్తలు.

శిబిచక్రవర్తి కథ చెప్పినపుడు ఇంద్రుడు నగ్నియు శిబిని మెచ్చి యిట్లనిరి. "నీస్థైర్య శౌర్యాది గుణంబు లనన్యసాధారణంబులు కావున నీకీర్తి సత్యంబయి 'శబ్ద బ్రహ్మంబు' గల యంతకాలంబును వర్తిల్లుచుండెడు ననిరి.

నన్నయ్యగారు శబ్దబ్రహ్మవేత్త. అట్టివానికే యిట్టి రచన సాధ్యమగును. రచనలో నింకొక చమత్కారమయిన శిల్పమును చూపించెదను.

నన్నయ్యగారి రచన ప్రవాహమువంటిది. పద్యము విరుగదు. అమృతధారగాఁ బోవుచుండును. ఇట్లు పోవుచున్న పద్యము తా నొక్కొక్క చోట విరుగును. ఎందుకు విరువబడుననగా, నచ్చటి భావము రచనచేత ధ్వనింపఁజేయుటకు. సర్వథా విరుగుచునే పోవు కవిత్వమునందీ శిల్పము చేయుటకు సాధ్యము కానది, చూడరానిది.

ధర్మరాజు తామయిదుగురు ద్రౌపదిని వివాహము చేసికొందుమని ద్రుపదునితోఁ జెప్పిరు. ఆయన యేమనుటకును వీలులేక పోయెను. ఈసంగతిని ద్రుపదుడు వ్యాసమహర్షితో నిట్లనెను.

"నన పలుకు లోక మెల్లను
గాని యాడఁదగిన లోకగురుఁడీ యమనం
దనుఁడే యేవురమును నీ
తనుమధ్య వివాహ మయ్యెద మని పలికెడుఁ"

ఈ పద్యము చివర "దనుజ పలికెడుఁ" అన్నచోట పద్యము చప్పగా విరిగి యూరకున్నది. ఈ విరుగుట మూలముగా ధర్మరాజింతో యసంగతమయిన మాట జెప్పుచున్నాడని వ్యంగ్యము. ఆ ధర్మరాజేమో లోకగురుడు. అతడిట్లను చున్నాడు. అతని మాటలలోని యసంగతత్వము చెప్పరానిదిగా నున్నదని మహాధ్వని. ఇది రచనాకృతమయిన ధ్వని.

మరియొక విలక్షణమయిన భావము.

పాండవు లయిదుగురకు ద్రౌపదియందు మనస్సు తగిలిన దట. అది దైవప్రేరణ యట.

"అలలితాంగియందు నా హృదయమ్ములు దృష్టులునిల్పి పాండుభూపాల తనూజపంచకము పంచశరాహతిఁ బొందె నొక్కతెఁ బాలిక దొల్లి యేవురకు భామినిగా సృజియించి యున్న య య్యాలరి బ్రహ్మచెయ్వి పరమార్థముగాకది యేల యొండగుఁ"

అయిదుగురి మనస్సులు ద్రౌపదియం దొక్కసారిగా లగ్నమగుట బ్రహ్మసృష్టి యట. ఈ పద్యము వ్రాయుటకు లోకముయొక్క ప్రవృత్తియు మనోభావముల సర్వంకష పరిజ్ఞానమును గావలయును. ద్రౌపదిని ద్రుపదు డర్జునుని భార్యగా నగుటకు దపస్సుచేసి కనెను. పాండవులతో నీసంగతి బ్రాహ్మణులందరు చెప్పిరి. మత్స్యయంత్ర మర్జునుడే తెగవేసెను. ఆమె యర్జునుని భార్యయే కావలయును. లోకములో నన్నదమ్ము లయిదుగురుందురు. వా రెంత దుష్టులయినను కావచ్చును. ఒక సోదరునకు సంబంధము వచ్చినప్పుడు

ఆ పిల్లను దక్కినవారు కామదృష్టులతోఁ జూడరు. చూచుట సృష్టిలో నసహజమయినది. అసిద్ధమయినది. ఒకడు మిక్కిలి జారుడు కావచ్చును. మఱొకనికి సోదరుని భార్యతో తరువాత సంబంధము కలుగవచ్చును. లోకమునందలి కామ ప్రవృత్తి యిట్లుండు నిట్లుండ దనుటకు వీలులేదుగదా! కాని యన్నకో తమ్మునకో వివాహము జరుగుచున్నప్పుడు తక్కిన సోదరు లా పెండ్లికూఁతునందు కామభావమును నొందుట సృష్టిలో నుండదు. పాండవులు సామాన్యసోదరులు గారు. సామాన్య మనుష్యులు గారు. పాపరహితులు. ధర్మపరాయణులు. ఇది విశేషము. వా రయిదుగుర నొక్కసారి ద్రౌపదియం దిట్టియూహ కలిగె ననఁగా నిజముగా నది యాలరి బ్రహ్మచెయ్యి.

నన్నయ్యగారి యింకొక శిల్పలక్షణము. ఆయన నానారుచిరార్థసూక్తి నిధి. ఆయన సూక్తులు పైకి సూక్తులుగా నుండును. విచారించినచో నానారుచిరార్థములు భాసించును. నలుడు చీర చించుకొని పోయినపుడు దమయంతి యిట్లు దుఃఖించెను.

"వగవగ సాంగోపాంగము
లగు నాలుఁగు వేదములయు నధ్యయనము పో
ల్పఁగ నొకసత్యముతో నెన
యగునే యవ్వియును బోల వట సత్యంబున్"

ఈవాక్యము సామాన్యముగ సాంగోపాంగ చతుర్వేదాధ్యయనముకంటె సత్య మధిక మయిన దని చెప్పుట. ఈ

యర్థ మింతటితో నవసానము కాలేదు. నలమహారాజు సాంగోపాంగముగ నాలుఁగు వేదములు చదివినవాఁడు.

"అధీతి బోధాచరణ ప్రచారణైః
దశాశ్చతస్రః ప్రణయన్నుపాధిభిః
చతుర్దశత్వం కృతవాన్ కుత స్స్వయం
న వేద్మి విద్యాసు చతుర్దశ స్వయం"

అని శ్రీహర్షుడు. "చతుర్దశసు = చతుర్దశ సంఖ్యాకాసు విద్యాసు వేదవేదాంగాదిషు అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః పురాణం ధర్మశాస్త్రం చ"... ఇవి పదునాలుఁగు. ఇందు వేదవేదాంగములు గలవు. ఈ రీతిగా నలుడు సాంగోపాంగ చతుర్వేదాధ్యయనపరుడు. ఈ విషయమును దమయంతి స్మరించుచున్నది. అతని పాండిత్యము నందు నతని సత్తయందు దమయంతికున్న గౌరవ మీ పద్యము నందు వ్యంగ్యమగుచున్నది. నానారుచిరార్థసూక్తి నిధి యనఁగా నిది యర్థము.

నన్నయ్యగారి లోకజ్ఞత కొక యుదాహరణ మిచ్చెదను. ద్రుపదుడు తన కూఁతును పాండవుల కయిదుగురకు నిచ్చి వివాహము చేయుట కిష్టములేనివాడు. ధర్మరాజును కాదనలేడు. ఈ వ్యవహారము తెగలేదు. ఇంతలో వ్యాసుడు వచ్చెను. వ్యాసుడు ద్రుపదుని రహస్యముగాఁ దీసికొనిపోయి పంచేంద్రోపాఖ్యానము చెప్పి ద్రుపదు నొడంబరచెను. ద్రుపద వ్యాసులు మాట్లాడుచుండగాఁ బాండవులును, గుంతియు

సావడిలోఁ గూర్చుండిరి. వ్యాసుడు రహస్యాలోచన యయి నంతనే బయటకువచ్చి యుధిష్ఠిరున కిట్లనియె.

"నేఁడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ
యుక్తుడై శశాంకు డున్నవాఁడు
మంత్రవంతముగ క్రమమ్మున నేవురు
పెండ్లి యగుడు కృష్ణ బ్రీతితోడ".

లోకములో నయినవారిలో వ్యవహారము తెగనప్పుడు బంధుజ్యేష్ఠుడయినవాడు వచ్చి యొకపక్షమునకు నచ్చఁజెప్పి రెండవవారితో నింక మీపని మీరు చూచుకొనుఁ డతడింక మీకడ్డమురాడు లెండు అని చెప్పును. ఆ యిరు పక్షముల వారు కలిసి మాటాడుకొనుటయే యుండదు. తరువాత వ్యవహారము చేసికొనుటయు రెండవపక్షము వారివలన నభ్యంతరము లేకపోవుటయు ఇదియే పరమార్థము. వ్యాసుడు వచ్చి యిట్లు చెప్పుట నన్నయ్యగారి లోకజ్ఞానమునకు పరమోదాహరణము.

ఇట్టి వనేకము లయిన శిల్పమార్గములు నన్నయ్యగారి యందు సమూహములుగాఁ గన్పించుచున్నవి. ఈ పై నుదహరించిన నైకోదాహరణములలో నొక్కొక్కదానినిగూర్చి విడివిడిగా నెంతయో వ్రాయవచ్చును. స్థలాభావముచేత వ్రాయుటలేదు. ఇదికాక నన్నయ్యగారి యాంధ్రీకరణపద్ధతి యొక్క యాశ్చర్యమయిన విషయము. మరియు పాండవుల రాచఠీవియు, అసలు రాజులయొక్క ఠీవియు, వారి మర్యాద

లును, పాండవులు ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు, కుంతి మొద లయినవారి ప్రత్యేక ప్రత్యేక శీలచిత్రణమును సర్వమును వ్యంగ్యభూతమయి యాశ్చర్యాపాదిగా నున్నది.

రాజరాజనరేంద్రుని రాజవంశ మిట్లుండునా? వారి మర్యాద లిట్టివా? వారి తీవ్రు లిట్టివా? యన్న యూహ కల్పించుచున్నవి. నన్నయ్యగారి పాత్రలు చాల తక్కువగా మాట్లాడుదురు. పాండవులు కౌరవులు మరియు తక్కువగా మాట్లాడుదురు. నన్నయ్యగారు వారు మాటాడుట విస్తరించి వ్రాయడు.

చూడుడు. సాళ్వుడు ద్వారకమీఁదకు దండెత్తి వచ్చెను. అపుడు కృష్ణుడూరలేడు. తక్కినవా రందరు యుద్ధమునకుఁ బోయిరి. సాల్వుడును ప్రద్యుమ్నుడును యుద్ధము చేయు చుండిరి. ప్రద్యుమ్నుడు మూర్ఛపోయెను. సూతుడయిన దారుకసుతుడు రథమును రణమ్మునకు దూరమ్ముగా నిలుపు కొనఁగాఁ బ్రద్యుమ్నుడు తెలిసి వానితో నిట్లనెను.

"విక్రమము విడిచి సమరా
పక్రాంతుడ నయిన నన్ను బలదేవుడునున్
జక్రధర సుతులు ననుజులు
నక్రూరాదులును నేమి యన నగరె ననున్.

వా రందరును "ఏమి" యని నవ్వుదురఁట. నవ్వుట యనఁగా నాక్షేపించుట. ఈ యాక్షేపణ యంతయు 'నేమి' యన్న రెండక్షరములలో నున్నది. మరియొకకవి యయినచో

నిచట నాల్గువృత్తములు వ్రాయును. ఆ రాజవంశముయొక్క శీవి యెటువంటి దనఁగా? తమ యింటిమర్యాద కననుగుణముగాఁ బ్రవర్తించిన యింటిబిడ్డను జూచి కోపముగా, నిందాపూర్వకముగాఁ దిరస్కారముగా "ఏమి" యని యొక్కమాట యనుటయే. ఈ యొక్కమాటతో యాదవవంశముయొక్క మర్యాద, వారి పరాక్రమము, వారి యభిమానము ధ్వనితమై యీ ధ్వన్యర్థము భూమ్యాకాశములు పట్టకుండ నున్నది.

నన్నయ్యగారిది సర్వథా యాలంకారికమయిన రచన. వేంగిదేశపు భాషాపరిషత్తులచేత సునిశ్చితమయిన మార్గము. ఈ మార్గమునే నాలుఁగువందల యేండ్ల తరువాత జగన్నాథ పండితరాయలు తన రసగంగాధరమందు ప్రపంచించినాడు. అటు కాశ్మీర, మిటు వేంగిదేశము అలంకార శాస్త్రమునకు రెండు సూర్యోదయ పర్వతములవలె నున్నవి. అభినవగుప్తుడు కాశ్మీర దేశవిద్వన్మార్గమును బ్రపంచింపగా జగన్నాథ పండితుడు వేంగిదేశ విద్వత్పరిషన్మార్గమును ప్రపంచించెను. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అన్న జగన్నాథుని సూత్రము జగన్నాథ పండితుని కల్పనకాదు. ఇది వేంగి పరిషత్తుల నిశ్చితాభిప్రాయము. నన్నయ్యగారాదిపర్వము వ్రాసిన తర్వాత దన గ్రంథము వేంగిపరిషత్తులకు వినిపించెను. వారియొక్క కావ్యసృష్టి పరమార్థమిట్టిది. "శబ్దము రమణీయార్థ ప్రతిపాదకముగా నుండవలయు" నన్నది. ఆ పరిషత్తులు నన్నయ్యగారు తరువాత వ్రాసిన సభాపర్వము యొక్క రెండాశ్వాసములు, అరణ్యపర్వముయొక్క మూడా

శ్వాసములు చివర ౧ అతిరమణీయంబైన ౨ అతిరమణీయంబు గాను 3 అతిరమ్యంబుగాను ౪ రమ్యంబుగానని వ్రాయుచు వచ్చెను. సభాపర్వము రెండవ యాశ్వాసముచివర నీ విశేష ణము లేదు. అది వినపించలేదేమో? అచ్చుపడ్డ పుస్తకము లలో లేదో? ఆహా! యేమి వెంగిపరిషత్తులు! ఏమి నన్నయ్యగారు!

పరమ వివేకసౌరభవిభాసిత సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్రపావన పయఃపరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనమ్ముల ముదంబొనరన్ గొనియాడి మ్రొక్కెదన్”

ఈ చివరి వ్యాసము నన్నయ్యగారి భాషనుగురించి వ్రాయుదు నని చెప్పితిని. భాష సర్వదా రెండు విధములు, కవితాదృష్టితోఁ జూచిన భాష యొకటి. రెండవది భాషా దృష్టితో జూచిన భాష. కవితాదృష్టితోఁ జూచిన భాష మహాకవి విషయమున నాలంకారికముగాఁ జూడదగినది. అది లాక్షణికమైన దృష్టి. ఆ దృష్టి ప్రచురముగాఁ గలిగిన యొక మహాకవి గ్రంథమును భాషాదృష్టితోఁ జూడబడిన భాషగాఁ జూడరాదు. మహాకవియందు భాష యౌచిత్య సంపాదకమై దాని స్వరూపము రసమయమై యుండును. ఇచట నిది సంస్కృత మిది తెలుఁగు, ఇది యర్థవిపరిణామ, మిదిలక్షణ మొదలయిన విమర్శలు పనికి రావు.

కాని రసానుభూతి రసానుభూతియే, విమర్శన విమర్శ నమే యన్నచో గానిండు. నన్నయ్యభాషలో నిది సంస్కృత

మిది తెలుఁగని లేదు. ఇది యాంధ్రభాష. భాషయొక్క ప్రాణము తత్సన్నివేశమునందు దదుచితభాషను వాడుటలో నుండును. అనుటతోడనే యిది యాలంకారిక మైపోయినది. అట్టి నన్నయ్య భాషనుండి యీ తెలుఁగుశబ్ద మిట్లు వాడినాడు. ఈ సంస్కృత మిట్లు వాడినాడని చెప్పుట యఖండ గోదావరిలో నివి శబరినీళ్ళు, ఇవి కిన్నెరసాని నీళ్ళని చూపింపఁ బోయినట్లుండును. అయినను శబరీ జలాభిమానులు. అన్య శాఖానదీ జలాభిమానులు, తద్విమర్శయొక్క సంగతా సంగతత్వములను వదలి యభిమానపురస్సరముగా మాటాడుట మానరు. వారి కఖండ గోదావరీజ్ఞానము లుప్తమే యయినది. కాదు. వారివలెనే విమర్శించి చూతము.

ఈ దృష్టితో జూచినపుడు భాషయొక్క యాయువు పట్టెచట నుండును? ఏభాష దీసికొనినను పరభాషాపదము లధికముగనుండును. ఇంగ్లీషుభాష చూచినచో ఫ్రెంచి, లాటిన్ శబ్దము లనంతములు. జర్మనీ యుద్ధము గెలిచినను నింగ్లీషువారి భాష జర్మనుభాషను గెలువ లేదు. అనేకములైన జర్మన్ భాషాశబ్దము లింగ్లీషులో వచ్చి కూర్చున్నవి. భాషకును మానవునకు జాల భేదమున్నది. పరభాషా శబ్దములు సంస్కృతములోనను జాల నున్నవని చెప్పవచ్చును. మరి తెలుగుభాషలో సంస్కృత శబ్దములు చేరుట తప్పే మున్నది. ఆలంకారికదృష్టితో దప్పుకాదు సరికదా మిక్కిలి యొప్పు. వర్గ ద్వితీయ చతుర్థాద్యక్షరములు లేని తెలుగుభాష యక్షరాశ్రితమైన కావ్యగుణములను సంతరించుకోలేదు.

మఱియు భాష జాత్యాది గుణవాచకములైన శబ్దములు మాత్రమే ప్రాణముగాఁ గలది కాదు. ప్రతిభాషకు నొక విశిష్టమైన పలుకుబడి, నుడికారము నుండును. వాక్యాన్వయమున భాషాస్వభావము భాసించును ఆ వాక్యములలో నున్న శబ్దములన్ని తత్సమములు కావచ్చును. వాక్యము తెలుఁగు వాక్యమై యుండును. మాటలన్నియు తెలుఁగుమాటలై వాక్యము తెలుఁగు భాషది కాకయు నుండవచ్చును. ఇట్టి భేదము లనేకము లుండును.

భాషకు నుడికారము ప్రాణము. ఈ నుడికారము నన్నయ్యయందు సమృద్ధిగా నున్నది. తెలుఁగువాక్య రచన యనంతముగా నున్నది.

అనేక సంస్కృతశబ్దము లర్థ విపరిణామము బొంది దేశభాషలలోఁ జేరును ఉపన్యాసము, లేఖ, ప్రబంధము మొదలైన సంస్కృత శబ్దముల యర్థము తెలుఁగులో వేరు. హిందీలో వేరు. ఇట్టి యర్థవిపరిణామము బొందిన సంస్కృత శబ్దములు తెలుఁగుశబ్దములే యగును. వానిని దెలుఁగుజాతి వాడినట్లు వాడుట తెలుఁగుభాషను వాడుటయే.

"మాయందు లేని గుణములు
మీ యనురాగమున జేసి మిగిలి వెలింగెన్
మీ యనుగతి మాకు నభి
ప్రాయము వనవాస దుఃఖభర మోపుదురే?"

అభిప్రాయమన్న శబ్దము 'ఇష్ట' మన్న యర్థములోఁ దెనుఁగున వాడుట కలదు. ఇక్కడ నట్లే వాడఁబడి యున్నది.

శబ్దము సంస్కృతమైనను వాడుక తెలుఁగు వాడుక ఇది చాల చిత్రమైన తెలుఁగు. ఇట్లే విపరిణమితార్థములైన బహుశబ్దములను నన్నయ్యగారు వాడి యందము దెచ్చెను. ఇవియు జాతీయములు కాదనుటకు వీలులేదు.

"ఈ యున్న పౌష్యుప్రోలికి
పోయి కడుఁ బెద్దదవ్వు పోయినయట్లు"

ఈయున్న యనుటచేత "సంత దగ్గఱలో నున్న" యని యర్థము. తెలుఁగుజాతి యిట్లు వాడును. ఇట్టి ప్రయోగములు నన్నయ్యగారియందు గుప్ప తెప్పలు.

"ఈ యగ్నిదేవు డసురకు
నోయన జెప్పుటయు".

"భూనుతకీర్తి బ్రాహ్మణుడు పుట్టుడదోడన పుట్టు నుత్తమజ్ఞానము".

తెలుఁగుజాతి సరిగా నిట్లే వాడుకొనును. ఆ గుణము వానితోడనే పుట్టినదని, ముందాగుణము పుట్టి తరువాత వాడు పుట్టినాడని, వాడు పుట్టగానే యా గుణము పుట్టినదని తెలుగువాండ్రు సమృద్ధిగా వాడుకొను జాతీయము.

"తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మగా నొడివియు సత్య మిచ్చియు చనన్"

'సత్య మిచ్చుట' లోకములో మనము మనసిచ్చి మాటాడుట యందుము. ఆ రీతిగా 'సత్య మిచ్చుట' గా వాడినాడు.

"హృదయంబున నతడు పెద్ద యిష్టుడు మీకున్"
వాడు నీకు బెద్ద స్నేహితుడుగదా! నీకు బెద్ద కావలసిన వాడుగదా! అని యిది తెలుఁగుజాతి చేయు నాక్షేపణ వైఖరి.

"ఉడుగక మే మధికము ప
లెక్కుడువారము నీవు హితవు క్రియ గొనఁగా బ
లెక్కుడు వాడవు"

ఇదియు దెలుఁగువారి గడుసుదనపు పలుకుబడియే.

"ఈ వ్యాధి యొంట దీరదు."

అని నన్నయ్యగారు వ్రాసిరి. లోకములో నేదియో జబ్బుచేయఁగా దాని యంతట నది పోవునేమో యని కొన్నా ళ్ళూరకొందుము. ముదిరినప్పుడు వైద్యునికడకుఁ బోదుము. ఒక్కొక్కప్పుడు కొన్ని వ్యాధులు వాని యంతట నవి సద్దుకొనును. ఈ యర్థమునే "యీ వ్యాధి యొంట దీర" దని చెప్పెను

"అతని బాహువిక్రమము
ను తలఁచిన నాడు కన్నుమూయదు నాకున్"

కన్ను మూతవడ దని యర్థము. ఇంతకన్న జాతీయ మెట్లుండును? అర్జునుడు పాశుపతాస్త్ర సంపాదనకుఁ బోగాఁ "బాంచాల రాజపుత్రి తద్వియోగతాపంబైన హృదయం బెట్టకేసియు నొక్కండ నేసికొనియుండె"

లోకములో మనము "వాడు మొగమంత చేసికొన్నా" డని యందుము. సరిగా నట్లే యున్నది.

"దేవా, నా కిష్టంబైన వరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్రలాభంబనిన నదియేమి గహనంబు దానిన యిచ్చెద"

"ఏమి గహనంబనఁగా 'నేమి కష్ట' మని యర్థము. తెలుఁగువారి వాడుక.

"దుర్యోధనుండు దుర్బుద్ధియని యేమి చెప్పవలయు?"

అనఁగా 'నతడు దుర్బుద్ధియని చెప్పవలయునా?' యని కాకువు. అచ్చమైన తెలుఁగుదనము.

"అరయ నిది కోపమునకు ననవసరంబు"

ఇచట 'నిది' 'యనవసరము' – ఈరెండు మాటలు మన మిప్డే వాడునవి. 'ఇది' యన్న శబ్దము ప్రయోగ రమణీయము కాని యర్థ విచారణాసహము ఏదో యర్థము పొసగింపలేక పోము. 'ఇది' 'మరి' మొదలైన శబ్దములు తెలుఁగులో వాక్యాలంకారములు.

"జలరుహాసంభవు డాదిగ
గల వేల్పులు ఋషులు సిద్ధగరుడోరగులుఁ
నెలనెల సేవింతురు."

'నెలనెల సేవింతు రనుట యచ్చముగా దెనుగుమాట. మఱియు—

"కాలకేయులు మహాకాయులు పగలెల్ల
జలదుర్గ బలమున జలధినుండి
రేలెల్ల చని నలిరేగి"

పగలు. రేలు—పగలేక వచనము, రేలు బహువచనము. ఇది సరిగాఁ దెలుఁగువాండ్రు వాడు వైఖరి. (పగలీ పని చేస్తాడు. రాత్రి ళ్ళీ పని చేస్తాడు) అని వాడుదుము. నన్నయ్యగారల్లే తెలుఁగువారికివలెనే వాడెను. ఈ వాడుకలో నొకచమత్కారమున్నది. 'పగలు' జాత్యేకవచనము. మనుష్యుని జీవితము జాగ్రదవస్థాయాపనము. అదియంతయు నఖండము. అందుచేత నేకవచనమే. 'రాత్రి' యనుమాట నట్టి నిశార్థకమేకాక లక్షణచేత నజ్ఞానము, నరకము, నంధకారము నను నర్థము లిచ్చును. 'వాడు వట్టి యడవి', 'అదొక చీకటి' ఇవి నిత్య వ్యవహారములు. అందుచేత రాత్రి పర్యాయవాచకము లేకవచన ప్రయుక్తములై యాకృష్ట లక్షణార్థములగును. కావున తద్వాచకము లన్నియుఁ దల్లక్షణార్థానపకర్షణముకొఱకు బహువచనమునందు వాడఁబడుచున్నవి. ఇది తెలుఁగుజాతియొక్క వాడుకభాషలోని యిచ్చటినిగూఢార్థము. అది తెలిసికొని యట్లే వాడుట తెలుఁగుభాషయొక్క యాయువుపట్టు తెలిసికొని వాడుట.

ఇట్లెన్నియేని చూపించ వచ్చును. నన్నయ్యగారు వాడిన భాషలో నిది యొక జాతిది.

మరియొక విధమైన భాష. ధాతువును నామ వాచకమునకు జోడించుటలో నొక చమత్కారము పుట్టును. ఆ సందర్భములందును జాతీయత గోచరించును.

"అ కు-ండలంబులు తోడుగ నవసరంబై యున్నది"

ఆకుండలంబులు ధరించుట యనియే యందరందురు. నన్నయ్యగారు తొడుగుట యనియే యనును. తొడుగుట యనఁగా నలంకరించుట. దీనిమీఁది కృదంతము 'తొడవు' 'నగ'యని యర్థము. కుండలములు సంస్కృతశబ్ద మని విచారింతమా? కుండలములు 'తొడుగుట' యనునది యింత జాతీయముగా నున్న దని విచారింతమా?

"నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల బాధ్యమానులై సలిపిరి దీర్ఘవాసర నిశల్."

'మన మిప్పటి డివ్వనమున బహుమూఁడు మాసములు సలిపిలిమి'

ఈసలుపు ధాతువుయొక్క ప్రయోగ మిట్లు పెరచోట్ల లేదు. నన్నయ్యగారిదే. ఈ రీతిగా క్రియారూపమును జోడించుటచేతఁ దెలుఁగుదన ముట్టిపడును. ఇదియొక ప్రయోగ వైచిత్రి.

"దైత్యులఁ గెలయఁగ నోర్చియున్న రణ వీరుల కావుట నీ వెరుంగవే."

వారు "ఆ రణవీరు లగుట నీ వెఱుఁగవా?" యని యర్థము. ఇదియు జక్కని తెలుఁగు. 'అగు' ధాతువుమీఁది కృదంతము 'కావుట'. ఈ యగు ధాతువు తెలుఁగుభాషకు బ్రాణభూత మైనది. అనేకములైన తాత్కాలికార్థములను తెలుఁగుభాష యీ 'యగు' ధాతువుచేత సంపన్నము చేసికొనును. పరిణామ, విపరిణామ, తథాత్వ, ముఖ్య బహ్వర్థములను తెలుఁగులో 'అగు' ధాతువు చెప్పును.

"వాతాపి నెప్పటి యట్ల సంస్కరించి—యగ్గలముగఁ జేసి కంఠముదాక"

"నంజుళ్ళు తెప్పించి యాస్వాదించి."

స్వయంవరము సేయఁగడగి"—"పదియడుగు లరుగుము నీకు శ్రేయఃప్రాప్తి సేసెదము."

ఈ రీతిగా సంస్కృతాంధ్రములను మిశ్రణము సేయుట వలన నొక తెలుఁగుభాషయొక్క స్వభావము తెలియును. మఱియు "కడునెండ నెక్కనంతకు"—"పీనచేత దలంపఁబడి యెడువనిత పీనకంటె లెస్సది" "అతసని వే ల్పనగవలయు" "ఎల్ల వారికంటె నెరుకగలవు"—"ఎంత యోటువడిన నంతియ జూదంబు నంత తగులు" "పూసికట్టి తొడిగి" "అం దెవ్వడు పొడిచి యొడిచె నతసన వలతుణా" "ముకుసుళులు తమ కిమ్ముగాఁ జదివికొంద్రు"—"గాడ్పుసూలి పిరుదు గావంగ"—

ఇట్టి యచ్చ తెలుఁగులు, లోకోక్తులు నన్నయ్యగారి భారతమునం దంతట నుచితస్థలంబులఁ దప్పకుండ నుండును.

"భార్యను బుత్రుల నర్థయుక్తితో
నోలిన మేలుగాఁ బడసి యూళ్ళను నున్నది, యట్లుకాని నా
కేల గృహస్థవృత్తి"—

"ఊళ్ళను నున్నది యునికి" యని యధ్యాహార్యము. చొనురుగా నిట్టి ...డుక లేకపోలేదు.

నన్నయ్యగారి దిదియొక విధమైన భాష.

ఇవిగాక నన్నయ్యగారు దేశ్యశబ్దములు సమృద్ధిగా వాడుదురు. అంతచక్కఁగా వాడినవారు తరువాత కనపించరు. 'గోష్ఠము'లకు 'తొట్టిపట్లను' వాడుదురు. ఇది యానాటి సంపదను, దేశపరిస్థితినిఁ జెప్పును. వారు వాడిన కొన్ని దేశ్య శబ్దములకు శబ్దరత్నాకరకారునకుగూడ నర్థములు కుదురలే దేమో!

"ఆన్మలో నిడుగడఁ జేయుచుఁ"

ఇడుగడ, ఒక్కెర, ఒక్కఱి, కెలసము, లేడి, ఇఱ్ఱి ఈ రెండుశబ్దముల భేద మెఱిఁగి వాడుట.

"మనసిజరాగంబున పెరిగిన లేడిని నిఱ్ఱిచూచి"

ఉదరిపడి, తొడిపూసి కట్టి, అరకడ బెట్టికొని, చిడిపి కుఱ్ఱి, సాదువులు, కడవసములు, కోలలు కప్పడములు, డీల పోవక, పెడిలి సువర్ణపర్వతము, ఇందులో పెడిలి శబ్దము, పసిండి తళిగలు, ఏపుటడవి, ఎయ్యెని యొక్క దివ్య పురుషుండు, అఱపోఱను మఱుచచేతులు, ఒఱవ, నంజుళ్ళు తెప్పించి, ఇట్టి తెలుఁగు మాటలు కుప్పలు తెప్పలుగా నుండును.

మఱియును కవి తన ప్రతిభాశక్తిచేత నొక భాషను సృష్టించును. ఆ భాష నిత్యము వాక్యరూపముగా నుండును. స్థూలముగాఁ జదివెడు పాఠకునకు నాభాష భావమువలెగూడ దోఁచవచ్చును. ఇట్టివానిని ప్రౌఢప్రయోగము లందురు. "ఎల్లవారికంటె నెఱుకగలవు" "విదితముగ నిన్ను జేయుంచెద

గ్రతువు" "కమ్మని జడలతో" "నగ్షము తడసె భవద్దేశమునకు" "కర్ణుండు పదాఱవ కళకు సమానుండు కాఁడు" "వీనిచేతఁ దలంపంబడెడు వసత వీఁకంటె లెస్సది కాకున్న" "మఱచి నిద్రించి" "యెగచి యెగచి నెంచు నెగయకుండఁగ" "మఱి నీ కారుణ్యం బింతకంటె కడు దవ్వేంపుదురె" "సమయాబ్ధులకంటె ముందర మహోత్సాహంబునఁ" "మదము వలుకఁ" (మదించిన మాటలు మాటాడుట యనియర్థము.) "ఏసిన యమ్ముగ్నుంబోలె నతివేగంబున" ఇట్టి వనేకములు.

నన్నయ్యగారి వచనములు రకరకములుగా నుండును. ఆ వచనములను నొకప్పుడు కావ్యప్రయోజనము మొదలైన ప్రయోజనము లుండఁగా తాను వాగనుశాసను డగుటచేత శబ్దరూపమును బోధించుచున్నట్లు కొన్నిచోట్ల వ్రాయును.

"నూఱేసి భద్రగజంబులను, వేయేసి కాంభోజహయంబులను, పదేసివేలు దాసీజనంబులను, నూఱేసివేలు పాడిమొదవులును"

ఇచట నీ ప్రత్యయముయొక్క ప్రయోగ వైలక్షణ్యమును బోధించుట యున్నది. 'పదేసివేలు' 'నూఱేసివేలు' 'పదివేలు పదివేలు' 'నూఱువేలు నూఱువేలు' అన్న యర్థ సంపాదనకొఱకు "ఏసి"యన్న ప్రత్యయము నేకవచనాంతము మీఁదనే ప్రయోగింపఁబడవలయు నన్నట్లు వ్రాసెను. 'పదివేలేసి, నూఱు వేలేసి' అని వ్రాయలేదు.

'ఒండె' యన్న శబ్దము వికల్పార్థమునందు వాడబడు ననుటకు "పాండవుల విడుచునట్లుఁగా భేదింత మొండె, తమ

లోన విరక్తు లగునట్లుగాఁ జేయుంత యుండె, ద్రౌపదివలన విరక్తి పుట్టింత యుండె''

నన్నయ్యగారు తన రచనలో భావి కవిలోకమున కుపదేశకముగా, మందప్రతిభులకు మార్గోపదేశముగా తనదైన దివ్యమైన వస్తుధ్వని ప్రధానభూతమైన కావ్యరచనా మహాశిల్పమార్గము నెఱుఁగని యెరుగలేని యితరకవులు కతిపయ భావసంపన్నులు, పద్యరచనాశిల్పధురీణులు భిన్నసంస్కార వశమున లోకమునందు జనించుచునే యుందురు. వారందరికు తలా యొకమార్గము వేసిపోయెను. తరువాత వచ్చిన గొప్పకవు లందరి మార్గములు నన్నయ్యగారియందు గన్పించుచునే యుండును. ఒక్కొక్కని కొక్కొక్కడు రుచి. తనకు రుచి యయిన మార్గముననే ప్రతికవియును బోవును. నన్నయ్యగారు తాను రచించు రచనలో నెచ్చట నేది యుచితమో యది వ్రాయును. ఈ క్రిందిపద్యములు చూడుడు.

"తమ్ముల యట్టుల తనకు వ
శమ్మయి ధర్మువును ధృతియు సత్యము గారు
ణ్యమ్మును నొప్పఁగ పేర్మి వి
జమ్మగ మను ధర్మజున కసాధ్యము గలదే?"

"కురుముఖ్యులు ధృతరాష్ట్ర వి
దుర భీష్ములు గురులు మాకు ద్రుపద ప్రభుడున్
గురుడు మురాంతకుడె జగ
ద్గురు డిందర మతమునను నగున్ శుభయుక్తిన్.

"కడునధికుఁడోడఁ దొడరిన
పొడిచిన నొడిచినను పురుషః బురుషగుణం బే
ర్పడుగాక హీను నొడుచుట
కడిదియె పౌరుషము దాన కలుగునె చెపుమా"

"ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగ
మెదలుచున్న వ్రయ్య లదిమి రెంటి
కూడఁబట్టి నవియుగూడి యొండొంటితో
చక్కనంటి రెండు నొక్కటయ్యె"

"నయనములు నాకు పవనత
నయ విజయులు మనము కమలనాభుడు వీరిఁ"

"అసన మురవైరి పలుకులు
విని బార్హద్రథుడు భూరివీర్య మదున్నం
దను గోరికొనియె సీతం
డని నెనయగు నాకు ననుచు నతి దర్పితుడై."

"బలియు డపుడు వెంద్రుకలు పాచి ముడిచి
గంటెనగతాల్చి వీర రసికవృత్తి"

ఇట్లనేకోదాహరణములు చూపించ వచ్చును. ఇవన్నియుఁ దిక్కన్న గారికి మార్గదర్శకములు. చివరి యుదాహరణలో 'వెంద్రుకలు పాచిముడుచుట' తత్సన్నివేశోచితానుభావ వర్ణన చేయుటయు 'వీరరసిక వృత్తి' యనుగుణాభాయకమైన శబ్దము ప్రయోగించి రసము వాచ్యము చేయుటయు వాచ్యమైన 'వీరరసిక' శబ్దమునందు వాచ్యార్థ

మాధుర్యమును సంగ్రహించుటయు తిక్కన్నగారు వృద్ధి పొందించిన మార్గమిది.

ఈ రీతిగాఁ బ్రసిద్ధులైన సత్కవులు నన్నయ్యగారిని సమృద్ధిగాఁ జదివి తమకు సహజమైన శైలి నెన్నికొని నేర్చి కొని తీర్చికొనిరి. తిక్కన్నగారి గడుసుమాటలలో సగానికి సగము నన్నయ్యగారియొద్ద దెచ్చుకొన్న ట్లుండును.

"తాలాభ మగు విల్లుదాల్చి విరోధుల నెగుచుచునున్న వాఁడింద్ర తనయుఁడు"

"ముదుసళులు తమ కిమ్ముగాఁ జదివికొంద్రు"

"పూసికట్టితోడి", "గృహాగతంబైన సర్పంబునుంబోలె నెప్పుడు నుద్వేగ కరుండగు"

మొదలైన వెన్నయో తిక్కన్నగారు పుడికి పుచ్చి కొన్నారు.

మరి శ్రీనాథకవి—

"హరుశరమును నరుశరమును
సరి నిరుపక్కియలు తాకి జవమరి శరసం
భరమునఁ దిరిగె వరాహము
శరనిధి మథనమునఁ దిరుగు శైలమువోలెన్"

"అమరలోక నివాసుల యంద్రు విబుధు
లా కురుక్షేత్రవాసుల నదియు వినఁగ
నుత్తమంబు దృషద్వతి యుత్తరమున
తానతేజ సరస్వతి దక్షిణమున"

ఇట్టి పద్యము హరవిలాస, భీమఖండరచనా చమత్కారమునకు ప్రాతిపదికలు.

మఱియు విజయ విలాసాదులైన సుకుమార కావ్యములకు మార్గదర్శకమైన రచన.

"నన్ను నీ సర్వ మెల్ల నిం కున్న వారు
వార యెరిగి చేయుదురు వివాహ మనుచు
వనజనేత్ర కన్యాపురంబునకుఁ జనియె
నరిగె తన లతాగృహమున కర్జునుండు.

విశ్వకర్మ యింద్రప్రస్థపురమును నిర్మించి పాండవుల కిచ్చెను. అచట నన్నయ్యగారు తొమ్మిది పద్యములు వ్రాసెను. ఇది ప్రబంధకవుల కెల్లరకుఁ జేసిపెట్టిన మార్గము.

ఇట్లనేకోదాహరణములు నన్నయ్యగారినుండి సర్వకవులకు మార్గదర్శకములైనవి చూపించవచ్చును. అక్షర సన్నివేశ చారుత్వాభిజ్ఞులు, భావభేద విచ్ఛిత్తిమార్గ సూక్ష్మ పరిజ్ఞాతలు నైన భావుకులకే యీ చెప్పినదాని రహస్యము తెలియును.

ఇట్టి యనంతమైన పద్యవిద్యకు నన్నయ్యగారు గురువు. ఆయన యీ మహావిద్య కాద్యుడు. ఎన్ని మార్గముల తెలుఁగుభాషయందు పద్యరచన సాఁగవచ్చునో యన్ని మార్గములకు నయ్యెయెడల సూచనగా పునాదులు వేసెను. ఏ కవికేది రుచియో దాని నా కవి పెంచి పెద్దది చేసి తనదిగాఁ జేసికొనెను.

సారాంశ మే మనఁగా నన్నయ్యగారివంటి యనంత ప్రతిభాశాలి సర్వభావములు సర్వరసములు స్ఫురింపఁజేయు ననంతముఖమైన వాక్కు కలిగిన మహాకవి. ఏ కథకు నే భాగమునకు నే శయ్య యే శబ్ద మెట్టి రచన యనుకూలమో నిసర్గ పరిచితి దక్షమై వెలార్చు శక్తిమంతునకు నీ సర్వమార్గములు ననంత వైచిత్ర్యసనాథ యయిన సరస్వతియొక్క ప్రసాదములుగల మహాకవి యర్థము.

నన్నయ్యగారు నే నీ పైన జూపించిన సర్వమార్గములకుఁ దా నాద్యుఁ డని తనకుఁ దెలిసినవాఁడు. పద్యవిద్యకు దా నాద్యుఁడు.

"హరిహరాజ గజాననార్కష
డాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతి
[illegible]న్నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధికుఁ గురు
పద్యవిద్యకు నాద్యునం
[illegible]బురుహ గర్భనిభుం బ్రచేత సు
పుత్త్రు భక్తిఁ దలంచుచున్"

వాల్మీకిని స్తోత్రము చేయుచు దానును వాల్మీకివలె గురు పద్యవిద్యకు నాద్యుఁడ నని స్ఫురింపఁ జేసెను.



## గద్య గ్రంథములు

| | |
|---|---|
| వేయిపడగలు | 12-0-0 |
| చెలియలికట్ట | 3-0-0 |
| మా బాబు | 3-0-0 |
| ఏకవీర | 3-0-0 |
| బద్దన్న సేనాని | 3-0-0 |
| జేబుదొంగలు | 3-0-0 |
| ధర్మచక్రము | 3-0-0 |
| హాహాహూహూ | 1-0-0 |
| వీరవల్లడు | 1-0-0 |
| కిన్నెరసాని పాటలు | 1-8-0 |

## పద్య గ్రంథములు

| | |
|---|---|
| ఆంధ్ర ప్రశస్తి | 1-8-0 |
| ఝాన్సీరాణి | 2-0-0 |
| విశ్వనాథ పంచశతి | 2-0-0 |
| గిరికుమారుని ప్రేమగీతాలు | 2-0-0 |
| వరలక్ష్మీత్రిశతి | 2-0-0 |
| శశిదూతము | 1-0-0 |
| మాస్వామి; తెలుగుఋతువులు | 1-4-0 |
| శృంగారవీథి | 1-8-0 |

శ్రీమద్రామాయణ కల్పవృక్షము

| | |
|---|---|
| బాలకాండము (అచ్చులో నున్నది) | |
| అయోధ్యాకాండము | 4-0-0 |
| అరణ్యకాండము | 4-0-0 |
| కిష్కింధాకాండము | 4-0-0 |

## నాటకములు

| | |
|---|---|
| త్రిశూలము | 1-8-0 |
| నర్తనశాల | 1-8-0 |
| కావ్య-వేద హరిశ్చంద్రుడు | 1-0-0 |
| అనార్కలీ | 1-8-0 |
| వేనరాజు | 1-8-0 |

## యితరములు

| | |
|---|---|
| చిన్నకథలు (సంపుటము ౧) | ౨-౮-౦ |
| నన్నయ్యగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి | 2-0-0 |